# శాశ్వత పరిపోషణ

రచయిత

డాక్టరు జె. సి. కుమారప్ప

అనువాదకులు

తత్వానందస్వామి



ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ (రిజిష్టర్డు)

తెనాలి : మద్రాసు : సికింద్రాబాదు

1—[illegible]—0

1949

వెల 1—[illegible]—0

Copyright]

# ఆంగ్లేయమున వ్రాయబడిన (PERMANENT ECONOMY)

# శాశ్వతపరిపోషణ అను గ్రంథమున వ్రాయబడినపీఠికకు అనువాదము

లోగడవ్రాసిన "గ్రామోద్యోగ మెందులకు?"(Why the village Movement) అనుగ్రంథమునందు. భారతదేశపరిస్థితులను ప్రధానపాశ్చాత్య దేశములందలి పరిస్థితులతో పోల్చివిచారించి యుంటిమి. ఇప్పుడీ చిన్నపొత్తమునందు, మనదేశ ప్రజయొక్క నైజగుణముల కనుకూలముగ నుండు వాస్తవిక లక్ష్యార్థమును గురించిన విచారణను సాగింతుము.

ఈ నాడాచరణలో సాగుచున్న మతము ఆచారబద్ధమును కర్మకలాపబహుళమునై చాల వఱకు నడుచుచున్నది. ప్రజలయొక్క అనుదినచర్యలపైన దానిప్రభావము కొఱవడి యున్నది. కావున దానియందు పెక్కండ్రు విశ్వాసమును విడిచివేసినారు. మతమనగా త్రోసిపుచ్చ వలసిన మూఢాచారమనెడు భావమేర్పడినది. జీవితమునుండి మతము నెడబాటు చేయుటకు సహజ పర్యవసానముగా "వ్యవహారము వ్యవహారమే" అనెడుపాటుతో, ఆర్థికచర్యలనుండి నైతికదృష్టి దూరము చేయబడినది. సాంప్రదాయక విజ్ఞానగ్రంథములందు, మతము, సంఘనీతి, ఆర్థికశాస్త్రము అనువాని నన్నింటికిని ప్రత్యేకముగా వేర్వేఱు క్షేత్రములు నియమితములై యున్నవి. పరస్పరసంబంధ మినుమంతయులేని విభిన్నశకలములుగా వరుకు విభజింపబడి యుండెను. కుడిచేయి చేయుదానిని ఎడమచేయి యెఱుగజాలదయ్యె. అట్టి విభజనను ప్రకృతి సహింపదు. జీవితమునంతను నొక్కపూర్ణవస్తువుగ ప్రకృతి పాటించును. కావున యీ చిన్నపుస్తకములో, మానవ జీవితముయొక్క అనుదినసమస్యాజాలమునంతటిని, ఒకేఅవిభాజ్యవస్తువుగ దీసికొని, ఆయాప్రకరణములకు సంబంధించిన వివిధసిద్ధాంతములను సమన్వయముచేయు ప్రయత్నము గావింపబడినది.

మన పారమార్థిక వ్యక్తిత్వమునకు వ్యావహారిక జీవితమునకును తిరిగి సంబంధము గల్పించుటే యీ ప్రస్తుత విచారణకు గమ్యార్థమై యున్నది. మన పారమార్థిక వ్యక్తియొక్క ఆదేశముల కనుగుణముగ మన అనుదిన వ్యావహారిక సామాన్య కార్యక్రమమును సరిదిద్దుకొనుట కది తోడ్పడగలదు. ఈ నాటి సాంప్రదాయక మతాచారములు అనుదిన జీవితవ్యాపృత్తులకు సంబంధించని లోకాంతర ప్రసక్తి కలవిగానుండి వ్యర్థకార్యకలాపముగ సాగుచున్నది. వాని యునికికిని వాని చర్యలకును ప్రయోజనమును చేకూర్చు జీవన విధానమును కనుగొను ప్రయత్నము నిందుగలదు. సమస్త జీవనగతులను

విశ్వజీవన వృత్తమున క్రమసరణముగ కూర్చు ప్రయత్నమును ఇందుచూపట్టును. మతాచార పరాయణులు శాశ్వత జీవనము లేక 'భగవదనుసంధానము' అని పేర్కొను జీవన చర్యము నరుని పైనందిన జీవనచర్యల సమైక్యత 'శాశ్వత పరిపోషణ' మనెడు ఈ గ్రంథనామమునందు సూచింపబడియున్నది.

ఈ ప్రయత్నము వినూత్నమై తోచవచ్చును. కాని యిందు లక్ష్యముగా చేకొనబడిన యుద్యమమును సాధించుటకగు మార్గములను సదుపాయములను విచారణ చేయునటుల నితరులకు ప్రేరణ గల్పింప జాలుచో అది సఫలమైనట్లే యెంచదగును.

ఈ పుస్తకమును సమీక్షచేసి సలహాల నొసంగిన గాంధీజీకి నా నమస్కృతులు.

ఈగ్రంథవిషయములు చక్కగ నర్థమగుటకొఱకు బొమ్మల రచించి యిచ్చిన శిల్పి మహాదేవ సత్వలేఖరుగారి యెడ నేను కృతజ్ఞుడను.

మగన్వాడి. వార్ధా (మ. ప)
24 ఆగస్టు 1945

(సం) జే. సి. కుమారప్ప

# జె. సి. కుమారప్ప గారి గ్రంథమునకు

## గాంధీ మహాత్ముని తొలిపలుకు

‘జీసస్ ఉపదేశములు - ఆచరణ’ అనెడు చిన్ని పుస్తకమువలెనే “శాశ్వత పరిపోషణము” కూడ డాక్టరు కుమారప్పగారు జైలులో వ్రాసిన గ్రంథమే. దీని నర్థము చేసికొనుట మొదటిదాని నర్థము చేసికొనుటంత సులభముకాదు. దీనిని బాగుగ గ్రహించ వలయునన్నచో, రెండుసారులో, మూడుసారులో శ్రద్ధగ చదువవలసి యుండును. దీని వ్రాత ప్రతిని నేను చేతబట్టి నప్పుడు దీనిలోపల నేముండునాయని వింతపడితిని. మొదటి అధ్యాయమే నావింతను తృప్తిపఱచినది; మఱియు విసుగులేకుండ ప్రయోజనకరమై నాచదువు తుదివఱకు సాగినది. ఈ గ్రామపరిశ్రమల బోధనాచార్యుడు నేను మనచుట్టును గోచరించు క్షణభంగుర స్వభావముగల పరిపోషణమునకు (Economy) మారుగా శాశ్వత పరిపోషణమును చేరుకొనుట ఆ గ్రామపరిశ్రమల ద్వారముననే ఘటిల్లునని తెలుపుచున్నాడు. ‘శరీరము విజృంభించి ఆత్మను నణంచివేయ వలసినదేనా? లేక ఆత్మయే విజృంభించి నశ్వర శరీరముయొక్క కొలదిపాటి యవసరముల దీర్చుచు అనశ్వర ఆత్మను సంసేవించు స్వేచ్ఛను బడసి ఆ శరీరద్వారముననే స్వప్రకాశ ప్రకటనము సలుప వలయునా’? అనెడు సమస్యను పరిష్కారము చేసినాడు.

“సరళ జీవనము, ఉత్తమభావము” అన నిదియే.

బొంబాయిపోవు రైలులో
20—8—1945

యమ్. కె. గాంధి

# వి ష య సూ చి క

## ౧ వ భాగము



## ౨ వ భాగము

### నరుడు – వ్యష్టిరూపము

# శాశ్వత పరిపోషణ

## ౧వ భాగము

### అధ్యాయము 1

### ప్రకృతి

ప్రకృతి:—ప్రకృతిలో కొన్ని వస్తువులు ప్రాణములేనివిగ కాన్పించు నవి కలవు. అవి పెరుగవు, ఎదుగవు; కాని తరిగిపోవును, వాడుక చేత అరిగిపోవును. నేలబొగ్గు, రాతినూనె, ముతకలోహము, ఇనుము, రాగి, బంగారము మున్నగు పదార్థముల రాశి లేక నిధి కొంత ప్రపంచమున గలదు. ఇవి పరిమితమగు మొత్తములుగా లభించుచుండుటవలన వీనిని 'అశాశ్వతము' లని పేర్కొనుచున్నాము. ఒక నదిలో వెల్లువలైపాఱు ప్రవాహ జలమునుగాని, అడవిలో నిరంతరము పెరుగుచుండు కలపనుగాని, 'శాశ్వత' మందుము. ఆ వెల్లువను, ఆ పెరుగుదలను మాత్రము వినియోగించుకొనునప్పుడు వానిరాశి సరుని ప్రయోజనముతందు అక్షయముగనుండును గాన వానిని 'శాశ్వత' మందుము.

చేతనముల విషయములో ప్రకృతియొక్క శాశ్వతత్వ రహస్యము జీవచక్రమునందు గోచరించుచున్నది. జీవితమును నిరంతరముగ సాగించుటకై ఆజీవచక్రముయొక్క వివిధాంశములు సన్నిహితములై సహకరించుచుండును. గోధుమగింజ యొకటి తల్లియొక్కనుండి నేల

రాలి మట్టిలో కూడుకొనును. నేలలోనికి వేళ్ళను చొప్పించును. అందుండి యా వేళ్ళద్వారమున, తేమయొక్కయు, సూర్యుని వేడిమి యొక్కయు సాహాయ్యముతో పోషకద్రవ్యములను పీల్చుకొనును. ఈచర్యమూలమున అనేక మొక్కగా వికాసముపొందును. ఆ మొక్క ఆకులు వేయును. దానివేళ్లు నేలనుండి ఆహారము తీసికొనుటకు తోడ్పడినరీతినే, దాని ఆకులు గాలినుండియు, వెలుతురునుండియు ఆహారమును ప్రోగుచేసికొనుటలో తోడ్పడుచుండును. ఆ ఆకులలో కొన్ని 'చచ్చి' నేలరాలును. నేల, గాలి, వెలుగులనుండి తల్లి మొక్క పూర్వము తీసికొనియున్న ఆయా మూలద్రవ్యములుగా ఈ యాకులు చీలిపోవును. అనగా విచ్చిపోవును. రాబోవు తరపు మొక్కలకివి పోషకద్రవ్యములుగా మఱల వినియోగపడగలవు. తేనెటీగలు మొదలగునవి ఈ మొక్కలనుండి తమ యాహారము కొఱకై పూదేనెను పుప్పొడిని ప్రోవుచేసికొనునప్పుడు వాని పూవులందు చూలుకల్పనము చేయగా గింజ లేర్పడును. మఱల రాబోవు తరపుమొక్కలకీ గింజలు జీవాధారములు కాగల్గును. ఈ గింజలు పండి నేల రాలును. లోగడ తరపు మొక్కలనుండి రాలిన యాకుల వలన సారవంతముగ చేయబడియున్న నేలయొక్క ఆధారముతో ఆ గింజలు మొలకలెత్తుచుండును. ఈరీతిగా మఱొక జీవచక్ర మేర్పడుచున్నది. ఈవిధమున ప్రకృతిలో జీవచర్యసాగిపోవుచుండును. ఈ జీవచర్యలో తెంపు లేనంతకాలము ప్రకృతిలోని జీవచక్రము సాగిపోవుచు ఆ ప్రకృతిని శాశ్వతము గావించుచుండును.

# అధ్యాయము 2

## ప్రకృతిలోని శ్రమవిధానము – జీవితాలు

ఈ జీవచక్రమునకు పూర్ణతగూర్చుటకై సహకరించు ఆయా చేతనాఽచేతనముల ప్రయత్నమే ప్రకృతిలోని 'శ్రమ' అనం దగును. ఏకాలమందుగాని, ఏదశయందుగాని, తెలిసియో తెలియకనో ఈ చక్రమునకు భంగపాటు గల్గించునెడల, ఆ భంగపాటునకు ఫలితార్థముగా హింస సంభవించును. ఇట్లు హింస సంభవించునప్పుడు వృద్ధి, లేక పురోగమనము ఆగిపోవును. తుదకు నిరర్థకత, నాశనము వాటిల్లును. దోషములను ప్రకృతి మన్నించదు. దాక్షిణ్యమును చూపబోదు. జీవచక్రముజోలికి పోకుండ, దానిని సంకుచితపఱప యత్నించకుండ, దాని శాశ్వతత్వమును పరిపోషింప గోరువారమగునెడల, మనము స్వీయక్షేమముకొఱకును, స్వీయరక్షణముకొఱకును గూడ సంపూర్ణముగా అహింసాపరులమై యుండుటయు, ప్రకృతివిధానములతో సహకరించుటయు, వానికి వశవర్తులమై మెలగుటయు అత్యావసరమగును.

చేతనములు సహితము తమ బ్రతుకును నిలుపుకొనగోరుచో తదితరములతోపాటు చేరి, తమతమ క్షేత్రములలో క్రమప్రకారము

---

* సేంద్రియపు ఎరువులకు మారుగా రసాయనపు ఎరువులు వాడునప్పుడు కొంతకాలము హెచ్చు పంటలే లభించును. కాని వీనిని తఱచుగా వాడుచో రసాయనిక ద్రవ్యములను తిని బ్రతుకలేని ఎఱ్ఱలు వినాశము నందును. ఎఱ్ఱలదృశ్యమగుటోడనే నేల బిరుసెక్కి, తుదకు సారమును కోల్పోవును. పశువుల దొడ్ల యెఱువులను ఆకుపచ్చ యెరువులను పరిత్యజించి వేయుటవలన, ప్రకృతి చక్రము భగ్నముకాగా, శాశ్వతపరిపోషణ తొలగిపోయి, మానవకృతమైన అశాశ్వతపు ఆర్థికదశ ప్రాప్తించినది.

శ్రమ చేయవలసియే యుండును. ఎఱ్ఱలు నేలలో తిరుగుట మూల మున మట్టిని గుల్లబారునటుల చేసి, గాలిని, నీరును భూమి పీల్చు కొనుటలో సాయపడును. శాకపదార్థములతో కూడిన మట్టిని తిని ఆయాపదార్థముల నవి తమకడుపులో చక్కగ మిశ్రమము చేయు చున్నవి; బాగుగ సిద్ధముజేసి సారవంతము గావించిన యెఱువును రెట్టలరూపమున బయటికి విడుచుచున్నవి. ఆ రెట్టలనుండి మొక్కలు తమ యాహారమును తేలికగా గ్రహింపగల్గుచున్నవి. తేనెటీగలు సీతాకోకపురుగులు చెట్ల పూలకు మేలు కల్పనచేయు సహకారవిధా నమునకు సదృశమగు విధానము స్థావరజంగమజీవులకును, నేలకును మధ్య జరుగు సహకారవిధానమునందుగూడ ప్రస్ఫుటముగ గోచ రించుచున్నది.

ఆతీరు శ్రమను లేక సేవనుచేసినందుకు ప్రతిఫలముగా, అటుల శ్రమచేయు వ్యక్తికి ఆహారము దొరకుచుండును. నేల, నీరు, గాలి యందుండు చేతనాచేతనరూపములగు లెక్కకుమించిన వ్యక్తులమధ్య ఘటిల్లు సహకారమువలనను, అనుబంధచర్యవలనను తానుపొందు ఉపకారములకెల్ల ప్రతిఫలముగా న్యాయమగు 'కూలిని' ప్రకృతి ఒసగుచునే యుండును.

వృక్షజాతిజీవులు స్థలాంతరములకు కదలవు; కాన స్థావరము లన బడును. వాని బీజములు తల్లిమొక్కకు, లేక చెట్టునకుదాపుగా దానిక్రిందనే రాలును. అన్నిగింజలు తల్లిచెట్టు చుట్టును పడి, మొల కెత్తునెడల, అవి పొదగాపెరిగి గుబురగుగాన వానికి ఊపిరియాడదు. కావున దూరముగా విశాలప్రదేశమున వెదజల్లబడుట యవసర మగును. అందుకొఱకు పక్షులు, పశువులు మొదలగువాని సేవలను ప్రకృతి సమకూర్చుకొనుచున్నది. ఈసందర్భమున జంగమములగు జంతువులు ప్రత్యేకముగ నుపకరించును. పక్షులు మొక్కల గింజ

లను తిని యొక్కొక్కప్పుడు మైళ్ళకొలది దూరముపోయి తమ రెట్ట
లతో ఆగింజల నచ్చట పడవేయుచు. అవియు నీటుల సహకార
కార్యములు చేయుట తమబ్రతుకుకొఱకేగాని, కేవలము పరోప
కారార్థమని కాదు. పక్షులు తమయాకలి తీర్చుకొనుటకొఱకే గింజల
తినును. ఇటులనవి తమజీవన ప్రధానకార్యముల నిర్వహించు
కొనుచు, ప్రకృతి జీవనచక్రములో తమవంతుపని నవి నెరవేర్చు
చుండును.

ఈవిధముగా జంగమములు స్థావరములకును, చేతనము లచేతన
ములకును తోడ్పడుచు, ఆయావర్గములు తమ ప్రయోజనములను
తాము నిర్వర్తించుకొనుచుండును; మఱియు నితరవర్గములతోడను
సహకరించుచుండును. తన్మూలమున ప్రకృతి తనయందుండు సకల
వర్గముల సహకారమును సమకూర్చుకొనుచు దృఢపఱచుకొనుచు
నుండును. ఇటుల సమష్టిప్రయోజన నిర్వహణముకొఱకై, ప్రకృతి
యంతయు సంఘటితమై పఱుగుచున్నది. ఇందేదియు తనకొఱకే
వేఱై మనుటలేదు. ఈ కార్యనిర్వహణమంతయు సవ్యముగా జరిగి
పోవునెడల హింసజొరబడి, ఆకార్యపరంపరను భగ్నము చేయ
నిచో, శాశ్వతపరిపోషణము చేకూరకలదు.

## అధ్యాయము 3

## ప్రకృతిలోని పరిపోషణరీతులు

వివిధమూలవర్గముల మధ్యవఱకు ఈ సంపూర్ణమా అహింసా
యుత సహకారము సమస్తజీవస్వరూపములందును సదా వెలయుట
లేదు. పంచభూతములనుండియు, అచేతనవస్తువులనుండియు తమ
యాహారముల సంపాదించుకొనుచు, ఆయా ప్రకృతి యవస్థాంతర

ముల గడచిపోవుటకు మారుగా కొన్ని మూలవర్గములు తోడిజీవుల చంపుకొని తినుట నవలంబించి సుదీర్ఘమౌ ప్రకృతి చక్రమార్గమును సంకుచితపఱచి వేయ జూచుచున్నవి.

1. పరాన్న పరిపోషణ :—కొన్ని మొక్కలు ఇతరముల భక్షించి జీవింపుచు పరాన్న భుక్కు లగుచున్నవి. కొన్ని మొక్కలు లేక చెట్లు తమ వేళ్ళద్వారమున నేలనుండి ఆహారము దీసికొనునట్లు వానిపైనిలిచి జీవించు బదనికలు త్రోవలోనే ఆ ఆహారమును దొంగి లించుకొనుటచేత నది మొదటివాని అవయవము లన్నింటికి సరిగా చేరజాలకుండును. ఆ కారణముచేత ఆతిథ్యమొసగు మొక్కలును, చెట్లును తిండి చాలక చచ్చుటయు తటస్థించును. ఈ విధముగ హింసయు, మరణమును ఘటిల్లుచుండును. జంతువులందు గొఱ్ఱెలు గడ్డితిని, నీరు ద్రావి హింసారహితముగా జీవించును. పెద్దపులి గొఱ్ఱెపైబడి దానిని చంపితిని దాని నెత్తుటిని ద్రావి ప్రకృతి మార్గ మును సంకుచితపఱచుచుండును. తత్కారణముగా హింస ఘటిల్ల చేయు పులి తన బ్రతుకు నంతటికిని హింసనే ఆధారముచేసికొను



చున్నది. ఈ విధముగా హింసావృత్తి పెద్దపులి జీవి తములో నొక ప్రధానాంశ మగుచున్నది. పాముల జంపుకొని తిను గ్రద్దలు నిట్టి క్రూర జీవులే. ఆ గ్రద్దలు, డేగలు నీ విధముగా పాములను, ఎలుకలను చంపి తిని జీవించుట బట్టి పరాన్న పరిపోషణమే వీనికి జీవనాధార మందుము.

2. స్తేయ పరిపోషణము :—ప్రకృతిలో నొక వర్గము వేరొక వర్గము నకు సమమగు ప్రతిఫలమును సమకూర్చి పెట్టకుండ, స్వలాభమునే

చూచుకొనుచెడల, అట్టి వర్గము స్త్రీయవర్గ మనబడును. కోతులు మామిడితోపులో జొరబడి ఆ చెట్ల పండ్లను పుణికి మెక్కును. అవి



ధాన్యపు కంకులను తిని బ్రతుకు పిట్టలు కృషికర్మయందు సహాకరించునవి కావు.

ఆతోపుయొక్క క్షేమమునకై నేలను త్రవ్వికాని, మొక్కల నాటికాని, చెట్లకు నీళ్ళుపోసి గాని, యేలాటి యుపకారమును చేకూర్చునవి కావు. ఆ కోతుల పనులన్నియు స్వార్థపరమైనవే గాని, పరప్రయోజనకరములు గావు. వీనివరిపోషణవైఖరి, యిది వరకు మనము చెప్పుకొనినవాని వైఖరికంటె తక్కువ హింసాకరమైనది కానోపును. ఐననేమి? వినాశకరమైనదే యగును.

3. సాహసపరిపోషణము:— కొన్ని జీవులు తామేవర్గములనుండి యుపకారమును పొందునో, ఆ వర్గమునకు స్పష్టముగు కొంతసేవ సలుపుచుండును ఉత్పత్తియందు తాముపకరించిన వానినుండి కొంత స్వీకరించును. తేనెటీగల విషయములో అవి యేపూలనుండి మకరందమును, పుష్పరజమును ప్రోవుచేసికొనునో, ఆ పూలకు చూలు కల్పన చేయుచుండును. మకరందమును తేనెగా మార్చును. తమ యంగముద్భవించు ద్రవవిశేషములతో తయారుచేసిన మైనమును నుపయోగించి తేనెపట్టును నిర్మాణము చేయును. తాముత్పత్తి చేసిన తేనెను ఆపట్టులో చేర్చిపెట్టి దానినుండి కొంత తాము తీసికొనును.

కావున తేనెటీగలు పరాన్నభుక్కులు కావు. అవేవర్గమునుండి యుపకారమును పడయునో, వానిని చంపివేయుటకు మారుగా

వానికి సాహాయ్యము చేయుచున్నవి. అవి స్త్రీయవర్గమువను చేరవు. ఏమన, సరకు ఉత్పత్తిచేయుట యందలి తమవంతు పనిని నిర్వహించుచున్నవి. తమ సాహసకృత్యము నైజప్రేరణయే యైనను, అవి తమ కృషివలన ఉపకారము చేయుచు నుపకారమును పొందుచున్నవి. ఇవి నిర్మాణాత్మక ప్రవృత్తివర్గమునకు చెందునవై యున్నవి.

4. సమూహ పరిపోషణము :— ఈ సందర్భముగా తేనెటీగలు తమ తమ వ్యక్తిప్రయోజనముల కొరకై పాటుపడునవి కావనియు అవి తమ పట్టులో నివసించు తేనెటీగమాత్రము లన్నింటి లాభముకొఱకై, పాటుపడునవనియు చెప్పవచ్చును. స్వీయ ప్రయోజనమును దాటిన సమష్టి ప్రయోజనమునకును, తాత్కాలిక ప్రయోజనమును మించిన భవిష్యత్ప్రయోజనము నిమిత్తమగు ప్రేరణకును నిదర్శన మిందు కానవచ్చును.



ఒక తేనెటీగ తనపట్టులో నివసించు వాని యన్నింటి కొరకును ఆహారమును ప్రోగుచేయుచున్నది.

5. సేవా పరిపోషణము :— ప్రకృతిలో గానవచ్చు పరిపోషణ విధానములలో శ్రేష్ఠతమమగునది సేవాపరిపోషణము. సంతానమునకును, జనకులకును మధ్యనుండు ప్రేమసంబంధమున నిది సుస్పష్టముగ గోచరించును. తల్లిపిట్ట తనకూనలకు తిండిని సంపాదించుటకై అడవినంతను వెదకులాడును. తన సంతానమును శత్రువులనుండి కాపాడుటలో తన ప్రాణము నొడ్డును. ఆ తల్లిపిట్ట తనయొక్క తాత్కాలికమగు అవసరము కొరకుగాని, తన భవిష్యత్ప్రయోజ

నము కొరకుగాని పాటుపడుట లేదు. ప్రతిఫలచింత యిసుమంతయు నపేక్షించకుండ రాబోవుతరమునకు చెందు పక్షులకొరకో, లేక తరములకు చెందు పక్షులకొఱకో అది తన కార్యముల నుద్యమించుచున్నది. అది తన మాతృప్రేమ కారణముగా, స్వీయమగు లాభాపేక్షతోగాక, నిష్కామముగా ప్రవర్తిలుచున్నది దాని చర్య అహింసాపరమగు శాశ్వతపరిపోషణమునకు దరిదాపుగా వచ్చుచున్నదన నగును.

శాశ్వతత్వమును, అహింసాపరతను అధికాధికముగా నిరూపించుటకై యీ విస్పష్ట సాదృశ్యములను ఈ అధ్యాయమునందు ఉదాహరించితిమి. ఈ యైదు గ్రాహ్యావిధానములం దిమిడియున్న రకములనుండి, యితరములను వేర్చి కూర్చుటచేతను, వాని వరుస క్రమమును తెల్పుటచేతను, ఎన్నియో దృష్టాంతముల నిరూపించుకో దగును.

# ౨ వ భాగము

## నరుడు - వ్యష్టిరూపము

## అధ్యాయము 4

## నరుడు - స్వేచ్ఛ

ఈ మన విచారణనిమిత్తము, ప్రకృతిలోని యితర వర్గములను పాలించు జీవనపరిపోషణరీతుల నింకను విమర్శన చేయు నవసర ముండదు. జంతుకోటిలోని 'నరు' డనంబడు జీవియొక్క బ్రతుకు తెన్నును మాత్రము పరిశీలించినం జాలును. ప్రకృతి చర్యల క్రమ గతిని పోషించుటకును, లేక భగ్నపఱచుటకును నరునకు సమర్థత గలదు. వాని జోక్యమువలన ప్రకృతియందు సంభవించు తబ్బిబ్బులు శాశ్వతములు కాకపోయినను, నరుని ఎదిరించి నిలిచి తుదిని విజయము గాంచగల సామర్థ్యము ప్రకృతికున్నను, ఒక్కొక్కప్పుడు దాని సరళగతిని సంక్షోభపరచి, ఇటీవలి ప్రపంచయుద్ధమును బోలు అవాంతరములను కల్పించుచుండును. లోతుకుదిగి పరిశీలించు నెడల ప్రకృతియొక్క అనుదినచర్యలో చాలవఱకు సంతుష్టికరముగా సహాకరించుటకు వీలగు మార్గములను, వసతులను మనము కనిపట్ట గలుగుదుము. శాశ్వతపరిపోషణరీతి నొకదానిని పూర్తిగ సాధింప జాలకున్నను, అట్టి దానికొఱకై బుద్ధిపూర్వకముగా పాటుపడుట వలన, అనవసరమగు హింసను నివారింపగలము; మఱియు వీలగు నంత హెచ్చుసౌఖ్యమును సమకూర్చుకొనుటకు శక్తిగల వార మగుదము.

తక్కిన జంతువు లన్నియు, కొంచెము హెచ్చుతగ్గుగా, ప్రకృతి శాసనమును అనుసరించియే వర్తించును. తమ "స్వేచ్ఛ" ననుసరించి

వర్తించుట కంతగా వాని కవకాశములు లేవు. వానికి ప్రకృతివిధానమును తెలుపు 'నైజ'మనునది కలదు. అవి దాని ఆదేశము నను వర్తించును. జీవితమున వానిమార్గము రైలుపట్టాల త్రోవనుబోలి యుండును. నైజము ఆజంతువులను నడపుతీరున రైలుపట్టాలు బండ్లు పోవలయు దిశను గతిని నిర్ణయించి నడుపుచుండును. ఏ అవాంతరము సంభవించకుండునెడల, బండ్లు కదలుచుండు నంతకాలమును, మఱల వాని నిటునటు త్రిప్ప నవసరము లేకుండనే, సముద్రప్రదేశమునను, అడవులగుండను, గుట్టలమీదుగను, లోయలలోను, రేయినక పగలనక, పోయిపోయి ఆ రైలు గమ్యస్థానమును చేరగల్గును.

కోడిపిల్ల గ్రుడ్డును పగుల్చుకొని వెలువడిన తత్క్షణము, మేతకై దేవులాడుచు నిటునటు పరుగులుపెట్టి, తనపోషణ కనువగునట్టి నలుసుల నేరుకొని తినును. ఆకలితీరినప్పుడది, తనకు వెచ్చగానుండు నిమిత్తము తల్లి రెక్కలక్రింద దూరి విశ్రమించును. రానున్న అపాయమును ముందుగనే నైజముచే తెలిసి, వెంటనే సురక్షిత స్థలమునకు పారిపోవును. రుచిగానున్న కారణమున హెచ్చుగా తినదు; ఇంద్రియవాంఛలను తృప్తిపఱచు బుద్ధితో సుఖములకొఱకై దేవులాడదు. దాని జీవితచర్యయంతయు నైజప్రవృత్తి ననుసరించి నడచునేగాని, బుద్ధిపూర్వకమగు ధర్మాతిక్రమణ ముండదు.

ప్రకృతికి అనుసరణముగా బ్రతుకు జంతువులు జబ్బుపడుట చాల అరుదు. ఒకవేళ నెప్పుడైన వాని జీర్ణకోశము చెడునెడల, స్వభావముచేతనే తెలిసికొని అవి యేఆకులలమునో తినును. అంతట వాంతియో, భేదియో కలిగి అంతయు చక్కబడును

మనుష్యుని విషయముననో అతనికి 'స్వేచ్ఛా' వృత్తియు, దాని వినియోగమున కగు విశాల క్షేత్రమును కలవు. కావున నెన్నియో

చిక్కులు కలుగుచుండును. శిక్షణనగు ఆ 'వరము' నతడు సవ్య మార్గమున వినియోగము చేసికొనునెడల, తక్కినజీవులకన్న హెచ్చుగా, ప్రకృతిలోని వివిధవర్గములమధ్య నటుగు సామరస్య సహకారములను, అతడు బుద్ధిపూర్వకముగ పెంపొందింపగలడు. అందుకు భిన్నముగా, నతడా ప్రజ్ఞను అపసవ్యమార్గమున వినియోగించెనా, ప్రకృతి పరిపోషణమును మిక్కిలిగ సంక్షోభపఱచి, తుదిని తనకును నాశము చేకూర్చుకొనును.

'నైజప్రవృత్తి' రైలురోడ్డుతో పోల్చబడినది. అది రైలు బండ్లను పారబడకుండ నడుపుచు, వానికై నిర్ణయింపబడిన గతి నుండి, లేక త్రోవనుండి తొలగి పోనీయదు. ఇందుకు భిన్నముగా 'స్వేచ్ఛ' యను వరము నడకయందు స్వాతంత్ర్యము నంగీకరించు చున్నది. కాని నడక యంతయు నిరపాయమై సాగదు. అది బైసికిలు నెక్కుట వంటిది. సిద్ధాంతరీత్యా బైసికిలుమీద స్వారి చేయువాడు తన యిచ్చవచ్చుచోటికి పోవచ్చును. త్రోవచూపు చక్రము, దాని దండము, స్వారిచేయువాని స్వాధీనముననే యుండును. అట్లయ్యును వాని సంచారము ఆ యంత్రముయొక్క పరిమితుల (Limitations) ననుసరించియు, వాని విచక్షణ ననుస రించియు మాత్రమే సాగగలదు. అతడు గాలిలో నెగురజాలడు; నీటిపై తేలజాలడు. నేలమీదనుగూడ ఎచ్చటికి బట్టిన నచ్చటికి పోవ వీలుండదు. అతడు అలవాటుపడినత్రోవనో, రోడ్డునో అంటి పట్టుకొని యుండవలసియుండును. దుక్కిదున్నినచేను కడ్డముగా నతడు స్వారిచేయ ప్రయత్నించునెడల ముందుచక్రము నేలలో కూరుకొనిపోయి అతడు ముందుకు జోర్లపడవలసివచ్చును. అతడు ముండ్లపొదలమీదుగా పోజూచునా, రబ్బరుగొట్టము చిల్లులుపడి పోవును. ఈ తీరుగా చూచుచో, ఊహామాత్రమగు 'స్వేచ్ఛ' కు

పరిమితులు గలవనియు, వివేకముతో స్వారిచేయునతడు దానిహస్త
లలో నుండవలసినవాడేననియు తెలియగలడు. ఈ తీరుగా నరుడు
తన సంచారమును వివేకముతో సాగించుకొనుటకు క్రమశిక్షణమును,
విజ్ఞానమును పొందవలసి యుండును. అవి కొఱవడునెడల హాని కుప
కారము చేయుట కేర్పడిన యంత్రము, అపకారము చేకూర్చున
దగును. కాని పరిచయమైన రోడ్డుమీద, పగటిపూట స్వారిచేయు
నతడు, కాలినడకను పోవువానికంటె ఎన్నిరెట్లు వేగముతోడనో
పయనించగలుగును.

సముచితక్షేత్రమున, తన 'స్వేచ్ఛ'ను సక్రమవిధాన వినియోగము
చేయుటకు శిక్షణబడసి, తన వాంఛలను తన యింద్రియములను
ప్రేరేచినట్లెల్ల తన యూహాపోహాలను పరుగులువెట్టనీయక విచ
క్షణతో వర్తించునేని, కేవలము 'నైజప్రవృత్తి'పై నాధారపడి
బ్రతుకు జీవులకంటె నరుడెన్ని మడుంగులో ఘనతరకార్యముల
సాధింపజాలును. అతడు తన యిచ్ఛానుసారము తన యభ్యుదయ
మును తాను నిర్ణయించుకొనగలడు. తనలోని నిత్యతేజో ప్రభావ
మును, అనగా దివ్యప్రభతో గూడిన తన సహజజ్ఞానమును అనుస
రించుటవలన విజయము వైపునకుగాని, లేక వినాశము వైపునకుగాని
పోగలడు. అటుల బుద్ధిపూర్వకముగా నరుడు తనగతికి తాను కర్త
కాగలడు. చీకటిలోగాని, మెరకపల్లపు ప్రదేశముమీదగాని బైసి
కిలునెక్కి స్వారిచేయుచు వడిగ పోవువానిపోలిక, నరుడు అనర్థముల
పాలును కానగును. మఱియు తన అంతరాత్మకును, ప్రకృతికిని
విరుద్ధముగా నడచి పాపకారియగుటవలన తగిన శిక్షను బడయవల
సినవాడును కానగును. ప్రకృతి విశ్వాసపాత్రమైనది; తనను గౌర
వించువారియెడ నది విధేయమై వర్తించును. కాని తమ 'స్వేచ్ఛా'
ను సారము వర్తించుచు, ప్రకృతియవసరముల నిర్లక్ష్యము చేయు

టనే తలపడుమరేవి, అట్టివారినైన ధర్మదేవతను మించిన నిష్ఠు రత గ్రహించి, వారిదోషములకు శాస్తిగా ఘోరహింసల పాలు చేయుటకో, మరణమును సయితము విధించుటకో ప్రకృతి పూను కొనగలదు. అట్టి నిదర్శనములను గుఱించి రాబోవు అధ్యాయములో విచారణ చేయుదము గాక !

## అధ్యాయము 5

### 'స్వేచ్ఛ' యొక్క సదసద్వినియోగము

ఈనాడు నరుని జీవితము బహుళసంకీర్ణ ప్రవృత్తిగలదైయున్నది. కావున వాని స్వేచ్ఛావినియోగము వలన జరుగుచర్యల నన్నింటి సమీక్షను ఈపుస్తకమునందు పొందుపఱచుట సాధ్యపడదు. మన మిప్పుడు ప్రయత్నింప జాలునదంతయు, ఆకలిదప్పుల దీర్చుకొనుట మొదలగు నరుని ప్రాథమికావసరములనుండి ప్రత్యక్షముగా సంభ వించు ప్రస్ఫుటమౌకొలది విశిష్టచర్యలయొక్క ప్రస్తావనమాత్రమే. పాఠకుడు తానెఱిగిన యితరోదాహరణలను పరిశీలించి, యొందెందు స్వేచ్ఛయొక్క సద్వినియోగము అవసరమగునో; మఱియు ఆస్వేచ్ఛనే దుర్వినియోగము చేసినప్పు డెట్టి దుష్ఫలితములు చేకూరుచుండునో గ్రహించును గాక.

ఆకలి:—ఇదిమిక్కిలి యవసరముగ తీర్పవలసిన వాంఛ. అన్నిటి కన్న ప్రాథమికమగు నైజవాంఛ ఆకలియే. దానింగూర్చి యొకింత విచారింతము. జీవుల స్థూలశరీర మొక యంత్రమువంటిది. దానిని నడుపుట కవసరమగు శక్తిని సమకూర్చు వంటచెఱుకు కావలసి యున్నది. దానికి మరమ్మతులవసరము. అరిగివిరిగిపోవు భాగములను పూర్తిచేయుచు దానిని వాడుకకు అర్హమగుస్థితిలో నుంచవలయును.

కదలుచుండు నా యా భాగముల పెఱపిసిసి త్రించు కొఱకు చమురు లవసరము. ఈ అవసరములన్నియు ఆకలి రూపమున తెలియ వచ్చుచుండును. శరీరముయొక్క యీ అవసరములనుతీర్చి, దానిని వాడుకొనుటకు దగినస్థితిలో నుంచుటకై కావలయు ఆ యా పదార్థ ముల చేరుకొనుటలో వాసన, రుచి, యనునవి జీవులకు సాయపడు చుండును.

సాధారణముగా, నైజజీవితముల గడపు జంతువులన్నియు తమ నైజగుణముల ననువర్తించు చుండును. అవి బ్రతుకుటకై తినును. ఆరోగ్యముగ నుండును. మానవుడును నటులనే చేయగలడు; కాని దురదృష్టవశమున అనేక సందర్భములలో నరుడు తన ‘స్వేచ్ఛ’ ను ప్రయోగించుచున్నాడు. ఆకలి తీర్చుకొనుటకుగాక, తనజిహ్వాచాప ల్యమును తృప్తిచేయు కొఱకుగాను చాలగా పక్వము చేయబడి నట్టియు, మసాలాద్రవ్యములు చేర్చినట్టియు ఆహారపదార్థములను కల్పనచేసి కొనుచున్నాడు. రుచిప్రేరితుడై, అతడు తనకు కావలయు దానిని మించి తఱచుగా మెక్కుచుండును. అతడు‘తినుటకై బ్రతుకు’ చున్నాడననగును. జిహ్వాచాపల్యమును తృప్తిపఱచుకొనుటకై తన ‘స్వేచ్ఛ’ను దుర్వినియోగము చేయుటయే యిక్కాలమున మానవు డనుభవించు బాధలలో పెక్కింటికి కారణ మగుచున్నది. మితిమీరి తినుట జీర్ణకోశమునకు భారము కల్పించు టేగాక, దానిని పెడత్రోవ కీడ్చును. తినుఆహారము పుష్టికరమైనదె యైనను, సామాన్యముగా అవసరమగు పరిమాణమునకు మించునెడల, శరీరమున కది అపాయ కరమై విషముగా పరిణమించును, అనేక విధములగు రోగముల కల్పించి, అధికబాధలకు లోనుచేయును. అకాలమరణమును సైతము తెచ్చిపెట్టును.

దప్పి:—ఆహారము జీర్ణమైన పిమ్మట, అది ద్రవరూపమున దేహ
ములోనికి పీల్చుకొనబడును. పుష్టినొసగు ద్రవములు రక్తప్రవాహ
ములో కలిసి, అవసరములగు తావులకు గొనిపోబడును. శరీరములోని
ఆయా భాగములం దేర్పడు మలినపదార్థములను రక్తము ఊపిరి
తిత్తులలోనికి తీసికొనిపోవును. ఆమలినపదార్థము లక్కడ మనము
పీల్చుకొను గాలిలోని ప్రాణవాయువుతో గలిసి దహింపబడి శుద్ధి
చేయబడును. ఈ పని జరుగు సమయమున నెత్తురులోని నీరు చాల
భాగము ఆవిరిగామారి, శ్వాసతోపాటు శరీరమునుండి వెలువడు
చెమ్మరూపమున బయటికిపోవును. ఈ చెమ్మ చర్మము ద్వారమున
చెమట రూపమున వెలువడి శరీరముయొక్క శీతోష్ణస్థితిని సరిదిద్దు
చుండును. ఈతీరున నీరు తగ్గి, నెత్తురుచిక్కబడుటను దెలుపు సూచ
నయే దప్పి. ఆదప్పిని తీర్చునిమిత్తము నిర్మలోదకము విశేషముగ
త్రాగు టవసర మగుచున్నది. ఈ నీరు మన ఆహారద్రవ్యములను
ఆయాశరీర భాగములకు చేర్చుటకేగాక, రక్తమును శుద్ధిచేయుటకును
వినియోగపడుచున్నది. రక్తములోని మాలిన్యములను మూత్రము
ద్వారమున తొలగించుటకును, చర్మముయొక్క సహాయమున
శరీరమునందలి వాయువును సమస్థితిలో నుంచుటకును నీరు విని
యోగ పడుచుండును.

నరుడు తన యిచ్ఛను దుర్వినియోగము చేయుటవలన, శరీర
మున సహజముగా జరుగు ఈక్రియా కలాపమును తారుమారు
చేయుచు, తన దప్పిని తీర్చుకొనుటకు కల్లుసారాయములను త్రావి
శరీరములోనికి విషపదార్థములను ప్రవేశపెట్టుచున్నారు. ఈవిషపదా
ర్థములు నాడీమండలమును చెడగొట్టి, బుద్ధిశక్తులకొఱవడజేసి,
తుదిని ఆరోగ్యమునకు సయితము అడ్డుతగులుచుండును. ఈ అల
వాటు వ్యక్తియొక్క గౌరవమును పాడుచేసి, కుటుంబ క్షేమ

మునకు చేటు తెచ్చును. ఆధునిక సమాజమున జూపట్టు వనేకములగు దోషములకును, కీడులకును త్రాగుడు మూలకారణ మగుచున్నది.

వాసన:—ఇదేతీరున వాసనయు ఆహారమును ఏర్చుకొనుటకు సాయపడవలసిన ఘ్రాణశక్తి పొగాకుపొగ పీల్చుకొనుటచేతను, ముక్కుపొడి వేసికొనుటచేతను, దుర్వినియోగము చేయబడు చున్నది. తాత్కాలికముగా పొడుముపీల్చుట చురుకుదనమును, హాయిని ప్రసాదించునట్లు కాన్పింపవచ్చును; కాని గుండెను, మెదడును పాడుచేసి తుదిని మితిలేని అపకారము చేయును.

కామము:— జంతుకోటియందు ప్రవృత్తిని పురికొలుపు ప్రేరణల యన్నింటిలో బలతమమగునది, సంతానోత్పత్తిచేసి జాతినినిలువ బెట్టునిమిత్తమగు కామచేష్టయన వచ్చును. చాల పక్షులును, కొన్ని పశువులును తమశృంగార చేష్టలకు కామక లాపమును కేంద్రముగ జేసికొనుటే గాక, యవి జంటలుగ గూడి సమరసభావముతో జీవించుటకును, తమ కూనలను పెంచుటలో సమష్టిని బాధ్యత వహించుటకును కామము నాధారముగ జేసికొను చున్నవి. సర్వత్ర, ప్రకృతిలో, మగజీవియు ఆడజీవియు సంతానమునిమిత్తము మాత్రమే కొన్నికొన్ని ప్రత్యేకఋతువులందే సంగమించును.

ఇట్టి సంతానవాంఛగాని, ఉద్దేశ్యముగాని లేకయే తన ఇచ్ఛానుసారము మూఢపశుదశకంటెను క్రిందికిదిగజారిపోయి, నరుడు కామలాలసకు లోనై జననేంద్రియవ్యాపారమును హద్దుమీరిసాగించు చున్నాడు. బిడ్డలు సంగమక్రియకు నిర్దిష్టఫలములగుటకు మారుగా, అనిష్టఫలములై, అనేక సందర్భములందు అసంగమ కార్యము యొక్క అవాంతర ఘోరశిక్షగా పరిణమించుచున్నారు. అటువంటి దోషాకరులను సెగరోగము, కొరుకురోగము మున్నగు వ్యాధులకు గుఱిచేసి, తన శాసనముల నతిక్రమించి వర్తించినందుకై ప్రకృతి

కసి తీర్చుకొనును. మరియు కేవలమా దోషులను దండించుటతో తృప్తినందక, తాను నిర్దేశించిన మార్గమునుండి తొలగి నడచిన వారియొక్క నిరపరాధులగు సంతానమును సయితము ప్రకృతి బాధించుచున్నది.

ఊహాశక్తి :— జీవులన్నిటిలోను నరునందుమాత్రమే ఊహాల సాగించి, అదృశ్యక్షేత్రములం జొచ్చి, కృత్రిమరచనల గావించి, లలితకళను సృష్టిచేయగల సమర్థత విశిష్టమై కాన్పించుచున్నది. ఈ సమర్థతను సహజమార్గమున వినియోగము చేసికొనుటకు మారుగా, అస్వాభావికమగు కృత్రిమ ప్రేరణలను కల్పించు నిమిత్తము సారాయములను మత్తు పుట్టించు నల్లమందు, భంగు, గంజాయి మొదలగు నిషాద్రవ్యములను నరుడు తోడు చేసికొనుచున్నాడు. ఉద్రేకజనకములగు నిట్టి పదార్థముల సేవించుట కలవాటు పడిన వారిని మత్తుమందు ప్రయోగము వలె ఆపదార్థములు ఏపనులుచేయు టకును కొఱగాని వారినిగ జేసివేయును. అంత్యమున తమకు దాసులైపోయి, తమ నాధారము చేసికొని, బ్రతుకు నరులకవి నాశము చేకూర్చుచుండును.

నిర్మాణశక్తి:— నరుడు తానుద్యమించిన కార్యముల నిర్వాహణమునకై యాంత్రికసౌకర్యముల కూర్చుకొనుటలో తన మేధాశక్తిని వినియోగపఱచుకొనుపట్ల, సృష్టికర్తయగు భగవంతునితో పోటీకి దిగుచున్నట్లున్నాడు. వినాశముంగాక వరముల బడయుటకై అటుల పోటీ చేయుటూని, ఉత్తమఫలితార్థములను సాధింపగోరునేని, అతడు ప్రకృతివిధానములను తూచ, తప్పకుండ ననుసరింపవలసియుండును. తన ఇచ్ఛవచ్చినటులెల్ల పోవుచో, ప్రకృతియొక్క సహకారమును బడయుట వానికి కేవలము దుర్లభము. అట్టి ప్రయత్నమేదైనను, వెనువెంటనే ఘోరవిపత్తును చేకూర్చును.

ప్రకృతి సిద్ధముగా సూర్యునినుండి వ్యాపించు వేడివలన సముద్రోదకము ఆవిరి యగుచుండును. సూర్యునినుండి ఆకర్షించుకొనిన శక్తితో గూడిన స్వచ్ఛమగు నీటియావిరి, ఉప్పును క్రింద విడిచివేసి, ఆకాశమున కెగిరి పోవును; అక్కడ మేఘముగా జేర్పడి, యా యున్నత ప్రదేశమందలి చల్లని గాలుల మూలాన వర్షజలముగా తిరిగి చిక్కబడును. వర్షజలము కొండలపై బడుచున్నను, అచటి యెత్తునుబట్టి దాని యందు గొప్పశక్తికూడుకొనియుండును. భూమి యొక్క గురుత్వాకర్షణ బలమువలన ఆనీరు క్రిందికి లాగబడగా, నేల మిట్ట పల్లముల ననుసరించి యది సముద్రము వైపునకు తిరిగి ప్రవహించును. ఆనీరు నదులరూపమున సముద్రము వైపునకు పాఱుచు అందు కలిసిపోవులోపల, నరుడు తనవిజ్ఞాన సారము దానిచేత యూడిగము చేయించుకొనుట కనువుగా, దానియందలి శక్తిని స్వాధీనపఱచుకొనుటకై, తనబుద్ధి విశేషముచేత నెన్నియో యుపాయములను పన్నుచున్నాడు. మొదట ఉన్నతప్రదేశమున నదుల కడ్డముగా అడ్డుకట్టలను కట్టును. అక్కడ వానియందలి అవ్యక్తరూపశక్తిని పేర్చిపెట్టును. దానిని తనకవసరమగు చోట్ల తనకవసరమగు సమయములందు వినియోగము చేసికొనుచుండును. ఈ తంతు మన దేశములో పర్వత ప్రాంతములందు పిండిమిల్లులలో జరుగుచుండుట నెఱుగుదుము. ఇది స్థానికపు టుపయోగము. కొన్నిచోట్ల పెద్దమిల్లుల స్థాపించి, నీటిప్రవాహపు శక్తిని విద్యుచ్ఛక్తిగ మార్చిచేసి, తీగల ద్వారమున వందల కొలది మైళ్ళు తీసికొని పోయి, త్రోవపొడవుననుగల నగరములకును, పట్టణములకును, పల్లెలకును దీపముల నమర్తురు. లేదా నీటిపంపులను, మోటారులను నడుపుటకై వినియోగింతురు. పిమ్మట ఆనీటిప్రవాహములను కాలువలలోనికి మరల్చి పడవలు నడుపుకొనుట కుపయోగింతురు.

మఱియు సేద్యము చేయు తమపొలములకు నీరు పెట్టుకొందురు. ఈ తీరున నరుడు నదీప్రవాహములను వానిజలమును స్వాధీనముచేసికొని, ప్రకృతిగతి కేలాటి భంగము వాటిలకుండ, వేలకొలది జనములకు భోగభాగ్యముల సమకూర్చి పెట్టగల్గును.

ప్రకృతి తనమార్గముననుసరించి తనప్రయోజనముల నిర్వహించుకొనుచునే నరుడు ఆ ప్రకృతిని తనతోడను సహకరించి తనప్రయోజనములను నిర్వర్తించుకొనుటకై ఆహ్వానించు విధానమున నైనచో, అతడు తనస్వేచ్ఛను వినియోగించు తీరుఎంతయు మెచ్చుకొనదగినదే. ప్రకృతియు నరుని జీవితమును మెచ్చువికాసవంతముగను, ఐశ్వర్యవంతముగను నొనర్చిన వానినాశీర్వదించును.

కాని దురదృష్టవశమున నరుడు ప్రకృతిచర్య కడ్డము తగులుటకై తనయిచ్ఛను వినియోగించు చున్నాడు. ప్రకృతిశాసనముల నతడెంతమాత్రము సరకుగొనక, తన భోగలాలసకొరకై, వానిని తిరస్కరించుచు, పెడత్రోవలబట్టి పోవుచున్నాడు. చూడుడు; అపమార్గముబట్టి, భ్రాంతి జనకమా తన రసజ్ఞతను తృప్తిపఱచుకొను నిమిత్తము మెరుగు పెట్టిన బియ్యపుపిండితోడను, గోధుమపిండితోడను సిద్ధముచేసినభోజ్యపదార్థములు ముత్యముల కాంతితో మనోహరముగ గోచరించుగాక యని నిశ్చయించుకొని, మెరుగులుపెట్టు యంత్రముల నెలకొలుపు చున్నారు. ధాన్యపుగింజలో పుష్టినొసగు జీవాంకురమును, జీర్ణమగుటకు తోడ్పడు తవుడు పొరను, క్రమనివృత్తితో, జాగ్రతగా ప్రకృతి దానియందుకూర్చి పెట్టియుండగా, నరుడు లేనిపోని జోక్యము కలిగించుకొని, అప్రమాణ సమరసతను భగ్నముచేయుచున్నాడు. మెరుగుపెట్టు చర్యవలన ప్రాణప్రదములగు అంశములు నశించిపోవుచున్నవి. ప్రకృతి విధించిన మార్గము విడిచి, మెరుగుపెట్టిన ధాన్యముల దినుచు పెడత్రోవల నడచు

నరునికి, అధిక బాధలను, మరణమును సమీపము తెచ్చిపెట్టు నరాల జాడ్యమును కల్పించి, ప్రకృతి కఠినముగ శిక్షించును.

సీమరేగుపండ్లు, ఖర్జూరపండ్లు, ద్రాక్షపండ్లు, మున్నగు ఆరోగ్యప్రదములగు తాజాపండ్లను ప్రసాదించుచు ప్రకృతి మనల నతి మురిపెముతో నాదరించుచున్నది. ఈ పండ్లను తాజాస్థితిలో తినుటకు మారుగా తనకు హుషారు కన్పించుననెడు భ్రాంతితో నరుడు వానినుండి రసము పిండి, దానిని పులియబెట్టి, కల్లు, సారాయముల తయారుచేసుకొనసాగినాడు. ఈ సందర్భమునకూడ, ప్రకృతితో వికటవినోదములకు దిగు నరుని, పైన వివరించియున్న తెఱగున ప్రకృతి కఠినశిక్షలపాలు చేయును.

వంశసంరక్షణకొరకగు ప్రకృతి నిబంధనలను తిరస్కరించి, గర్భనిరోధక సాధనములను సృష్టించి, హద్దుమీరి సంభోగానందమును పడయజూచు మానవుడు తన సృజనశక్తిని దుర్వినియోగము చేయువాడేకాని, ప్రకృతిసిద్ధప్రేరణను సఫలీకృతము చేయువాడు కాడు. ఈవిషయమున హద్దుమీరినవారిని ప్రకృతి కఠినదండనల పాలు చేయును. తుదకటువంటివారు పుంస్త్వమును కోల్పోవుటేగాక నాడీజాలము చెడగా, చిత్తచాంచల్యమును పొంది యుందురు.

అటువంటి దురభ్యాసముల సాగించి, ప్రకృతి నియమముల నతిక్రమించిన యుదాహరణలను విస్తారముగా జూపుట అనవసరము. పలువురి జీవితములు అట్టి యుదాహరణలతోడ నిండియున్నది. నరుడు నిస్సంకోచముగా తనయందుగల సమర్థతను, సాహసమును వినియోగించుకొని యింద్రియభోగములకు మరియు తాత్కాలికములును, క్షణభంగురములు నగు సౌఖ్యముల కాశపడియు, తలక్రిందుగా పరుగులిడుచున్నాడు. భయంకరమగు వేగముతో పరుగులుపెట్టి

తనకు వినాశముంగూర్చు ఆపదలయందు పడిపోవుచున్నాడు. తృప్తి
కాలపు భోగమున కాశపడి నరుడిటుల తన స్వేచ్ఛను దుర్వినియో
గముచేసి కటా! వినాశమును చేకూర్చుకొనుచున్నాడు. ఇట్టి వర్త
నము శాశ్వత ప్రకృతిధర్మమునకు వ్యతిరేకముగాన, పర్యవసానము
నకు శాశ్వతములౌ క్రమజీవనగతులు ధ్వంసమైపోవుచున్నవి.

నరుడత్యానందముతో గడించుకొను శక్తులలో దివ్యమైనది
ప్రేమశక్తియై యున్నది. దానిని తోడివారి సేవయందు నిస్వార్థ
ముగా ప్రకటించుటయు దివ్యలక్షణమే. తల్లియొక్క సహజప్రేమలో
దాని రవంత తళుకుమాత్రమే మనకు గోచరించుచున్నది. నరుడు
తన తోడిజీవుల కట్టిసేవల నొనర్చుటవలన వానిజీవితమున సత్యోత్త
మాంశమును ప్రకటింపగల్గుచు, దైవాంశమును భూతలమునకు
దెచ్చినవాడగుచున్నాడు. అతడుతనయందధికముగ గల శక్తిని
ఎవరికి తన సాహాయ్యమును, సేవయును అవసరములగునో అట్టి
వారల క్షేమసౌఖ్యములకై అర్పణము చేయగల్గును.

ఇచ్ఛను దుర్వినియోగముచేయుట మూలమున నతడీ దివ్య
శక్తిని ప్రేమయొక్క శాశ్వత దివ్యపథమునుండి వెడలాగి, స్వార్థ
పరుడై, తృష్ణను పెంచుకొని, భౌతికసంపదలగూర్చిన లోభగుణముగా
మార్చివేయువాడగుచున్నాడు. వానియందధికముగా జూపట్టు
శక్తిని, తాను పేర్చి పెట్టుకొను ధనరాసులవలె స్వార్థప్రయో
జనములకై దాచిపెట్టుకొనుచున్నాడు. ఇట్టి స్వభావముగలవాని కది
అనర్థదాయక మగును. అతడు భోగములకును, వ్యసనములకును
లోబడిపోవును. వాని సంపదలు వారసులకు దత్తమగునప్పుడు అన్న
దమ్ములమధ్య పోరాటములకు హేతువులగును. వాని సంతానమును
నాశముచేయుటకే మూలము లగును.

# అధ్యాయము 6

## మానవపరిణామదశలు - వ్యక్తులు

వృక్షవర్గము నందును, జంతువర్గము నందును గల చేతన జాతి యందు చూపట్టు పరిపోషణరీతులను గురించి లోగడ అధ్యాయములలో విచారించియుంటిమి. ఈ అధ్యాయములో, ప్రత్యేకముగా నరునిసందర్భమున ఆ పరిశీలనలు ఆ విచారణలు ఎట్లనువర్తింపునో, ఏతీరున ఏదశయందు నరునకు వానియం దుచితస్థానము లభించునో గమనింతముగాక.

తదితరజీవు లన్నియు, నైజగుణముచేత పాలింపబడునవై, తమ విశిష్టజీవనవిధానమునకు కట్టుబడియుండుటచేత, అవి స్వకీయమగు ప్రయత్నములమూలమున, ఒకతీరు పరిపోషణను విడిచివేసి మరొక తీరు పరిపోషణను అనుసరింపజాలకున్నవి. పుట్టినది మొదలు చచ్చు వఱకును, వాని జీవనవిధానము, ఒక నిర్ణీతస్వరూపమునకు బంధింపబడి నడచును. పరాన్నభుక్కగుజీవి దాని జీవితమంతయు పరాన్నభుక్కగనే యుండి, ఇతరుల ఆహారముచేతనే పోషణ గాంచును. గత్యంతరము లేదు. చిఱుతపులి తనమచ్చల నెట్లు మార్చుకోజాలదో, తన స్వభావమును నటులనే మార్చుకోజాలదు. కావున నది యితర జంతువుల నెఱగా జేసికొని తిని బ్రతుకవలసినదే; లేదా చావవలయును. దాని జీవనగతి అట్టి దగుటం గూర్చిన బాధ్యత దానికి లేదు. దాని జీవసరణిని సాహసపరిపోషణముగగాని, లేక సమూహపరిపోషణముగగాని ఉద్ధరించుకొనుట దానికి సాధ్యముకాదు.

నరు డెట్లు తన స్వేచ్ఛవలన విశిష్టజీవి యయ్యెనో గమనించియున్నాము. వానికి లభించినబుద్ధి వృత్తిసాహాయ్యమున అతడు తన పరిసరములను పరిస్థితులను ఎట్లు మార్చుకోశక్తు డగునో గ్రహిం

చితిమి. మనుజవర్గమునకును పరిపూర్ణ ప్రపంచమునకును గల భేదము అంతే గలదు.

ఒక బందిపోటువాడుగాని, దస్యువుగాని, పరాన్నభుక్కై జీవించు తన విధానమును మార్చుకొని, తన హింసావృత్తిని తగ్గించు కొనగలడు. అతడు స్వయముగా పాటుపడిగాని, ఇతరుల శ్రమతో పాల్గొనిగాని సంపాదన చేయకుండ ఊరక కౌలుదారునుండి సొత్తును ప్రోగుచేసికొని బ్రతుకు మూర్ఖభూస్వామివలె, పై (స్తేయ) (తరగతి) పరిపోషణవర్గములోనికి ఉత్క్రమింపజాలును. లేదా తన స్వంతప్రయోజకత్వమువలన పాటుపడి, చెమటనోడ్చి పని చేసి, ధర్మజీవనమును గడుపు సేద్యగానివలెనో, లేక శిల్పివలెనో పరివర్తన మందుటకు నిశ్చయించుకోగల్గును. అప్పు డతడు సాహసపరిపోషణ వర్గమున కెగయగల్గును.

తన పోషణపై నాధారపడియుండు కుటుంబముకొఱకై శ్రమించుచు, తా ననుభవించు నాదాయమును తన కుటుంబములోని ఇతరులతో పంచుకొనుచు ఒక హిందూసమష్టికుటుంబములోని యొక బాధ్యతగలవ్యక్తి కానగును. అప్పు డతడు సమూహపరిపోషణ వర్గమున చేరినవా డగును.

తోడిమానవుని యెడ సాంద్రప్రేమను వికసింప జేసికొని జాతీయ సేవకుడుగా పరివర్తనము పొందనగును. నిరాడంబరముగను, పొదుపుగను, జీవనము గడుపుచు, నేదేని పవిత్రోద్యమమున జేరి, శక్తికొలది పాటుపడువాడు కావచ్చును. అప్పు డతడు శ్రేష్ఠతమవర్గమున అనగా సేవాపరిపోషణ వర్గమున జేరగలడు.

శమదమాదుల శిక్షణ గఱచు నెడల నిట్టిదంతయు మానవునికి సాధ్యము కాగలదు. అట్టివ్యక్తి తన జీవితధర్మమునకు విధేయుడై

నడుచుచు, అత్యుత్తమ దశను ప్రాపించునటుల తన యిచ్ఛాశక్తిని నియమింపజాలును.

మానవుని యెడ ననువర్తింపగల వివిధపరిపోషణ విధానముల యొక్క విశిష్టలక్షణముల నిచ్చో సంగ్రహముగ చెప్పుకొనుట ప్రయోజనకరమగును.



మెడలోని బంగారుదండను దొంగిలించుకొఱకై చిన్నబాలికను జంపు చోరుడు మంచి ఉదాహరణము

పరాన్నపరిపోషణ :— నగలకై బిడ్డను హత్యచేయు చోరుడు

1. లోభప్రేరిత స్వార్థము.

2. ఉద్దేశ్యము: తన చర్యలవలన నితరుల కేలాటి యాపద వాటిలునా యను చింత లేకుండ స్వలాభమునే చూచుకొనుట.

3. సత్ప్రయోజనావకాశములను నాశముగావించకున్నను దుర్లభము చేయుట.

4. స్వంత హక్కులమీద పూర్తిగ గట్టి పట్టుదల చూపుట.
5. స్వకీయసుఖిఘులను నిర్లక్ష్యము చేయుట.
6. పరోపకారశూన్యత.
7. హింసాకారకము.

ముఖ్యనిదర్శనము:—ప్రయోజనాధారముల భగ్నపరచుట.

స్త్రీ దుపరిపోషణము :— మంచి ఉదాహరణ : తా నెవరిని దోచునో వారికా నష్టము దెలియరాకుండ చమత్కారముగా జేబులు కత్తిరించుదొంగ.

1. అతివాంఛాప్రేరిత స్వార్థపరత.

2. స్వలాభమును సాధించు పూనిక వహించియు, తన దోపిడికి గురియైనవాడు సాధ్యమైనచో ఆపదపాలుగాకుండు తీరున తన స్వార్థమును గడించుకొనుట.



3. తన హక్కులగూర్చియే పూర్తిపట్టుదల చూపుట.

4. తనవిధుల గురించి స్వల్పముగ యోచించుటో, లేక అసలే యోచించకుండుటో.

5. పరోపకారచింత లేకుండుట.

6. హింసాకారణ మగుట.

ముఖ్యలక్షణము :— ఉపకారము చేయకుండ లాభముల సాధించుకొనుట.

సాహసపరిపోషణము:—మంచియుదాహరణము : రయితు తన భూమిని



దున్నును, ఎరువు వేయును. నీరు పెట్టును. మంచి విత్తనమును భూమిలో చల్లును; పైరును జాగ్రత్తగా కావలికాయును; పిమ్మట పైరుకోసి, నూర్పిడిచేసి ధాన్యలాభమును అనుభవించును.

1. తెలివితేటలతో స్వీయ క్షేమ లాభముల చింతచే ప్రేరణపొందును.

2. ఆత్మగౌరవ చింతకలిగి, తనశ్రమను, బుద్ధిని, పూనికను వినియోగపరచి, తద్వారమున పొందగల లాభమును మాత్రము పొందును.

3. సాహసించి పనిచేయుచు, లాభనష్టములను బుద్ధిపూర్వకముగ ననుభవించును.

4. సాధ్యమగుపట్ల తోడి శ్రామికులకును, నితరులకును లాభము చూపుట.

5. అందరిస్వామ్యముల సమముగచూచును.

6. ఇతరులయెడ తన విధులను అధికాధికముగా గుర్తించును.

7. న్యాయ ధర్మబుద్ధిపై ఆధారపడుట.

8. ఒకానొకప్పుడు హింస కలుగవచ్చును.

ముఖ్యలక్షణము:—లాభనష్టములకు సిద్ధపడి తనవంతు శ్రమకును (పనికిని) తానుపొందు లాభమునకును పరస్పరానుబంధము కూర్చుట.

సమూహ పరిరక్షణము :— ఉదాహరణ : సమష్టికుటుంబములోని అందరి క్షేమముకొరకై కుటుంబపు యజమాని పాటుపడును. తానున్న సమాజముయొక్క సమష్టిక్షేమము కొరకు పంచాయతీ దారుగగాని, సహకారసంఘపు మెంబరుగగాని సేవచేయును.

1. తనస్వంత ప్రయోజనమును, తానున్న సమాజము యొక్క క్షేమముకొఱకు కర్పణ గావింపవలయునను ప్రేరణ.

2. తన క్షేమమునకు భంగము కలిగినను కూడ, స్వార్థత్యాగము చేసి, తోడివారల యభిప్రాయమును మన్నించును.

3. సంఘధర్మములనే హెచ్చుగ పాటించును.

4. తాను పంచుకోగల లాభమునుకన్న, తాను నిర్వహింపవలసిన ధర్మమును హెచ్చుగ పాటించును.

5. పరోపకారమును ప్రమాణముగ నెంచును.

6. తనసంఘమునకు చెందనివారలకు హింసకలిగినను కలుగవచ్చును.

ముఖ్యలక్షణము: వ్యష్టికి కలుగు లాభముకన్న సమష్టియొక్క లాభమును ప్రధానముగ జూచుట.

సేవాపరిపోషణము :—

మంచి యుదాహరణము : ఆవన్నుల రక్షణకై సేవల చేయువాడు.

1. స్వలాభమునకు భంగకరముగ జూపట్టినను, పరుల యుపకారము కొఱకు పాటుపడును.

2. తన హక్కులను పాటింపక, తన ధర్మనిర్వాహణము ప్రధానముగ నెంచి పాటుబడును.



ప్రతిఫలము నపేక్షింపకుండ దప్పిగొనిన మార్గస్థులకు నీ రిడుట.

3. ప్రతిఫలాపేక్ష లేకుండ క్షేమతోడను, పరుల హితము కొరకై పాటుపడు తీవ్రకాంక్షతోడను పాటుపడును.

4. అహింస, శాంతి చేకూర్చు శాశ్వతత్వము కొరకై పాటుపడుట.

ముఖ్యలక్షణము:— పనిచేయువాడు తనకు లభించు ప్రతిఫలమును పాటింపకుండ పాటుపడును.

మానవజీవుల సమూహములలో ప్రతిదానియందును, అది యొక సమాజముగాని లేక జాతియేగాని, ఈ పైన పేర్కొనబడిన ఆయా పరిపోషకవర్గములలో చేర్పదగిన వ్యక్తులు కాన్పించుచుందురు. మన దేశములోని ప్రాచీన వర్ణాశ్రమధర్మము ఇట్టి పరిపోషణ వర్గముల పాటించి యేర్పడినదై యున్నది. తమ పశువాంఛ తీర్చుకొనుటకును, జీవితము నెగుడు దిగుడు లేక నడుపుకొనుటకును, అవకాశ మున్నంతవరకు సేవ యొనర్చుటకును, సంతోషపడు శూద్రులు మొదటి రెండురకముల పరిపోషణవర్గములలో చేరుదురు. ఆశాప్రేరితులై సాహసించువైశ్యులు సాహసపరిపోషకవర్గమునకు చెందుదురు. రాజ్యముయొక్క క్షేమమునే ప్రధానముగ పాటించి, వర్తించు దేశభక్తులగు క్షత్రియులు సమూహపరిపోషణవర్గములోనివారగుదురు. సమాజమునకై నిష్కామసేవ యొనర్చుచు, భౌతిక ప్రయోజనముల కగు స్వార్థచింతను, చూచుకొనక, ప్రజల యాదర్శములను ఉన్నతముగ నుంచి సంరక్షించుచు, నిర్ధనులుగ జీవించు బ్రాహ్మణులు అత్యున్నతవర్గమునకు చెందినవారగుదురు.

ఆధునిక కులవ్యవస్థ ప్రాచీనకాలపు ఆదర్శములనుండి చాలగా అధఃపతనమైపోయి యున్నది. పూర్వపు పేరులను, అర్హతలను పాటింపుచు, నిప్పటికులములవారికా గుణగణములను నారోపించి, ఆకాలపువారే వీరని నిరూపింపగలుగుట

అసంభవము. ఈనాటి బ్రాహ్మణుఁ డొకఁడు పెద్దపెద్ద జీతాలకు ఆశించి హైకోర్టుజడ్జీ కావచ్చు లేక ఐ. సి. యస్. కూటములోఁ జేరవచ్చు. అవాంతరముల భీతిలేకుండ, శాశ్వతాధారమైపఱగు ఉద్యోగబలము గలిగి, భౌతికలాభముల కాశించి పని చేయునంత వఱకు, అత డెంతటిసమర్థతతోఁడను, ఎంత న్యాయబుద్ధితోఁడను తన విధుల నిర్వహించువాఁ డైనను, ప్రాచీనవ్యవస్థప్రకార మైనచోఁ దప్పక శూద్రకోటిలోఁ బరిగణింపబడవలసియే యుండును. అతఁడే శ్రీమంతుఁ డగు వ్యాపారి యగుచోఁ వైశ్యుఁ డగును. లోకమాన్యతిలకును బోలి, తన కేమిమూడునను లక్ష్యము లేక, తన జాతియొక్క స్వాతంత్ర్యాదర్శమును సాధించుకొఱకై నిష్కామముగా పాటుపడు రాజకీయ నాయకుఁ డౌనెడల, అతఁడు ఉత్తమక్షత్రియుఁడే యగును. గాంధీజీవలె కేవలము ఉద్యమసిద్ధికన్న, ప్రయోగింపబడు సాధనముల నిర్మలతను సంరక్షించుట ప్రధానముగా నెంచి పాటుపడుచు, ఫలితార్థ మేమైన గాని, యెట్టికష్టములు పైబడినగాని, తన ఆదర్శము నంటిపట్టుకొని యుండి తీవ్రప్రయత్నముల సాగించునతఁడు, వాస్తవికబ్రాహ్మణుఁ డనవలయును.

బహుశః ఆప్రాచీనకాలపు పరిస్థితులను శాశ్వతముగా పరిరక్షింప గోరి, ఆకాలపు వ్యవస్థానిర్మాతలు కులధర్మములను వంశపారంపర్యము చేసి అనుల్లంఘనీయములుగా నియమించియుండిరి. వృత్తినిర్ణయమునందు వ్యక్తియొక్క స్వేచ్ఛావినియోగమునకు హద్దుపెట్టి, వానిని పుట్టువునకు బద్ధుని జేసిరి. ఈ ఆధునికప్రపంచమున ఉద్యోగములయు, వృత్తులయు ధారాళతనుబట్టియు, యెక్కడికిబట్టిన నక్కడికి మార్పుగల శ్రామికబలము ననుసరించియు, రాకపోకల సౌకర్యములచేతను, కర్మకౌశలమును సాంకేతికజ్ఞానమును సంపాదించుకొనుటకగు విశాలావకాశముల ప్రాభవమువలనను, సార్వజనీన

మగు విద్యావిధాన కారణమునను, ఆ ప్రాచీనవ్యవస్థ పూర్తిగా అను కూలపడనిదై పోయినది. పరిస్థితు లెట్లుమారినను సరే, ఆయావృత్తి వర్గములు మాత్రము శాశ్వతములై యుండియేతీరును. కాని క్రింది తరగతిలోనివారు పైతరగతిలోనికి పరివర్తనము చెందునిమిత్త మగు ప్రయత్నములను సదా ప్రోత్సహించుట మిక్కిలి అవసరము.

మన మిప్పుడు ప్రస్తావనలోనికి దీసికొని సవిస్తారముగ వర్ణించిన వర్గము లాతీరున, సదాసుస్పష్టములై గోచరింపక పోవచ్చును. ఒకే వ్యక్తి సయితము, ఒక్కొక్కసమయమున తనకు గలిగిన ప్రేరణ మూలమున, వేర్వేరు కాలములందు వేర్వేరువృత్తుల నిర్వహించు టయు సంభవము కావచ్చును. కాని వ్యక్తియొక్క పరమాదర్శము ననుసరించియు, సిద్ధాంతరీత్యా నిర్ణయముచేయుటకు వాని భేదము లను వాని జీవనగతిని అనుసరించియు సామాన్యవర్గీకరణమును చేయుచుందుము.

## అధ్యాయము 7

### మానవ పరిణామదశలు - సమాజములు - జాతులు

వ్యష్టి నరులు ఒకతరగతి పరిపోషణవర్గమునుండి వేఱొకదాని లోనికి పోగల్గువిధముననే, వ్యక్తులతోగూడిన సమాజములు, లేక జాతులు, ఇంతేల సమష్టిని మానవకోటి యంతయు, మొదట నేరీతి పరిపోషణవర్గమునకు చెందియుండునో ఆవర్గమునుండి మారి, వేఱొక వర్గమున జేరి, దానియొక్క ప్రత్యేకమగు విశిష్టలక్షణములను తమ సమష్టిజీవితమున స్ఫుటతరముగ ప్రకాశమునకు తేగల్గుదురు. కాబట్టి ఒకానొక సమాజమో లేక జాతియో అవలంబనముచేయు సమష్టి జీవితము ఇతర సమాజములతోడను, జాతులతోడను దానికిగల

సంబంధమువలన నవి ప్రకాశమునకు శేగలుగు వైఖరులను పరీక్షించుటమూలమున, మానవ పరిణామదశలలో దేనిని ప్రాసించి యున్నదో నిర్ణయించుట సాధ్యమే యగును.

మన వివరణముతో జతకు, ప్రాచీనమార్గమునుండి తొలగిన నేటి నాగరికసంస్కృతి అవలంబనముచేయు విధానములను మూడు దశాంతరములుగా విభజింపనగును:—1. ప్రాకృతసంస్కృతి (లేక పశు దశ), 2. ఆధునికసంస్కృతి (లేక నరదశ), 3. పరిణతసంస్కృతి (లేక పారమార్థికదశ). మన మింతకుపూర్వము ప్రస్తావనచేసిన యైదు వర్గములలోని మొదటి రెండు పరిపోషణవర్గములు— అనగా పరాన్న పరిపోషణము, స్తేయపరిపోషణము అనువానిని ప్రాకృతసంస్కృతి లేక పశుదశ కుదాహరణము లనదగును. పిమ్మటి రెండు పరిపోషణ వర్గములను— అనగా సాహసపరిపోషణము, సమూహపరిపోషణము అనువానిని— ఆధునికసంస్కృతి లేక నరదశ కుదాహరణములును; తుదిదగు సేవాపరిపోషణ మనెడు సుపరిణతసంస్కృతిని, పారమార్థికదశ కుదాహరణ మనదగును. మొదటిది అశాశ్వతమును, హింసాకరము నగు సంస్కృతి యనుట విస్పష్టము; రెండవదియు అశాశ్వత మైనదే; ఇందును హింసాలక్షణములు చాలగానుండును. కాని శాశ్వతత్వాకాంక్షయు, అహింసాకాంక్షయు అధికాధిక మగుచుండుట గోచరించును. తుదిదానిలో శాంతి, శాశ్వతత్వము, అహింసల గుఱించిన ఆకాంక్ష సాంద్రముగ గోచరించును.

1. ప్రాకృతసంస్కృతి లేక పశుదశ :— ఈ వర్గములోనివారు తదితర వర్గములవారితోడను లేక జాతులతోడను వ్యవహరించుపట్ల పరాన్నభుక్కులుగ నుండవచ్చును. పరాన్నభుక్కగు జీవి యితరుల హక్కులను సరకుగొనదు. తన యవసరముల కెట్లు నెట్లు చేకూర్చుకొనుచుండెనో విచారించరు. తన చర్యలవలన ఇతరులకు కలుగు

ఫలితార్థము తెలియవంటి వగునో లెక్కసేయడు. మృగములలో పెద్ద
పులిని చూడుడు. అది తాను పైబడి చంపనున్న లేడికూన యేమను
కొనునో యని స్థిమితముగా గూర్చుండి విచారించదు. దాని దృష్టి
యంతయు ఆసమయమున తనకుగల ఆకలిని తీర్చుకొను టెట్లా
యను విషయమువిూదనే యుండును. అదేవిధమున అడవులలో
వేటాడు బోయవాడును, ఏటిలో చేపలుపట్టు బెస్తవాడును ఇసు
మంతయు జాలి లేక, ఆ యా మృగములను, మత్స్యములను తన
తాత్కాలికపు టవసరముల దీర్చు కొనుటకై పట్టిచంపుదురు. సరిగా
ఆతీరుననే, అన్యసంఘములను హింసించి నాశముచేసి తమపరిపోషణ
మును జూచుకొను ప్రజాతియైనను నైజముగనే పరాన్నభోజనముచే
బ్రతుకునదై యుండును.

ప్రాచీనకాలమున పరప్రజ లొసగు కప్పములపై నాధారపడి
యైశ్వర్యము లనుభవించిన గ్రీకు, రోమక సామ్రాజ్యములు, ఇతరు
లను బానిసలజేయు విధానము నాధారముగ గొని బ్రతికిన వగుట
చేత పరాన్నభుక్కుల వర్గములోనివే యనవలయును.

ఈ నాడును, అధినివేశములందలి యుత్పత్తి విూదను, పరుల
శ్రమఫలముల దోచుకొనుట విూదను ఆధారపడు జాతీయ సంస్థ
లన్నియు పరాన్నభోజనముతో బ్రతుకునవియే.

చీనాదేశము బ్రిటిషువారి నల్లమందు వ్యాపారము, అమెరికా
దక్షిణప్రాంతముతోడి బ్రిటిషువారి బానిసలబేరము, పశ్చిమాఫ్రికా
రాష్ట్రములవిూద 'లియొపాల్డు' రాజు గావించిన దోపిడి, భారత
దేశపు అంగడులపై నాధారపడు బ్రిటిషు పారిశ్రామికుల వ్యాపార
నీతియు వారివారికి లోబడిన జనుల వినాశమును గూర్చిన వగుట
వలన, పరాన్నభోజనమే యనవలసియున్నది.

తాము చెట్లనుండి పండ్లు కోసి తిను పండ్లను పండించుటలో నేలాటి శ్రమయు పడని కోతుల జాతులు. అవి తమకు పండ్ల నిచ్చు చెట్ల కేలాటి అపకారము చేయవు; ఆ చెట్లు మఱలమఱల ఫలించు రీతిని వానిని నిరపాయస్థితిలోనే విడిచివేయును. కాన కోతులయొక్క నీతి స్తేయ పరిపోషణము లోని దనవలెను.

ప్రాచీన చరిత్రలో నాదరుషావంటి వారు కలరు. వారు దేవాలయములను దోచుకొని, యచ్చోట్ల వ్యర్థముగా పడియున్న ధనరాసుల నెత్తుకొని పోయిరేగాని, ఆదేశ ప్రజలయొక్క సంపదల నిర్మించుకొను సమర్థతను భంగ పఱచలేదు. కాన వారి దాడులు స్తేయ వర్గములో చేరుననవచ్చును.



దక్షిణ అమెరికా ప్రజా రాజ్యములను తమవశము చేసికొనియున్నన్యూయార్కు సాహుకారులు ఈ వర్గము లలో చేరుదురు. నిర్మాణ కార్యమున స్వయముగ నే విధమగు శ్రమయు పడకుండ, తమ వాటాల లాభములను పంచుకొను నేటి ఏ సంపదలను నిర్మాణము చేయక, వడ్డీవ్యాపారముచేసి భోగముల ననుభవించు సాహుకారులు. 'జాయింటు స్టాకుకంపెనీల' భాగస్వాములును స్తేయవర్గములలోనివారే. వీరు లాభముల పంచుకొందురేగాని, శ్రమలో సాయపడరుగదా? ఇదేవిధాన, గుత్తగొను వ్యాపారముల పూని, తమపెట్టుబడి నివృత్తి ననుసరించిరాగల దానికంటెను చాల హెచ్చుగా లాభమునుపంచుకొనుటలో పేరెన్నిక

గాంచిన 'కాప్టెలిస్సు' 'ట్రస్టులు' 'కంబైన్సు' మొదలగు సంఘసంస్థా ముములును చాలవరకు స్తైయ వర్గములోనివే.

ఆధునికసంస్కృతి లేక మానవదశ :—ఇప్పుడు వర్ణించిన దశ పూర్తిగా స్వార్థపరదృష్టిమీదను, హక్కులమీదను ఆధారపడునదై యున్నది ఇక మానవదశలోనో, ధర్మములను లేక విధులను పాటించు సూచన లుండును. హక్కులకును, విధులకును సమత చేకూర్చుటకగు ప్రయత్నము తఱచుగా గోచరించును. ఈ దశకు జెందిన జాతులు తాము శ్రమపడి సంపాదించిన ఫలముతో తృప్తిపడుచు పొరుగువానికి హింస కలిగించకుండ జీవించు ప్రయత్నముల సాగించును. భారత దేశములోను, చీనా దేశములోను వర్ధిలు వ్యావసాయిక జీవనముపై నాధారపడు నాగరికతను విచారించును. లాభము నార్జించు నిమిత్తము చాలవరకు శాంతముగా తమతమ వృత్తులను చేసికొనుచు బ్రతుకు శిల్పుల తోడ్పాటుతో అయ్యది నడచుచున్నది. ఈ నాగరికతను సాహసపరిపోషణ కుదాహరణముగా దీసికొనదగును.

జాతుల పేర సమైక్యత గూర్చుకొనుచు, తెలుపు, నలుపు, ఎఱ్ఱన, పచ్చన మున్నగు రంగుభేదములగాని, లేక సంపదల సంబంధించి రాజు, రయితు అనెడు తారతమ్యములను గాని, పాటింపని ముస్లిము నాగరికత సమూహాపరిపోషణ రకమునకు చెందినదనుట స్పష్టము. 'నాజీలును' 'ఫాసిస్టులు' నిటీవల ఈవర్గములో చేరుకొనిరి. వీరు హింసాపరులైనను, ముఖ్యముగా తమ వర్గములకు వెలుపలి వారియెడ కాఠిన్యము వహించువారైనను, సాంద్రమగు సామాజిక దృష్టికలవారుగ నున్నారు. ఎట్లైనను వీరియందు సమూహాపరిపోషణ లక్షణములుచాలగలవు. వీరు తమతమ వర్గమువారియొక్క నిర్వహింపదగిన విధులం గూర్చి పట్టుదలగలిగి యుందురు. ఈ వర్గమునందలి

ప్రత్యేకించియు సమష్టి కొఱకున్నను లేక తమ సంస్థ సంబంధమునగు సమష్టి క్షేమమునందు వ్యక్తి క్షేమము కూడ నిమగ్నమైయున్నదనుట భావించును.



జలపాత విద్యుచ్ఛక్తి ప్రజోపయోగమునకై వినియోగించువిధము.

పరిణతసంస్కృతి, లేక పారమార్థికదశ: ఇందే మోక్ష వర్గమునెడనో గాక సమస్తజీవులయెడను పాటించవలసిన విధులు గలవను భావన ముదయించును. అన్నిమతములు ఈసంస్కృతిని సాధించుటకే సాధనభూతము లగుచున్నవి; మరియు నవి భూతదయను, దీనజనోద్ధారణమును ప్రతిపాదించి భగవత్సేవ నుండి తొలగినవారు పాపమునార్జించి ఎట్లు శిక్షా పాత్రులగుదురో తెలుపుచున్నవి. భోగలాలస అనిత్యమగు ప్రాపంచిక సుఖమునకే దారితీయుననియు నవి బోధించుచున్నవి.

ఐననుకూడ, ఈ దశాంతరమున కాదర్శప్రాయముగ నుండ జాలు సాంఘికకూటము నెద్దానినిగాని మనము పరిణమింపజేసి యుండ లేదు. ప్రాచీనుల యభిప్రాయములో బ్రాహ్మణు లీ దశకు సమీపవర్తు లనదగియున్నను, నేడు ఆ పేరున బఱగు జనులు, ఆయాధర్మములకు చాల దూరులై, పతితులై పడియున్నారు.

ఈ యుత్తమదశను ప్రాపించు నిమిత్తమే తన యాపచ్ఛక్తి సామర్థ్యములను ప్రయోగించి, గాంధీజీ గాఢప్రయత్నముల సాగించి యున్నాడు. గాంధీజీ యేర్పాటు చేసిన అఖిలభారత చర్ఖాసంఘము, అఖిలభారత గ్రామపారిశ్రామిక సంఘము మొదలగునవి వారి ఆదర్శములు కార్యరూపము దాల్చుకొరకై చేయు ప్రయత్నములకు నిదర్శనములై యున్నవి. ఆయన కృతకృత్యుడైన యెడల 'రామరాజ్యము' అనగా భూలోకమున దైవరాజ్యము అనదగు శాంతిమయజీవనసంస్కృతి చేకూర్చి శాశ్వతపరిపోషణయొక్క ప్రతిష్ఠాపన జరిగియుండెడిది.

# ప్రకృతి

- అనిత్యము - నాశకరము
  - లోకోపకారశూన్యమగు హక్కులు ఆధారము
    - మనుడుసహా సర్వజీవులు
      - పరాన్న పరిపోషణ
        - దానశూన్యత
          - అనార్థిభంగము
      - స్త్రీయ పరిపోషణ
        - దానశూన్యత లేక దానమునకు మించిన ప్రతిఫలమును లాగుట
      - సాహస పరిపోషణ
        - ప్రతిఫలసహిత దానము
- శాశ్వతము - రచనాసమర్థము
  - లోకోపకార భావమును విధులును ఆధారము
    - సభ్యనరుడు
      - సమూహ పూరిపోషణ
      - సమూహ పరిపోషణ
        - (సమూహ పూరిపోషణ, సమూహ పరిపోషణ) ప్రతిఫలమునకు మించిన దానము
      - సేవా పరిపోషణము
        - ప్రతిఫలాపేక్ష రహితదానము

# అధ్యాయము 8

## మూల్యప్రమాణములు

బాగుగా తెలిసినట్టి లేక స్వగ్రాహ్యమైనట్టి ప్రమాణముల ప్రయోగించి, ఆ యా వస్తువుల మూల్యమును, లేక విలువను నిర్ణయింతుము. వేర్వేఱు వస్తువులను కొలుచుటకు వేర్వేఱుసాధనములు కలవు. కొన్నిటిని లెక్కపెట్టుదుము : కొన్నిటిని తూచెదము ; కొన్నిటి పొడ వెంతయో చూచెదము ; కొన్నిటి ఘనపరిమాణమును గణించెదము. గోధుమలవంటి గట్టిద్రవ్యములను ఇన్ని సూనికలు, ఇన్ని శేర్లు అనుచు కొలిచెదము. బెల్లము, ఇనుము మొదలగువానిని ఇన్ని మణుగులు, ఇన్ని టన్నులు అనుచు తూచెదము; వెదురువాసాలను లెక్కపెట్టుదుము ; వస్త్రములను గజపుబద్దతో కొలిచెదము ; కాగితములను ఇన్ని రీములు, ఇన్నిదస్తాలు అని లెక్క వేతుము; బీడీలు, సిగరెట్లు మొదలగువానిని ఇన్నికట్టలు, ఇన్ని పెట్టెలు అని లెక్కింతుము; పాలు, నూనె మొదలగువానిని ఇన్ని శేర్లని కొలుతుము ; కిరోసిను ఆయిలును, శిరాలను ఇన్నిసీసాలని లెక్కచూచెదము. ప్రతి ప్రమాణమునకును నిర్ణీతమైన కొలతలున్నవి. ఆ కొలతలతోడ లెక్కవేయు వస్తువులును, వాని సాయమున తేల్పబడిన విలువలును సుప్రసిద్ధములై సర్వాంగీకారము పడయుచున్నవి. ఎవ్వరుగాని అంగడికి పోయి, యిన్నివేల గోధుమగింజలను లెక్కపెట్టి యిమ్మని యడుగరు.

**అనుసరణస్వభావము :—** ప్రత్యేకము మనసంబంధముగామాత్రము మూల్యముల పరిగణనచేయునప్పుడు ఆపరిగణనుస్వార్థమైనదందుము. మనపరిగణకన్యమగు పరిగణతో పోల్చి చూచినప్పుడుగాని, లేక భావనారూపమగు ఆదర్శముతో పోల్చినప్పుడుగాని, యితరమానవుల ప్రశక్తిదీసికొని విచారించినప్పుడుగాని ఆమూల్య పరిగణను పదార్థ

నుందుము. జంతువులలో [illegible] స్వయంనిర్ణయము పైననే ఆధారపడును. వానిపరిగణన సహా స్వార్థపరముగా నుండును-అనగా వాని సద్యస్సుఖాల ప్రయోజనమున కనుసరణమైనదిగా నుండును. అవి పరార్థచింత పెట్టుకొనవు. అదేతీరున ప్రాకృత మానవునకును పదార్థచింతతో జోక్య ముండదు. సంస్కృతపురుషుడు అనగా ఉత్తమపరిణతి గాంచిన నరుడు మాత్రమే నిస్సంగముగా విషయ విచారణచేయగలడు. యథార్థమునకు నరు డుపయోగించు పరిగణ ప్రమాణముల ననుసరించి, వానియోగ్యత నిర్ణయ మగుచుండును.

### వ్యక్తిగతప్రమాణములు, లేక స్వార్థపరప్రమాణములు

ప్రమాణికులు:—సమస్తజీవనగతులందును మనుష్యులయొక్కయు, వస్తులయొక్కయు యోగ్యతలను నిర్ణయించి వర్ణన చేయవలసి వచ్చుచుండును. బావిలోనినీరు తేటగానున్నది. వస్త్రము శుభ్రముగ నున్నది అందుము; ఒకపువ్వును చూచి రమ్యముగ నున్న దందుము; ఒకమానవుని వర్తనమునెంచి యోగ్యమైన దందుము; ఒకనిచర్య స్తవనీయమైన దందుము. ఇట్టి నిర్ణయము లన్నింటి యందును, వానికాధారముగా కొన్ని ప్రమాణములు (కొలతలు) కలవని సూచితములగు చుండును. ఒకానొక పురుషుడు సదాన్యాయనిర్ణయమును సక్రమముగ చేయునను నప్పుడు, వానిని విచక్షణాశీలు డందుము; అనగా అతడు యోగ్యతాప్రమాణములను సవ్యముగను, సక్రమముగను గణనచేయ జాలునని అర్థము. ఈ ప్రమాణములను శారీరకములు లేక భౌతికములు అనియు, మానసికములు లేక సాంస్కృతికములు, మఱియు పారమార్థికములు అనియు వర్గీకరణము చేయుదుము.

ఒకవర్తకుడు వ్యాపారములో తనకు రాగల లాభమునసరించి, సరకుల నాణ్యము తేల్చును. ఒక్కశ్రామికుడు ఏదేనివస్తువును తాను

వినియోగము చేసికొనునప్పుడు దానివలన తిండి, గుడ్డ, ఇల్లు మొదలగు అవసరముల నెంతవఱకది తీర్పగల్గునా యను విచారణ ననుసరించి, దానికి విలువగట్టును. ఒకచిత్రకారుడో, సౌందర్యము మీదనే దృష్టినిలుపును.

కాలము, కీర్తి, సంపదలు మున్నగువానిపై నాధారపడు ప్రమాణములు గలవు :—

కెయిరో మ్యూజియమును చూడవచ్చు వారి కక్కడి చిత్రవస్తువుల చూపు దర్శకుడు కాలముయొక్క దృష్టితో సర్వమును గణన చేయును. అతడొక వస్తువును "టుటంఖమెనుమమ్మీ" అని చూపి, అది అనేక వేలయేండ్లనాటి పురాతన వస్తువనియు, 'రాంసేజుమమ్మీ'ని జూపి అది క్రీస్తుపుట్టువుకు పూర్వ మెన్ని యుగములనాటిదో యనియు చెప్పుచు, సందర్శకుల కబ్బురముగొలుపజూచును. అచ్చటి వస్తువుల పురాతనత్వముం గ్రహించి, ప్రేక్షకు లద్భుతపడుదురుగాక యని అతని ఆశయము.

రోము, ఫ్లారెన్సు, నగరములకు బోతిమేని, అచ్చటి దర్శకుడు 'మైకిలు అంజీలో' 'రోబార్సు' ల వంటి శిల్పాగ్రేసరులు రచించిన చిత్రిపులను, గోడలమీది బొమ్మలను, చిత్రలేఖనములను చూపును. వానినిచూచు ప్రేక్షకులు అతని దృష్టిలో ఆ రచనలు మహాఘనవైదములని అంగీకరింపవలసియుందురు.

ప్రాచీన కాలముననె ఉద్యానములు, భవనములు, కళలు, కావ్యములు మున్నగు రమ్యరచనలందు తాము మేటులమని పారశీకులు గర్వముమీర పలుకుచుందురు.

బ్రిటిషు మ్యూజియమును జూడబోవు ప్రేక్షకునకు చీనా, ఇండియా, పెరూ, పర్షియా మొదలగు దేశములనుండి తెచ్చిన రకరకములగు రమ్యవస్తువుల చరిత్రిలు తెలుపబడును. అతడు బ్రిటిషు

వాని జగద్విఖ్యాతమగు సత్ప్రయోజనప్రాముఖ్యమును గని నెఱుగంగ గలము.

న్యూయార్కు నగరవీథులలో బోవునప్పుడు కొండవలె మెడ చాచి, నింగినంటెదరయునో యన; ఉన్నతములౌ మేడలదొంతరులను గాంచునతడు, వాని నిర్మాణమునందు వెచ్చింపబడిన ధనపుమొత్తములు కోట్లను దాటిపోయి యర్బుదములలో గణితము చేయవలయుట దెలిసి విస్మయము నందును. ధనలోభియగు విదేశీయు డెవడేని వానిం జూచునప్పుడు వాని ప్రాచీనతనుబట్టిగాక, వాని సుప్రసిద్ధశిల్పముం గనియు గాక, వాని అందచందముల యరుదౌ వైఖరుల గమనించియుగాక, వానికై వ్యయపఱచబడిన ధనరాశి మూల్యముం నూహచేసి ముగ్ధుడు గావలయును.

ఏమొక్క సందర్భమునను ప్రత్యేకముగా అన్వయింపగలమని నిర్ధారణ చేయదగు ప్రమాణ మెందును లేదు. కాని విచిత్రాంశమేమనిన అందందు విశిష్టముగ వినియోగము చేయబడు ప్రమాణముయొక్క ప్రాధాన్యతను మనము గమనింపవలసియుండును. తాజ్ మహాల్ చూడబోవు యాత్రికుడు అందుపయోగింపబడిన చలువరాతి నాణ్యముంగూర్చి యభివర్ణనచేయ గడంగడు. 'కత్తాబ్రా' లో వీనిని మించిన, చలువరాళ్లు లెన్నివిలేవా? దాని రచించిన శిల్పిపేరుసైతము తెలియరాదు. ఆ దివ్యనిర్మాణము యొక్క కాలమేని విస్మయజనకము కాదు. అయినను దానింజూచుటచే గలుగు చిత్తవికాసమును, ఆ భవన రచనయందు ప్రదర్శితమౌ ఔచిత్యము చూచువాని నాకర్షించి ముగ్ధుని చేయుననెడు విషయము గమనింపదగియుండును. విమర్శదృష్టితో, దానియందు గమనింపగల మాన్యతరాంశముల లెక్కించి కొనియాడ నక్కఱ లేకయే, అప్రయత్నముగనే హృదయమున హర్ష ముప్పతిల్లును.

నేర్చేటు భావములతో సాగించు పరిగణనమార్గములకు ప్రమాణములకు దృష్టాంతముల నిచ్చియున్నాము. వర్తకుని ప్రదర్శనాగారమున విక్రయమునకై అమర్చి పెట్టబడిన వజ్రపుటుంగరము వంటి స్వర్ణాది ద్రవ్యముల మూల్యమునకు అతీతమై వెలయు ప్రమాణములు గలవు. ఒకానొక విఖ్యాత చిత్రకారుడు రచించిన తైలవర్ణచిత్రము నొకదానిం దీసికొందము. దానివిలువ అందుకై వినియోగించిన, గుడ్డ, రంగు, మొదలగు వస్తువులపై నాధారపడి యుండదు. తల్లిదో తండ్రిదో యగు జీర్ణపాదుకంజూడుము. పితృభక్తి పూరితుడై తనయుడు దానినే మహాదమూల్యవస్తువుగా సంరక్షింప వచ్చును. విక్రయార్థమునకు విలువ యిసుమంతయు దానియందు కానుపించదు. ఐననేమి? ఆవ్యక్తియొక్క దృష్టిలో ఆ ముక్కలు అయిన వస్తువు సయితము విశిష్టమగు మూల్యము కలదేయగును.

వాంఛితార్థవస్తువునకు, దానియందు గలుగు మక్కువకొలది మూల్యమును నిర్ణయింపజూచినను, స్థిరప్రమాణమనునది యుండదు. కొందఱు వ్యక్తులననుసరించి కొన్ని కొన్ని వస్తువుల విలువ మారి పోవుచుండును. డబ్బనుబోలు విశ్వజనీన ప్రచారము ప్రమాణము గల వస్తువునకు సయితము ఎల్లఱు సమానముగ నంగీకరింపగల స్థిరతరమగు విలువను నిర్ణయింప జాలకున్నారు. ఒకరయితు చేతి లోని రూపాయి వాని కుటుంబమున కొకదినము ఆహారమును సంపాదించిపెట్టగల అవకాశమునకుచిహ్నము కానగును. ఆరూపాయి యే యొక్క ఉద్యోగి చేతిలోనుండినచో, అనేక సినిమానాటకమును జూచుటకు వినియోగపడగలదు. అదియే యొక ధనాఢ్యుని చేతిలో నున్నయెడల మోటారుడ్రైవరునకిడదగు ఈనాముగనో, తన వస్తువులను కావలిగాచువానికిచ్చు కూలిగనో, ఉపయోగపడగలదు. ఇట్లు ఒకే యొకరూపాయి ధనికునిచేతను, నుద్యోగిచేతను, రయితుచేతను,

నింకను బీదవానిచేతను బడునప్పుడు స్థానపుమార్పువలన గలుగు దాని ప్రయోజనము హెచ్చుగుచుండెనని తెలిసికొంటిమి. మరియు ఆ రూపాయియే ఒక దరిద్రుని చేతిలోనుండి భాగ్యవంతుని చేతి లోనికి పోవునెడల దానివలని ప్రయోజనము తఱిగిపోవును.

ఒకే వ్యక్తిచేతిలోనున్నను కూడ, వస్తువులయొక్క విలువ సదా యొకేతీరున నుండజాలదు. ఒక బాలునిచేతిలో ఏడు జిలేబీచుట్లు లున్న వనుకొనుడు. ఆ యేడుచుట్లును ఒకేరకము పిండితో చేయబడి, ఒకే తూనికగలవిగ నుండవచ్చును. ఐనను ఒక్కొక్క జిలేబీచుట్టవలన గలుగు సంతోషము, తక్కిన వానిలో ఒక్కొక్కచుట్ట యియ్యగల సంతోషముతో సమానముగ నుండజాలదు. ఆ బాలుడు మొదటగా దిను జిలేబీచుట్టను అమితాసక్తితో తినును. బహురుచిగానున్నదనును. ఇంక నొకచుట్టనో రెంటినో తిని సమానముగనే ఆనందింపవచ్చు ననుకొందము. ఆ పిమ్మట ఒక్కొకచుట్టను తినినకొలదిని, జిలేబీ చుట్టలరుచి తరుగునట్లుండి, వానిమక్కువ తఱుగుచుండును. చివ ఱకు మిగిలినవానిని తినుటయనిననే వానికి వెగటుపుట్టునట్టిస్థితి సంభ వించును. కావున ఆ జిలేబీచుట్టలను తినినకొలదిని, ఆ బాలుడు ఆ జిలేబీల కీయగల మూల్యము అనగా విలువ తగ్గిపోవుచుండును అనవచ్చును. ధనికునిచేత బడిన రూపాయి గతికూడ ఇదేతీరున నుండును. అతనికి హెచ్చుగా రూపాయీలు చేకూరినకొలదిని, అతడు ఒక్కొక్క రూపాయికిడు విలువ లేక గణ్యత తగ్గిపోవు చుండును.

ఇప్పుడు చూడండి :— జిలేబీచుట్టల దినుబాలుడు ఆరుచుట్టల దినిన పిమ్మట, జిలేబీలయెడ వానికి గలుగు మక్కువ చాలతక్కువ. నీళ్ళు కావలయునను కోరికపుట్టి బలపడును. కడవెడు నీళ్ళుగల బాలు డొకడు వానికి కనబడుననుకొందము. అప్పుడతడు వానికడ[illegible]

పోయి, ఒక కోకా కోలా సీసా తన కిచ్చునెడల, అందుకు బదులుగా ఒక
జిలేబీ చుట్టను సంతోషముతో నిచ్చివేయుటకు సమ్మతింపగలడు.
అప్పుడు వాని కా కోకాకోలా సీసా త్రాగుటవలన గలుగు ఆనందము
వాని కదివరకున్న యేడవ జిలేబీచుట్టను దినుటవలన గలుగు సంతో
షముకన్న మిన్నదై తోచును. రెండవ బాలునికో, మొదటి బాలు
నకు ఏడవదైన జిలేబీ చుట్టయే తనికి మొదటి జిలేబీచుట్టయై గొప్ప
సంతోషమును కూర్చును. ఒక్క కోకా సీసాకొరకు ఒసగబడు
యేడవ జిలేబీయొక్క మారకము ఇరువురు బాలురకును లాభదాయ
కమైయై కానబడును. ! వస్తువుమార్పిడి వ్యవహారములో, ఇరు
వురు బాలకులకు అంతకు ముందును ఆ సమ్మతను కలిగిన ఆనంద
మును మనము గణితమువేసి చూచుదము. ఆ యిరువురివద్దను
మొదటనున్న సరకుయొక్క విలువయందు మార్పు ఏ మాత్రమును
మనకు కనుపించదు. కాని వారు చేసికొనిన వస్తుమార్పిడి వ్యవహారా
నంతరము, వారనుభవించు ఆనందముయొక్క విలువ చాల మారిన
దని యొప్పుకోవలసియున్నాము. ప్రపంచములో జరుగు వర్తకమున
కంతకును ఇదియే కీలకము. అమ్మినతడును, కొనునతడును పర
స్పరము మేలుకూర్చుకొనినవారే యగుచున్నారు. ఇందొకరు నష్ట
పడుట, వేరొకరు లాభమునందుట అనునది లేనేలేదు.

స్థిరతర ప్రమాణములు, లేక పరార్థప్రమాణములు :— కేవలము ధనరూ
పమో లేక వస్తురూపమో తాల్చు మూల్యములయొక్క ప్రమాణ
ములను ఆధారముగా తీసికొని జరుపు వ్యవహారములందు స్థల
భేదముగాని, కాలభేదముగాని మన దృష్టిలో నుండదు. ఇదొక
లోపమే. దీనివలన మన లోకతీరు గ్రుడ్డితన మావహించుచున్నది;
హింసను వినాశమును తెచ్చిపెట్టుచున్నది; వానినుండి తప్పించుకో

లేకున్నాము, పురుషుని సంస్కృతి సాధించినకొలదిని, సంకుచిత ములును, అశాశ్వతములును నగు మూల్యములను, ఆ మూల్య ప్రమాణములను పాటించు బుద్ధి దూర మగుచుండును. ఏమాత్రము స్థిరత్వమును, అనగా శాశ్వతత్వమును కోరుకొనినను, మూల్యముల ప్రమాణము, అట్టి మూల్యముల నిర్ణయించు పురుషుడును అశా శ్వతుడేగాన, వాని ప్రమేయము లేని దేనిమీదనో ఆధారపడు నదిగా నుండవలయును. వస్తువుల స్థిరత్వ చింతననుసరించి యేర్పడు ఆదర్శములు గలిగి, అట్టి దృష్టితో గ్రహింపబడునట్టియు, వ్యక్తుల యిష్టానిష్టముల ప్రసక్తిలేక స్వతంత్రమై యొప్పునట్టియు, ఆధార ములు స్థిరతరములై నిలుచును. కావున అవి సత్యములును విశ్వాస పాత్రములునై, అనుచరణీయములు కాగలవు. శాశ్వతత్వమును సాధింపగోరుదుమేని, అటువంటి విలువలపై నాధారపడు పరిపోష ణము మనకు ముఖ్యావలంబనీయమై యుండును.

నైతిక మూల్యములు :— నీతిశాస్త్రము ననుసరించి జీవించు వ్యక్తి, స్థూలవిషయములపై నాధారపడు మూల్యప్రమాణములను పాటించ బోడు. దొంగవాడొక చిన్నిపాపను చంపును. దానిపై నుండు నగల నెత్తికొనిపోయి అమ్మజూచును. ఆ నగలు వాని కెటుల లభించినవో, ఆ పుట్టుపూర్వోత్తరగాథ దెలిసినచో యెవ్వడేని వానిని కొన నిచ్చగించునా ? ఆ నగలనగా యేవో కొన్ని తులాల బంగారము మాత్రమేకాదు; అభము శుభము నెరుగని యొక పసి బిడ్డయొక్క రక్తము సయితము వాని మూల్యమునే చేరియున్నది! దానిని యెంత చౌకగా అమ్మజూపినను, అవోక పసిబిడ్డను హత్య గావించి తెచ్చిన నగలని యెరిగినచో, వెగటుచెందునేగాని, యే నరుడును వానిని కొనుక్కొన నిచ్చగింపజాలడు.

అట్లుగానే బజారులో అమ్మకమునకు పెట్టబడు ప్రతి వస్తువునందును నైతికమూల్యము ఇమిడి యుండును. అటువంటి విలువలను పాటించుటమాని 'వర్తకము వర్తకమే లెంతు' అని మనము తేలికగా పలుక దగదు. బానిసల హింసతోడను, మోసము చేయబడిన శ్రామికుల కష్టముతోడను తయారు చేయింపబడిన సరుకు లందు హింసాదోష మిమిడియే యుండును. అట్టి సరకులను కొనుగోలు సేయు మనము, ఆ వస్తువు లెటువంటి హింసాకర పరిస్థితులలో సిద్ధము చేయబడెనో పాటింపకున్నను, ఆ హింసను గూర్చిన బాధ్యత మన నెత్తిపై పడకమానదు. కాబట్టి వర్తక వ్యాపారములలో పాల్గొనునట్టి ప్రతివానిమీదను గొప్ప బాధ్యత యున్నది. ఆ వ్యవహారము దమ్మిడీ విలువగల వస్తువుఁగూర్చినదే యగుగాక. తాను బుద్ధిపూర్వకముగా ఆమోదింపదగనట్టియు, ప్రోత్సహింపదగనట్టియు పరిస్థితులకు తాను కారణభూతుడు కాకుండ జాగ్రత వహింపవలసి యున్నది.

సంఘాచారములు :— తాను పొందగల మేలును సంఘమే నిర్ణయింపగలదు. వ్యక్తులు గాని, కూటములుగాని తమకై చేయబడు వివిధములగు సేవలం గూర్చి తాము చూపు మన్ననరూపమున ఆ సేవలకును మూల్యముల నిర్ణయించినవా రగుచున్నారు.

ఉదాహరణకు, పూర్వకాలమున నాలుగు వర్ణములవారి యెడను చెల్లుబడియైన ఆదరణకు, ఆయా వర్ణములవారు సంఘమునకు చేయుచువచ్చిన సేవలే యాధారముగ నుండెను. తన యవసరములను మాత్రమే చూచుకొనుచు, నితరుల ప్రమేయమును గమనింపక, జీవనము గడపు శూద్రునకు సంఘములో చెప్పుకోదగినంత గౌరవము ఉండెడిది కాదు. అంతకంటె కొంచెము ఉన్నతస్థాన మొసగబడినను,

తన లాభముకొఱకుగాని, పరుల నష్టమును చూపుచు, తనకొఱకే సంపదను కూర్చుకొనుచు, ఆ సంపదయందున నేదో కొంత మేలును సంఘమునకు చేకూర్చుచుండిన వైశ్యునకును జూపబడిన మర్యాదయు తక్కువదే. తన రక్షణపై నాధారపడియున్న ప్రజల గౌరవము బాధ్యతను వహించి, తాను నిర్వహింపవలసియున్న ధర్మముకన్న తన ప్రాణమును, తక్కువమూల్యము గలదిగా గణించు క్షత్రియు నకు ఘనతరపదవి యంగీకరింపబడియున్నది. తన భౌతిక శరీరము భగ్నమైపోనున్నను సరకుగొనక, ఒకానొక పరమగమ్యార్థసాధనకై జీవితము నంకితముచేయు బ్రాహ్మణుని పాదములచెంత సర్వజనులు, రాజులు సయితము సాష్టాంగపడెడివారు. ఎన్ని సహస్రాబ్దులనాడో మన దేశమున పరిపాటియై సాగిన సంస్కృతి, గౌరవప్రమాణములు ఇటు లుండెడివి. దురదృష్టవశాత్తు, నేటికాలమున, క్షణభంగుర మయ్యు కండ్లకు మిఱుమిట్లుగొలుపు భౌతికసంపదల తళుకు బెళు కులు పూర్వపు గౌరవమర్యాదల విలువలను తారుమారుచేసి వైచి నవి. మనకు ప్రాప్తార్జితములై యున్న యీ దివ్యాదర్శముల దిశకై మరలుటకు మనము సర్వవిధముల ప్రయత్నింపవలసియున్నది. వానిని యవలంబించిననేగాని మనకు సుస్థిరత యేర్పడజాలదు.

ఆధ్యాత్మికమూల్యములు :— యూదుల రాజులలో మహాఘనుడయిన దావీదును గుఱించిన ప్రాచీనగాథ యొకటిగలదు. యూదుజాతికిని, ఫిలిస్తైను జాతికిని బద్ధవైర ముండెడిది. ఒకసారి సాగిన యుద్ధములో ఫిలిస్తైనులసేనలు తఱలివచ్చి దావీదురాజునకును, వాని రాజధానీ నగరము 'బెత్లెహేము' కును మధ్య చేరుకొనినవి. శత్రుసేనా వారమునకు ఆవలివైపునను, బెత్లెహేము నగరమునకు వెలుపలను నున్న పెద్దబావి దేవిమునకు వాని సేనావారమునుండి కాన్పించు

చుండెను. "ఆ బావినుండి చల్లని నీరు తోడి తెచ్చి నా దప్పి తీర్ప గలవారెవరో కదా!" యని దావీదు అభిమానము పురిగొలుప పలికినాడు. వాని వీరభటవర్గములో కొందఱు పలుకు లాలించిరి. తక్షణమే వారు తమ యేలిక కోరికను దీర్పుటకై పయనమైనారు. తమ ప్రాణములేమైపోవునో యనెడుచింత యిసుమంతయు లేనివారై, శత్రుసైన్యముల చీల్చుకొని సాహసమున బర్వులిడి, ఆ బావిం జేరి, అందుండి కడవెడు నీరుం దెచ్చి రాజునెదుట బెట్టిరి! రాజు వారి సాహసమునకు మెచ్చి, తనస్వల్పపుకోరికను నిర్వహించు నిమిత్తము, తమ ప్రాణములనే తృణప్రాయముగా నొడ్డ సమకట్టిన శూరభట వర్గము యొక్క సాహసమునకును, ప్రభుభక్తికిని ఆశ్చర్యపడి ముగ్ధుడై పోయినాడు. వాని ఆధ్యాత్మిక నేత్రమున కప్పుడా కడవలో గోచ రించిన దేమి? చల్లని నిర్మలోదకము కాదు; దానిని సాధించి తెచ్చిన యోధవరుల జీవరక్తమే వాని కందు గోచరించినది! ఆతడా కడవ నెత్తిపట్టుకొని, "నేనీజలము నెటుల త్రాగగలను? దీనియందున్నది నీరు కాదు; నాప్రియసైనికుల నెత్తురే సుడీ! నేను వీనిని గ్రోలితినా దైవశాపోపహతుడనై పోనా! ఆ వీరభటు లర్పించు తర్పణముగా దీనిని భగవంతుని కొసగుదుగాక" అని మిగుల నుత్కంఠుడై పలికె నట! అటువంటి దివ్యభావప్రేరితములై మన చైదములు వెలయు చాలదిని, ప్రతివిషయమునకును దానికర్హమగు నుచితస్థానమునొసగి, దాని వాస్తవికమూల్యమును గుర్తింప జాలుదుము. అప్పుడు మన జీవితచర్యలు హెచ్చు పవిత్రవంతములగుచు శాశ్వతపరిపోషణ విధా నమునకు దారిజూపగలవు. అహింసావలంబనముం జేకూర్చి, మానవ జాతి నుద్ధరించి, శాంత్యానందముల ప్రసాదింపజాలును!


మూల్యములు
స్వార్థపరము
పరార్థ పరము
కాయకము
భౌతికము
చిత్తవిస్ఫారకము
నైతికము
సాంఘికము
ఆధ్యాత్మికము
ప్రాథమికావస
రములతృప్తి
కల్పితావస
రములతృప్తి
మానసిక్వాం
ఛల తృప్తి

# అధ్యాయము ౪.

## ప్రమాణనిర్ణయము

మూల్యములను తేల్చుటయందు ఉపకరించు ప్రమాణములు తమ తీరులను, తమ ప్రభావమును వినియోగదారులమీద అంకితము చేయుచుండును. ఒకజాతియందు సామాన్యమైన కొన్ని ప్రధాన ప్రయోజన దృక్పథము, ఆజాతి సంస్కృతియందు శతాబ్దములకొలది తన ప్రభావమును చూపుచుండును. కాబట్టి జాగ్రత్త గలిగి వివేక పూర్వకముగా మనము నిర్ణయించుకొను ప్రమాణముల వైఖరి చాల ప్రాధాన్యత వహించును.

ఈజిప్టు, బాబిలోను, గ్రీసు, రోమురాజ్యముల ప్రాచీన నాగరికతల చారిత్రకగాధను వివరింపజాలు జాడలు నేడు కానరావు. కొలది శతాబ్దములవరకు మాత్రము తమ తళుకుబెళుకుల జూపుచు వెలింగి యదృశ్యములై పోయినవి. ఏలన వాని నిర్మాణమున కాధారములై నిలిచిన ప్రమాణములు ప్రధానముగా స్వార్థపరములును, అస్థిరములునై యుండెను. వాని నిర్మాణ సంప్రదాయములు పరుల బానిసల గావించు విధానమువలనను, తమకు లోబడిన జాతులనుండి బలాత్కారముగ కప్పములగైకొను విధానమువలనను విషపూరితములైపోయె నని వెనుకటి అధ్యాయమున సూచనప్రాయముగ దెలిసికొని యున్నాము. గ్రీకులు, రోమనులును తమ శిల్పమునందును, కళలందును, వాఙ్మయమునందును తమ యుద్దేశపూరితములును స్వార్థ పరములు నగు లక్ష్యములను, ప్రమాణములను సుస్థిరముగ అంకితము గావించియే యున్నారనుట తథ్యము. అయ్యవి వారి భావిసంతతి వారు తమ పూర్వుల ఘనతనుగూర్చి ప్రగల్భముగ చెప్పుకొనుటకు

మాత్రమే ఉపకరింపజాలునట్టివిగ నున్నవి. వాని సంస్కృతులయందలి సజీవమగు సత్వము శూన్యమైపోయి యున్నది.

ఇందుకు భిన్నముగా, ప్రాచీనతమమునందు సమానములో, లేక అధికములో అనందగు చీనాదేశముయొక్కయు, భారతదేశముయొక్కయు సంస్కృతులు, పరోపకారపరములును స్థిరతరములును, అగు సత్వముల ననుసరించి నిర్మితములై యున్నవి. ఆ కారణమున నవి యీనాటికిని తమ జాతీయ నిర్మాణమునందు చైతన్యలక్షణములను, మఱియు శాశ్వతత్వముయొక్కయు, అహింసాధర్మముయొక్కయు నితర చిహ్నములను సుస్పష్టముగ చాటుచున్నవి. వీరి పారలౌకిక దృష్టినిగూర్చియు, ప్రాచ్యమతాచారముల గూర్చియు చులకనగ గేలిసేయుటకు వెడగులగు ఆధునికయుగ లౌకికపురుషులు పాల్పడుదురేగాక! పశ్చాత్తాప పడదగిన దింతేమియు లేదు. పొంచియుండి పైబడు వన్యమృగదశనుండి పరిణామసోపానముల నెక్కి పైకిబోవుచున్న మానవజాతిని వేరుజేసి చూపు ప్రాచ్య సంస్కృతి గుణమేకాని దోషము గాదు. సమాజము సుస్థిరమై నిలుచుట కనువగు పునాదులు వేయుటలో మన పూర్వులు ప్రయోగించిన యోగ్యతాప్రమాణములు బహు దూరదృష్టితో నిశ్చయింపబడి యుండెననుటకు, ఈ నాగరికతలు అవిచ్ఛిన్నముగ సాగివచ్చుటే ప్రబల దృష్టాంతము. వారివలెనే శాశ్వతములును అహింసాపరములు నగు ప్రమాణ సత్వముల ననుసరించి, మనమును పునర్నిర్మాణమును సాగింపనెంతుమేని, మన మనుసరించు ప్రమాణములు సయితము పరోపకారపరములును, ప్రయోజనకరములునై యుండవలయునేగాని, తాత్కాలికపు టవసరములమాత్రము తీర్చునవిగ నుండిన చాలదు. ముఖ్యముగా ప్రస్తుత పరిస్థితులలో మన రాజకీయసంస్థలు తారుమారైపోనున్న సందర్భమున, భావిభాగ్యో

దయముకొఱకై ప్రణాళికల రచించుటలో ఆలోచనానిమగ్నులమై యున్న ఈ సమయమునందు మనము కడుంగడు జాగరూకతతో మెలగవలసియున్నాము.

దురదృష్టవశాత్తు ఆధునిక యుగమున, ప్రపంచ నాటకరంగ మందు ప్రముఖ పాత్రధారులై నిలుచుచున్న వర్గనాయకులు ధనరూప ప్రమాణములనే కేవలముగ అవలంబింపకున్నను, చాలవఱకు వానినే అవలంబించుచున్నారు. ఈ ప్రమాణావలంబనముయొక్క ప్రభావమునకును, పర్యవసానమునకును నిలకడయనునది గోచరించుటలేదు. ఏయెడ చూచినను "ఉన్నతజీవన ప్రమాణములు", "జాతీయ వార్షికాదాయాభివృద్ధి", "వస్తూత్పాదన శక్తిసామర్థ్యముల విస్తృతి", "ఆధునిక ప్రపంచ ప్రస్పర్ధలో లాభసముపార్జనము" అను నినాదములును, మఱియు నింక నిట్టి ప్రగల్భ ప్రకటనములును ఎన్నెన్నియో చెవులందు గింగురుమనుచు వినవచ్చుచుండును. ఈ కాలపు ఆర్థిక సిద్ధాంతము లాభములు, ధరలు, కొనుగోలుశక్తి, విదేశ వాణిజ్యమునను ఊబినేలలమీద నిర్మాణమగుచున్నది. తదితర జీవవర్గములనుండి మానవజాతిని వేఱుజేసి, దాని విశిష్టగౌరవమును ప్రకటించు గంభీరజీవన ప్రయోజనముల ప్రస్తావనయే శూన్యము. లీలగ ఏకొలదిగనో చూపట్టినను, మానవప్రయోజనములయొక్క అనగా ఆధ్యాత్మిక ప్రయోజనములయొక్క ప్రసక్తిని అల్పమనుచు తృణీకరించివేయు మహానర్థకరమగు వైఖరి బయలుదేఱుచున్నది. కాబట్టి అత్యంతము జాగ్రత్తతో మెలంగవలసిన యవసర మేర్పడినది.

మనకు పరంపరాదత్తమై వచ్చుచున్న కొన్ని సంపదలకు విలువలు కట్టుటలో ప్రయోగింపబడునట్టి నూతన ప్రమాణపద్ధతులను

కొన్నింటిని పరిశీలించి చూచునెడల, వాని వైఖరియు నీ నవ్య నూతన పద్ధతు లనబడునవి యెంతవిపరీతమై యున్నవో తెల్లము కాగలదు.

చేతితో రంగువేసిన అపురూపసౌందర్యముగల చైనా గిన్నె నొకదానిని పరీక్షించునెడల, కుమ్మరిపనుల తనిఖీచేయు డైరెక్టరు "అయ్యో! యీగిన్నె నొకదానిని చేయుటకు ఎంతసమయము వ్యయమైపోయెనో గదా! ఇట్టివానిని వేయిజతల నొక్క నెలదినము లలో నేను సిద్ధముచేసి పెట్టగల్లనే" అని వింతపడును.

అజంతాగుహాలకు పోయి అనేక దశాబ్దులో శతాబ్దులో కష్టపడి నిర్మించినట్టియు, విశ్వవిఖ్యాతి గన్నట్టియు పద్మాలంకార చిత్రము లను, బొమ్మలను గాంచి, "కొలది వారములలోపల ఆ యద్భుత చిత్రరచనల బోలు ప్రతులను వేలకొలదిగా తయారుచేసి ఈయగల వ"ని నవీనప్రవీణవర్ణచిత్రకారు డత్యంత సాహసముతో పలుకగలడు.

షాలిమారు తోటలక్రింద నెన్నియో యకరముల సారవంతమగు భూమి వ్యర్థముచేయబడుచుండె ననుచు నూనెగింజల వ్యాపారము చేయు వర్తకుడు వాపోవును. మఱియు, "అయ్యో! ఈభూమి నంతను వ్యవసాయమునకై వినియోగించినయెడల ప్రతి సంవత్సరము వేల కొలది మణుగుల వేరుసెనగ పండుచుండునుగదా" యని వేరొకడు ఉస్సు రనును.

వివిధ వేదాంత దర్శనముల యుద్బోధమున కాధారములై వేర్వేరు సనాతన సంస్కృతుల నిర్మాణమునకు మూలాధారములైన, ప్రాచీన వ్రాతగ్రంథములు తాళపత్రములపైని, గంటములతో లిఖింపబడియుండుటం గాంచి, నేటి గ్రంథప్రకాశక కుశలుడు వెల మాలిన యాయాకాలం గూర్చి జాలిచెందినవాడై, ఒక్కొక్క సంపు

టము స్వదేశీ మహాశయుల [illegible]ప్పుడు నిర్ణయించుట కనువగునట్లు చక్కని 'బాండు' కాగితముపైని ముద్రించుటకగు ఖర్చుల యంచనాలను తయారుచేయ గలంగును.

ఆగ్రా నగరమున సమాధుల నిర్మించుటకై వాడబడిన [illegible] చలువరాతి పలకలను చూచి, 'ఇరాని' వసతిగృహాలకు తేనీటిబల్లల సరఫరా చేయు వ్యాపారస్థుడు ఆ చలువరాళ్ళవంటి అమూల్య ద్రవ్యములను వ్యర్థము చేసినందుకు తీవ్రముగు నింద సేయును. తాజ మహలును నిర్మించుటకు నుపయోగించిన టన్నులకొలది శిలాఫలకముల నూడబెరికి సద్వినియోగము చేయునెడల నవి యెన్ని వేల మేజాబల్లలకు సరిపోవునో అంచనాలు వేయుచు వెంటనే తన గణితము సాగించును.

న్యూయార్కు మహానగరమునుండి సిమెంటు శిల్పాగ్రేసరు డొకడు వచ్చి మన ఎల్లోరాగుహల గాంచుచో, ఆకొండలో మూడంతస్తులు గల దేవళమును తొలిచి, చిత్ర విచిత్ర విగ్రహములతో శోభిలు స్తంభముల నందమర్చి వాని నన్నిటిని నంత నైపుణ్యముతో తొలుచుటకై విలువగల కాలము నెంతగా వృథా చేసియుండిరో గదా యని నిట్టూర్చుట నిశ్చయము. ఆప్రాచీనశిల్పులు యెన్నలేని తమ ఘనతర శిల్పరచనలకు సరిపడు శిలల నేర్చుకొనుటలో జూపిన వారి భూ తత్వశాస్త్ర పాండిత్యము నభినందింప నొల్లడు, వారి నిర్మాణకౌశలమున ద్యోతకమగు సాంద్రనిష్ఠను మెచ్చుకొనుట వానికి హితవుగ నుండదు. ఈ ప్రాకృత దేవమందిరములను కఠినరాతిలో చెక్క వ్యయముచేసిన కాలములో నత్యంత స్వల్పాంశమే చాలునే, న్యూయార్కు నగరమునం దరువది యంతస్థులకు మించి ఆకాశము నంటునటుల నొకదానిపై నొకటిగా పేర్చిన

క్రీస్తుశక సహస్రాబ్దాల పూర్వపు మహాపురుషులు కొండల నిర్మాణమునకై అంచనాలు వేసి గర్వముతో మురిసిపోవును. ఈ ఎల్లోరాలోని కైలాసమందిరము ప్రతిరూపము నొకదానిని, ఆ ప్రాచీన నిర్మాణము నుండియే ప్లాస్టరుతో నొక అచ్చును తయారుచేసి, ఆ అచ్చు యొక్క ఆధారముతో మూడు నెలలలో కొలదిపాటి ఖర్చుతో, యినుపచువ్వలను కూర్పుతో, సిమెంటుతో పొదిగిన కంకరరాళ్ళతో అంతకన్న గట్టిగా నిర్మాణముచేసి చూపగలననియు నతడు నొక్కి వక్కాణింపనగును.

పందెపుగుఱ్ఱాల వర్తకుడొకడు సేవాగ్రామమునకు బోయెనేని, గాంధీమహాత్ముని నోటిని పరిశోధించి (యూడిపోయిన) వాని దంతాల లెక్కించి, గాంధీజీయొక్క మూల్యమును నిర్ణయింపబూనిన వింత యుండదు. వయస్సుమీరి నిరుపయోగమైపోయినటుల నిశ్చయించి, వృద్ధపశుశాలలో బాపూజీకొక యుచితస్థానమును సిఫారసు చేసినను అబ్బురముండదు.

ఇదంతయు, స్వర్ణకారుడొకడు గులాబీపూతోటలో ప్రవేశించి, యందలి పుష్పములనుదీసి పటిపిడి రాతిమీద తన యలవాటునుబట్టి పెట్టిరుద్దుచు వాని నాణ్యమును తేల్చజూచునంతటి వెడగుచేష్టవంటిదేయిదంతయునని వేఱే చెప్పవలయునా ?

దేని యోగ్యతనైనను తేల్చు సందర్భమున, పై నుదాహరించిన వికృత విపరీతచర్యలు, ఒకరీతి అర్థికదృష్టిస్థానమున వేఱొకరీతిదగు అర్థికదృష్టిని ప్రయోగించుటవలన సంభవించునవియె! చూడుడు: ఆ పందెపుగుఱ్ఱాల వర్తకుడు 'పరాన్నపరిపోషణ' రకమునకు సంబంధించినవాడై యుండి, తా నలవాటు పడియున్న యేకైక ప్రమాణమును, 'సేవాపరిపోషణ' కు సంబంధించిన ధర్మసూత్రముల స్థానమునందు దుష్ప్రయోగముగావించి యున్నాడు.

పైన స్వప్రహరించిన యీ వస్తువుని విపరీతపర్చ అతిశయోక్తు లతో ప్రస్తావింపబడినట్లు తోచునుగాక! ఐనను నేటి వాస్తవిక జీవితమున అటువంటి మూల్యప్రమాణముతో చెల్లుబడి యగుచున్నవి. అదియు పామరులగు సామాన్య బేరగాండ్ర పరణిగాదు. ప్రపంచములో ప్రబల విఖ్యాతిగన్న సర్వకళాశాలలనుండి ఆవిర్భవించి మహా మేధానిధులని ప్రఖ్యాతిగన్నవారి చరితయె. పరాన్నపరిపోషణము, స్త్రీయపరిపోషణము, సాహసపరిపోషణమునను మొదటి మూడురకములకు చెందిన ఆధునిక పారిశ్రమాధినాయకులను సమర్థింపబూని, తర్కవాదముల సాగించు సుప్రసిద్ధ సిద్ధాంతకర్తలకు మన సర్వకళాశాల లునికిపట్టులై వెలయుచుండుటలేదా?

ఏ సమస్యనైనను సరియే, "ఇది లాభకారియగునా" అనెడు నొఱపిడిరాతిపైననే, వీరి పరీక్షనుడీ! అతి స్వచ్ఛమగు నేతితో తన బిడ్డలకై యే తల్లియైనను తన యింటిలో స్వంతముగా హల్వా తయారుచేసినయెడల, "ఓయమ్మా! నీవు నేతిలో ఏమాత్రమో క్రొవ్వు కలితీచేయకుంటే, లోకములోని విక్రయవీథులలో నీవెందేని నెగ్గేదేలాగునమ్మా?" అనుచు డాక్టరు డంబాచారిగారు వచ్చి కడు దర్పముతో ఆ తల్లిని మందలించగలడు. మఱియు ఆ హల్వాను తయారుచేయుటలో వ్యయమగు కాలమునకు సరిపడు కొంతమూల్యమును చేర్చి లెక్కకట్టి, తన మిఠాయి ఖరీదును తేల్చుకోవలసియుండునని ఆతడా తల్లికి బుద్ధిగఱప బూనును. ఆ వస్తువుయొక్క ధర నిటుల పెంపుచేయుట, శాస్త్రప్రకారము చేసితీరవలసిన యత్యావసరకార్యమని నొక్కి చెప్పును. అటుల తేల్చబడిన శేరు హల్వా ధరను బజారులోని ధరతో పోల్చి చూచుకొనుటయు ఉచితమని ఆమెకు నచ్చునటుల బోధింపజూచును,

[illegible] యేమిటి

బాబు ? [illegible] ? ఈ సామ్యాను నా బిడ్డలు తినేందుకని నేను తయారు చేసికొంటిని. వారికి శుద్ధమైన మేలి మిఠాయి పెట్టుకోవాలి. కాని, బజారుధరలతో నాకు పనేమున్నది? శేరుధర ఎట్లా గిట్టుబాటవుతుందో శాస్త్రప్రకారము లెక్కగట్టుట నాకెందుకు ? నేను పనిచేసిన కాలానికి ధరకట్టుట యేమిటి ? నా కుటుంబక్షేమానికి నా జీవితమంతాకూడా సమర్పణ చేయబడిందే కావా !" అని అమాయకురాలగు ఆ తల్లి పలుకును. అది వినిన డాక్టరు డంబాచార్లుగారు ఆ పరమ మూఢురాలు, ఆ అక్షరపు ముక్కైనా నేర్వని యాడుది, ఆర్థికశాస్త్రముయొక్క ఓనమాలైన కాని శుద్ధ మూర్ఖ వనిత చూపిన తెలివిలేమికి వెరగుపడగలడు. కాని గృహనిర్వహణమునందు సేవాపరిపోషణధర్మము పరివ్యాప్తమై యుండును. ఆ ధర్మముయొక్క మూర్తియేయై యొప్పు తల్లి, తదనుసరణముగానే తన చర్యల నన్నిటిని పరిశీలించుకొనుచుండును. ఇక మన డాక్టరు పండితుడో, స్వీయపరిపోషణ పద్ధతులను, సేవాపరిపోషణ ధర్మముల స్థానమున వర్తింపజేయ జూచుచున్నాడు. అత డలవాటుపడిన తీరులవి ! అతడు పని నేర్చిన ప్రయోగశాల లట్టివి ! తద్వ్యతిరేక విషయములకందు సూచనకైనను తావుండదు. పరిసర విశేషములు సరకుగొనకుండ, ఒకే సూత్రము ననుసరించి అతడు విచారణ సాగించును. అట్టి మార్గానుసరణము మానసికమగు గరడీసాధనగా నెంత యుపయోగకారియైనను, విశాలవాస్తవిక ప్రపంచమునుగూర్చి తీర్పులు చెప్పు నర్హత దానివలన చేకూరజాలదు; అటుల ప్రపంచమునందు సరళపఱచబడిన కల్పితపరిస్థితులు సమకూరుట అసంభవము.

ఏలోటును లేకుండ, అత్యంత శ్రద్ధతో, సర్వాంగ సమగ్రముగా అమర్చబడి యున్న ప్రయోగశాలలో పనిచేయు పదార్థ విజ్ఞాన

శాస్త్రవేత్త, శక్తి ధర్మసూత్రముల నెన్నెని పరిశోధించును. చిన్న
చిన్న కాగితపుముక్కలు సయితము, సభువగులోహ ఖండముల
వలెనే, ఒకేగమన సూత్రానుగుణ్యముగా, రెప్పపాటుకాలములో
32 అడుగుల వంతున, ఎత్తునుండి నేలకురాలునని నిర్ణయించును.
ఆ మాట ఒప్పిదముకాదని, యేబదియేండ్లవాడైనను ధిక్కరించి
పలుకజాలును! "ఏమయ్యా, ముసలాయనా! నేనుగులకరాళ్ళతో
ఆడుకొనునప్పుడు, వానినిమాయూరి నూతిలోవడవేయుచు అనేక
పర్యాయములు కనుపెట్టినాను. కాగితపుముక్కలు గూడ ఆ నూతి
లోనికి వేసిచూచినాను. గులకరాళ్ళు సరాసరి నూతిలోబడి నీటిలో
బుడుంగున మునిగిపోయేవి. కాగితపు ముక్కలో గాలిలో నెమ్మదిగ
నెగురుచుపోయి, ఒక్కొకప్పుడు బావివెలుపలికే యెగిరివచ్చేవి. నేను
ఎగురవేయు కాగితపు పతంగాలు,ఆకాశానికెగిరెగిరి, మనకు కానరా
నంత చిన్నచుక్కలైపోవునే! సీసపు పతంగాలనుచేసి అలాసీవు ఎగుర
వేయుము చూతాము" అని హేళన సాగించును. ప్రత్యేకముగ
కల్పిత పరిస్థితులలో, గాలితీసివేసిన గాజు గొట్టాలతో, పరిశోధనలు
సలిపిన ఆశక్తిశాస్త్రవేత్త చెప్పునది వాస్తవమే. సందేహము లేదు.
ఐనను ఆ నిష్కపట హృదయుడగు బాలుని పలుకులును బాహ్యము
నందు సంకీర్ణ పరిస్థితులతోడనొప్పుప్రపంచమున సత్యములేయ
గును. ఇట్లు ఏసమస్యను విచారింప బూనినను వందలకొలది అను
షంగికాంశము లెన్నియో వచ్చి జొఱబడుచుండును. దేనిప్రయోజ
నము నేని నిర్ధారణ చేయవలయునన్నను, అందుకు సంబంధించిన
సూక్ష్మాంశముల నన్నింటిని విచారించినగాని నిర్ణయించుటకు
వీలు పడదు. ప్రస్ఫుటములు గాని స్వల్పాంశములే ప్రాధాన్యత
వహించి తఱచు ఎదురైనిలుచుచుండును. డబ్బువిలువవంటి సర్వసా

మాన్యమగు అంశములే, పరిస్థితులు మారినచో, ప్రస్తావన లోనికి దీసికొనుటకు అర్హములు గానివై పోవుచుండును.

గిరాకీ సరఫరాలను నిర్ణయించునది 'గిట్టుబాటు' అనెడు త్రాసు అని అర్థశాస్త్ర నిపుణుడు వక్కాణించును. 'వస్తువునవసరమైన కాలమది. దానికిగిరాకీహెచ్చి, చాలమంది కావలయునని చాలమంది కోరుదురు'నుచునేమేమో చెప్పగలడు. సర్వేసర్వత్రా యిది యథార్థమగునా? ఈవిశాల ప్రపంచములో ఆర్థికపండితునకు తావు లేదు. చీరెను కొనబోయిన యువతి 'చౌకచీరెయిమ్మ'ని యడిగి కొనదు. రంగుల పొందిక, అందచందములు, మొదలగు భావములెన్నియో ఆమెదృష్టిలోనుండును. అభావములను తృప్తిపరచగల చీరనే ఆమె కొనుక్కొనును. అదేతీరుగ ఒకరాకొమరుడు తనమెడముడి మాదిరి మెడముడిని (Necktie) మరెవండును ధరింపరాదను తలంపుతో, అంగడిలో చూపట్టువానిలో తనకునచ్చిన యొకానొక రకపు మెడముడులనన్నింటిని నిశ్శేషముగా కొనివేయును. ఇట్లె ఒకానొక కిరోసిన్ నూనె కంపెనివాడు బజారునకు రాదగిన అన్నిగింజల నూనెతో వెలుగగల లాంతరులను, వానినిచేయు అనన్యాధికార పత్రమును (Monopoly) లక్షలాది ధనమునొసగి కొనివేయును. తానా లాంతరును ఉపయోగించుకొనకుండనే ఒకమూల దాచిపెట్ట గలడు. ఎందులకు? అట్టి లాంతరుల అమ్మకమువలన తన కిరోసిన్ నూనె గిరాకీకి దెబ్బతగులును గనుక! ఈ తీరుగా ఆర్థికప్రమాణములని మనము చెప్పుకొను ధర్మసూత్రములకు తారుమారు చేసివేయు విషయము లెన్నియో సంఘటిలుచుండును. కావున ఆశాస్త్ర ప్రమాణములు అప్రతిహతములుగ చెల్లునని నిర్భయముగా చాట లేముగదా!

ఏ ప్రమాణమైనను ఒకానొక పరిస్థితి కనుకూలముగా నుండిన మాత్రాన చాలదు. సర్వేసర్వత్ర ఆర్థికసూత్రముల ననుష్ఠించిన తృప్తిపడు ప్రజాళి సకలపరిశోధనలకు తట్టుకొనగలదిగాను నుండవలయును. పాశ్చాత్యవేషధారణకు అభ్యాసపడిన యువకుడొకడు, గజము మూడు పావలాలకు, చౌకగా మిల్లుగుడ్డ దొరకుచున్నదిగదా యని, వాదించును. గజము రూపాయికి అమ్మి ఖాదీగుడ్డకొనుట డబ్బును దుబారా చేయుటయే యని నిర్ణయించును. సరే, యిటు చూడుము: ఖాదీ అభిమానియగు నొక పల్లెటూరివాడు స్వయముగా ప్రత్తిని పండించుకొనును; ఆప్రత్తిని తానే కోసికొనును; దానిని గిలకబట్టి గింజలు తీయును. తీరికగా తానే నూలు వడుకుకొనును. దాపున తన గ్రామములోనే కాపురముచేయు సాలెవానిచేత గుడ్డలు నేయించుకొనును. తన గుడ్డలను తానే యుతుకుకొనును; వానిని ధరించి ఎక్కడపట్టిన నక్కడ చతికిలబడి కూర్చుండును. వాని గ్రామపు ఆర్థికప్రమాణమున నదంతయు ననుకూలమే. వీనిని హేళనచేయు పట్టణవాసి మిల్లుగుడ్డను కొనును; తన అభిరుచి కనుకూలముగా కుట్టిపెట్టు దర్జీవానికి హెచ్చుగా కూలినిచ్చి దుస్తులను సిద్ధము చేయించుకొనును; ఆరితేరిన చాకలివానిచేత తనవస్త్రములను ఇస్త్రీ చేయించుచుండును. లేదా బోలెడు డబ్బుపెట్టి కొనుక్కొనిన వాని మిల్లుగుడ్డలు పాడైపోవును. మఱియు నతడు నిశ్చింతగా నెక్కడనైనను కూర్చుండజాలడు. తన వస్త్రధారణ కనుగుణ్యముగా కూర్చుండుటకు కుర్చీలను అమర్చుకొనును. వ్రాతపనులు చేసికొనుట కనువగు బల్లలను సమకూర్చుకొనును. ఇవన్నియు చేయక తప్పదు. వాని ఈ సంకీర్ణపు టలవాటులన్నియు హెచ్చుఖర్చుల చేటే! ఇప్పుడు చెప్పండి. ఇతర సాంఘికపు చిక్కుల నట్టె యుంచుడు. గజానికి ఏ రెండుమూడణాలో హెచ్చుధరపెట్టి కొనవ

ఖర్చు, తదనుసరణమగు జీవితపుటలవాటులను బట్టి చూడగా మొత్తముమీద హెచ్చువ్యయ కారణమగునని అనగలమా? అనుసరణముగా వేఱగు ఖర్చులను అవసరము లేకుండ చేయు ఒకానొక ఖర్చుపద్దుండును: అనుసరణముగా ఇతరములగు ఖర్చులను తప్పక అవసరము చేయు వేఱొక పద్దుండును. కేవలము ఈరెండు పద్దులను మాత్రము విచారణలోనికి దీసికొని, వానికి గల వ్యత్యాసమును తెల్పుట పొరబాటగును. ఒక రత్నముయొక్క విలువ, అది ప్రత్యేకముగా నున్నప్పటికంటె దానినొక నగలో పొదిగినప్పటి స్థితిలో చాల హెచ్చగును గదా! అటులనే ఒక్కొక్క తీరుపరిరక్షణ విధానమును పరిశీలించునప్పుడు, దాని ననుసరించి సంఘటనమగు విషయముల నన్నిటినికూడ విచారణలోనికి తీసికొనకతప్పదు.

ఇంతవరకును వస్తువినియోగదారుని పక్షము ననుసరించి, అనగా వస్తువును వాడుకొనువాని దృష్టి ననుసరించిమాత్రమే, వస్తుమూల్యమును నిర్ణయించు తీరును గమనించితిమి.

"ఈ యంత్రయుగములో, కుటీరపరిశ్రమలు బ్రతుకగలవా?" అనుచు శంకించువారిని తరచుగా చూచుచుందుము. ఈ సమస్య యొక్క సంపూర్ణ వివరణకు ముందు పూననుంటిమిగాన ఇచ్చట కొంతవఱకు ఆపియుంచెదము. "కుటీర పరిశ్రమల" సమస్య కేవలము వస్తునిర్మాణవిధాన సమస్యమాత్రమే యనుటకు వీలులేదు. అదొకరీతి పరిపోషణ విధానమునకు చిహ్నమును, ప్రధానాంశమునై యున్నది. అటులనే "భారీయెత్తు వస్తూత్పత్తి" ని మఱొకరీతి పరిపోషణకు చిహ్నమగును. ఇప్పుడు మనము విశదీకరింపవలసిన సమస్య ఇది: మనకు అనుకూలించు పరిపోషణవిధాన మేది? మన జీవిత లక్ష్యములపై నాధారపడి సాగింపదగిన తీరేది? ఇప్పుడు మన జీవిత ప్రయోజనప్రమాణము లెటువంటివో తెల్పుకొనవలయునను చే పర్యవ

సాధనము. కాబట్టి "అర్థశాస్త్రము" మనకు సత్యమును బోధించుటకు "మూల్యములు" "మూల్యనిర్ణయము" అనెడు రెండును రెండు గుర్తు లనవచ్చును. తుది పరిశీలనమునందు, శాశ్వతత్వము, అహింస అను వాని వైపునకా ? లేక తాత్కాలికము, హింస అనుదాని వైపు నకా మనపోకడ ?" యను విషయమును తేల్చునది ఈ ప్రశ్నయే. కాబట్టి ఈ రెండంశములను గురించిన మన నిర్ణయము అసందిగ్ధ ముగా తేలిపోవలయును. మన ప్రమాణములను గురించి గాని, మన లక్ష్యార్థమును గురించిగాని యేమాత్రము పొరబడినను వినాశము చేకురగలదు.

తిరువాన్కూరులో మొగలిఆకు చీలికలతో చక్కని మెత్తని చాపలను తయారు చేయుదురు. ఆప్రాంతమువారు విడివిడిగా ప్రత్యే కము స్వంతభూములలో కుటీరములు నిర్మించుకొని నివసింతురు. ఆ కుటీరములచుట్టు కొంత ఆవరణముండును. ఆ ఆవరణచుట్టును మొగలిచెట్లనువేసి పెంచుదురు. ఆప్రాంతమున నే సంచారము చేయు చుండిన సమయమున ఈచాపల నెట్లు సిద్ధము చేయుదురో చూడ బోతిమి. ఒక ముసల్మాను డాగ్రామములోని కెల్ల చాపల నల్లుటలో దిట్టయట. అతడు మాకడకు వచ్చి, స్త్రీలు, పురుషులు, పిల్లలు ఆ చాపలల్లుటలో నెటుల సహకరించుకొనుచు పనిచేయుదురో వివ రించి చెప్పసాగెను. దాపుననున్న నాలుగైదుయిండ్లకు మమ్మును దోడ్కొనిపోయి అక్కడ పనులుజేయువారిని జూపినాడు. అతడు మాతోడ నున్నంతకాలము, "అయ్యా, మా తండ్రులు మా తాతలు ఈవృత్తినే జేయుచుండెడివారు. వారు దారిద్ర్య మెరుగరు. ఆలా చూచుడు. అలాంటి రెండుమూడంతస్తుల మేడలను గట్టు కొనిరి. సుఖపడిరి. వారి సంతానమై ఆ వృత్తినే చేసేవారమగు మేమో ఆమేడలు కూలిపోవుచుండ వానికి మరమ్మతులు

చేసికొని నిలుపుకొనుచున్నాము." అని మమ్ముల నులుల ప్రశంసింప సాగినాడు. మేమక్కడ మాకు వలసినవెల్ల చూచితిమి. మధ్యాహ్న మైనది. తనయింట ఆతిథ్యము తీసికొనవలెనని ఆ పురుషుడు మమ్ము బ్రతిమాలసాగినాడు. నాతోడ యిరువురు బ్రాహ్మణమిత్రు లుండిరి. వారేమందురో యని యడిగితిని. అతడిచ్చు ఆహారము కేవలము శాకాహారమగుచో తమ కభ్యంతరము లేదనిరి. మావెంట వచ్చిన పురుషునితో ఆవిషయము చెప్పగా, తనకు మాంసాశనముమీద ప్రీతియే యైనను వాని దారిద్ర్యమువలన అది లభ్యమే కాదనియు, విధిగా శాకాహారిగా మారవలసినవా డయ్యెననియు తెలిపినాడు. మఱియు మా దర్శనము ఆకస్మికమైనదియు, ముందుగా తెలిసి యేర్పాటు చేయబడినది కాదుగావున, తమ కుటుంబమునకై వారేమి చేసికొనినారో దానిని మాత్రమే సమర్పించుకొందుననిఅతడు చెప్పెను. అతడు మాకు పెట్టగలది కొంచెము అన్నము, పప్పు, పచ్చళ్ళు మాత్రమేనని ముందుగా హెచ్చరించినాడు. ఆపాటి తిండిని మేము తన యింటికడ నారగించునెడల మహానందము పొందగలనన్నాడు. అతడట్లు బ్రతిమాలుటచూచి, అప్పుడు మాకంతగా ఆహారము అవసరము లేకున్నను, వాని కుటుంబము వా రెట్లు జీవింతురో స్వయముగ కనిపెట్టు కోరికతో వాని యాహ్వానమునకు సమ్మతించి వాని కుటీరమున కేగితిమి. మేము కాలుసేతులు కడుగుకొనుచుండగా, మేము భోజనమునకై కూర్చుండుటకుగాను వసారా నూడ్చి శుభ్రపఱచినాడు. అంతసేపును తమవృత్తి నాశమగుట కేమి హేతువని అతడడుగుచునే యుండెను. ఏమి సమాధానము చెప్పుటయో యని నా బుద్ధిలో, నాలో నేనాలోచించుచుంటిని. ఇంతలో "దయచేయుడు, వచ్చికూర్చుండుడ" ని అతడు మమ్ము పిలిచినాడు, అతిథులలో నన్ను ప్రధానునిగనెంచి, నాకు మధ్యస్థల

మును, నామిత్రులు కొందఱుకలసి నాకు ప్రత్యేకాసనములను వేసి నారు. ఇయిరువుర కొలిచిన మొగలిచాపల చాపలను వేసియు న్నారు. అగ్రగణ్యుడనగు నాకమర్చిన ఆసనమును చూడగానే, "మీ వృత్తి యెందుకు క్షీణగతికి వచ్చెనో నాకిప్పుడు తెలిసినది. మీరవ లంబించు గౌరవ ప్రమాణమునందే ఆ దోషమున్నది." అంటిని. ఆమాటలను విశదముగా తెలుపుమని అతడు పట్టుపట్టెను.

"నామిత్రులకై వేసిన ఆసనముల నెక్కడనుండి తెచ్చితి" వంటిని.

"అవి యీనాడీనుడు, స్వయముగా, ఈ చేతులతో అల్లిన మచ్చు చాపలే" అన్నారు.

"నాకొఱకై పఱచిన యిదెక్కడిది? దీనిపైన పెద్దపులిబొమ్మ ముద్రించియున్నది!" అంటిని.

"అది జపాను చాపండి; బజారులో కొన్నాను." అని పలికి నాడు. అంత నేనిట్టుల వివరించిచెప్పితిని. "ఈ అతిథులలో నన్ను ప్రధానునిగ నెంచి నన్ను జపాను చాపమీద కూర్చుండ బెట్టుటతో హెచ్చుగ గౌరవింపజూచితివి. నాయిరువురు మిత్రులను నీచేతితో నల్లిన చాపలమీద కూర్చుండుమంటివి. అందువలన నీవు నీచేతితో తయారు చేసిన చాపకంటె జపానుచాపను హెచ్చువిలువ గల దానినిగా గణనచేసితివి. నీవే యిట్టుల చేయుచు, అదేతీరుగా యితరులు చేయుదురని మొఱలిడుదువేల? ఇతరులనేకులు నీపద్ధతినే అవలం బించి, విలాతివస్తువులను కొనుచున్నారు. స్థానికముగా మీరు తయారు చేసిన మొగలిచాపలను కొనుట మానుచున్నారు. పూర్వము మీదగ్గఱ చాపలను గొనుచుండినవారి బేరము అంత రించినది. ఇకమీవృత్తివృద్ధిలో నెట్లుండగలదు? మీవృత్తిని నాశము చేయుటలో ముఖ్యముగా మీదోషముకాదా?

చేతులు రెండును జోడించి, అతడునాతర్కము నంగీకరించినాడు. వెంటనే అజపానుచాపను తొలగించివేసి, తానుసిద్ధము చేసినచాపను తెచ్చి పఱచినాడు.

మనదేశమందెల్లెడల నేమిజరుగుచున్నదో తెలుపుబొమ్మ యిది. వస్తువులనాణ్యమును నిర్ణయించు పట్లమనము వినియోగించు ప్రమాణములందు వివేకము శూన్యమగుచున్నది. మనము వస్తువుల కొనుగోనుటలో దీర్ఘదృష్టిని పోనాడుకొని, మనఆర్థిక సాంఘిక సంస్థలను విచ్ఛిన్నముచేసి నేలగూల్చుచున్నాము. తఱచుగా డబ్బుధరలో చౌకగాదొరకుననుదృష్టిలోపడి పోవుచున్నాము. కాని డబ్బుధరలో చూపట్టని మూల్యములు, నాణ్యములు, ఎన్నియో మనయెరుగు పొరుగువారిచే తయారుచేయబడు సరకునందు లయించి యుండును. మనము పాటింపదగిన విషయము లన్నిటిలో, అనేక సందర్భము లందు, డబ్బుధర కనిష్టమైనదిసుడీ ! కాని దురదృష్టవశమున మనము చేయు నిర్ణయములలో అట్టి డబ్బుధరనే ప్రధానముగా చూచుచున్నాము. కేవలము డబ్బును పాటించుట, మనసాంఘికవ్యవస్థను భగ్నము చేయుటకు మూలమగుచున్నది. ఎల్లెడల వినాశమును చేకూర్చి, సర్వత్ర ముప్పువాటిల చేయుచున్నది. డబ్బు విలువ, సంఘక్షేమమును చూడనీక మనదూరదృష్టిని మూసిపెట్టుచున్నది. గొడ్డలి చేబూని తానాధారముగ గొని నిలుచున్న కొమ్మను తానె నఱుకుకొను మూర్ఖుని చేష్టను బోలుచున్న దీపని. తనపతనమునకును, తననాశనమునకును హేతుభూతమగు కార్యములనతడు బలపఱచినవాడగుచున్నాడు. నిరాఘాటముగసాగు దీర్ఘకాల ప్రణాళిక, శాశ్వత పరిపోషణను ధృవపఱచును; ఏసమస్యయొక్కయేని సద్యస్కాల పరిష్కారమునేగాక, దాని ననుసరించి దీర్ఘకాలమునకు చేకూరు స్థిరతరఫలితార్థములను సయితము ధృఢపఱచును. ఏ

ప్రత్యేక వ్యక్తిత్వము — మోసగ్రస్తమైనను, ప్రత్యేకముగ [illegible] క
వ్యవహారములతో మునిగిపోయారము. ఆనుషంగికముగ ఘటిల్లనున్న
ప్రతిఫల పరంపరను కనిపెట్టజాలు దృష్టి మనలో పెక్కండ్రకు కొఱ
వడిపోయియున్నది. మనకు లభించిన శిక్షణము శూన్యముగ నున్నది. ఈ
లోపముయొక్క ప్రతిఘాతము, లేక ప్రతీకారము. సమాజమునంత
టికిని సంక్రమించు చున్నది. ఒకానొక సహకారసంఘపు కార్యదర్శి
తమ సంఘసభ్యులు సిద్ధముచేసిన తేనెను అమ్మిపెట్టు వ్యాపారము
వలన, ఆసంఘసభ్యులకు చేకూరుచున్న లాభములను చెప్పుచు
సాగెను, ఆయన నన్ను తోడ్కొనిపోయి ప్రాతమట్టి కుండలతో
తయారు చేసిన అతిసరళముగా గోచరించు, తేనెపట్టులను, వాని
యందలి ముప్పదితేనెటీగ సముదాయములను, వానిని పెంచు ఆ
రామవిశేషములను, చూపియున్నాడు. ఆ మధుపములు చాల చురు
కైనవిగ గోచరించినవి. ఆరామాధిపతి వందలకొలది పౌనుల తేనెను
అమ్మకమునకై ఆ సహకారసంఘమునకు పంపుచుండును. ఈ కార్య
క్రమకథ నంతటిని ఆలకించి చాల అబ్బురపడితిని. మంచిసంపాదనమే
చేకూరుచుండెగదా యని మెచ్చుకొనుచుంటిని. ఆ తరుణమున ఒక
బాలిక, ఆరామాధికారి కూతురు, పరువులుపెట్టుచు వచ్చినది. ఆ
యీగగములన్నియు అంత చురుకుగాపనిచేసి నిర్వహించు కార్య
మేమిటని నేనామెనడిగితిని. అవి తేనెను తయారుచేయు చున్నవని
చెప్పినదా బాలిక. "నీకు తేనెత్రాగుట ఇష్టమేనా?" అని ప్రశ్నించి
తిని. ఆమె తెల్లమొగము వేసినది. ఆమెకు నాప్రశ్న అర్థము
కాలేదని తలంచి, ఇంకొక విధముగా "నీకు తేనెరుచి గిట్టదా?"
అంటిని. ఆ బాలిక "దానిరుచి యెట్లుండునో నే నెఱుగను" అనుట
విని వెఱగుపడిపోతిని. అంతట ఆరామాధిపతి వైపు తిరిగి అతడు తన
బిడ్డలను తేన త్రాగనీయడాయని విచారించితిని. తాను కడు నిరా

పేక్షచేయవలెను కదా యని చెప్పుచున్నట్లుండెను, “సంఘమునకే నేను నేను సంపన్నుడనైనచో నాకు రోజూ పాలు వచ్చును. అట్లైనచో మా యింటిలో తేనె నుపయోగించుట కొనగలమని అనుకొంటిని. నా మెచ్చుకోలంతయు నిమిషములో ఎగిరిపోయినది. అంతట సహకారసంఘ కార్యదర్శితో ‘ఆబిడ్డకు తేనెరుచియే తెలియబడినప్పుడు, మీ కార్యనిర్వహణ మంతయు దోషభూయిష్టమైపోయినది. హెచ్చుధర ఇచ్చి, ప్రలోభపెట్టి, కటా! ఈ బిడ్డ నోటికిరానుండి తేనె నపహరించివేసి, నానా రుచులతో గూడిన తిండ్లను అధికముగ మెక్కు డబ్బు దొరలకొరకై పంపుచుంటిరా?” అంటిని.

సర్వత్ర ఇట్లే జరుగుచున్నది. గ్రుడ్లు, పాలు తదితరములగు పుష్టికర ఆహారపదార్థముల సందర్భమునను జరిగినది దిదియే. పూర్వము గ్రుడ్లు విరివిగా దొరకుచు, స్థానికముగ హెచ్చుగా నుపయోగపడుచుండిన వాయవ్యరాష్ట్రమందు రావల్పిండి, క్వెట్టా, అంబాలాల మిలిటరీ అధికారులు ఈవస్తువుల సరఫరానంతను ఆకర్షించివేయసాగిరి. కావున స్థానిక ప్రజలీ పదార్థముల వినియోగించుట చాల తగ్గిపోయినది.

గ్రామములలో విరివిగా పాలుకొలవును ఐననేమి అచ్చటి బిడ్డల కీపుష్టికరాహారము కఱవే! అదంతయు పట్టణములకు రవాణా చేయబడి, అక్కడ అమ్ముడు బోవుచున్నది.

ఉన్నత భావసరణిని హెచ్చుగ మెచ్చుకొనగల సహజబుద్ధిని, డబ్బువిలువ వచ్చిపడి వమ్ముజేసివేసినది. అందువలన ఒకపక్షము వారికి లాభమును వేఱొకపక్షము వారికి అనివార్యముగ నష్టము చేకూరును. (లోగడ అధ్యాయమునందు, జిలేబీలబాలకుని కథనము నందువలె) అధికమై మిగులు ద్రవ్యములతోడి వ్యాపారమునకు మారుగా ప్రాణావసరములగు వస్తువుల అధికవ్యయమునకే తోడ్ప

దును. తాత్కాలికముగా సిద్ధపడకున్నను, గొప్ప సాంఘికోప
ద్రవమునకు మూలమగును. 1943 సంవత్సరమునాటి బెంగాలు క్షామ
మునకు మూలము డబ్బుసంబంధమైన తిరుగుడే! వెండి లేక ఫాక్కలు
ఉపాసించుచున్న ప్రజల నోటికడనుండి ప్రాణాధార ద్రవ్యములను పడ
లాగివేసినది అదియే. లండనులో (వ్యాపారమున వినియోగపడక)
బిగిసిపోయి పడియుండి ధనరూపప్రతిష్ఠకు చిహ్నమాత్రమైన పనికి
మాలిన కాగితపునోట్లను గుట్టుగ మనమొగాన పడవేసినారు. కాని
లాభమేమి? ఆ మహోపద్రవమునుగూర్చి గాఢముగ విచారణ
చేసి, అందుండి నేర్చుకోదగిన నీతిని గ్రహింతుము గాక. వస్తుమూల్య
మునకు డబ్బును ప్రమాణముగా దీసికొనుటకంటె, నరజీవితములో
ప్రాణతుల్యములగు విషయము లెన్నియో యితరమగునవి కలవని
జ్ఞప్తి నుంచుకొందుముగాక.

# అధ్యాయము 10.

## జీవము, జీవనము, ఉనికి.

బ్రతుకున కేమేని ప్రాధాన్యత గలదా? దాని కేమైన అర్థమున్నదా? దాని ప్రధానాంశము లేవి?— లేక కేవలము ఉనికి యేనా బ్రతుకంటే?

మానవునకు స్వేచ్ఛ (స్వతంత్రేచ్ఛ) యుండుటనుబట్టి, యతడు తక్కిన జంతుకోటికన్న భిన్నమైనవాడని గ్రహించియుంటిమి. కాబట్టి నరుడు పాటించు మూల్యముల ప్రమాణమునకు చిహ్నమగు 'ఇచ్ఛను' అతడు వినియోగించుకొను విధము ననుసరించి, అతడెటువంటివాడో వెల్లడియగుచుండును. ఇట్లు విచారించునెడల, మానవుడు తానెట్టివాడుగా సంకల్పించికొనునో అట్టివాడై పోగలడు; మానవుడు తన జీవనపద్ధతి ననుసరించి తనలోని శక్తులను ప్రకటింపగలడు; దాని ఫలితార్థమే వాని వ్యక్తిత్వము" అందుము. మానవుడు పరిణతి పొందుటకు, వాని జీవనమొక సాధనము. వాని కల్పనా సామర్థ్యము ద్వారమున తానెట్టివాడో ప్రకటించుకొనుట కవకాశ మిచ్చునది వాని జీవితమే. కావుననే జనులెటుల జీవింతురో లేక జీవింపవలయునో అనువిషయమున కంత ప్రాధాన్యత గల్గుచున్నది.

ఇక జీవనమనగా (పటమును చిత్రించుట కుపయోగపడు) వస్త్రమనవచ్చును. చిత్రకారుడగు మనుజుడు, తన వివిధప్రయోజనములనెడు రంగుభరిణలతో, స్వేచ్ఛయనెడు కుంచెయొక్క సునిశ్చితములగు వ్రాతలతో, సువిదితమగు తన జీవితచిత్రమును రచించుకొనును. మానవాభ్యుదయమును ముందుకు నెట్టుటకుగాని, వెనుకకు లాగుటకుగాని, తన యనంతరమును వినియోగపడునటుల దాని నతడు విడిచిపోగల్గును. కాలగతి ననుసరించి మసకబారిపోగల్గునట్టి

గాని, లేక నుసిచివేయబడుటగాని, స్వార్థప్రయోజనము ఆశించి
నీటిరంగులను హెచ్చుగ కలిపి, రచన సాగించునెడల, వాని చిత్ర
రచన శాశ్వతమై వెలయగల హెచ్చునాణ్యమును సందుకొనలేక
పోవును; మరియు హింసకు పాల్పడి వికారరూపము నొందును.
అటులగాక, అజంతాగుహాలందువలె, శతాబ్దులు గడచిపోయినను,
సిస్సగోల్లోవని మట్టిరంగులబొమ్మలు లోకోపకారకములు, లేక సార్థ
కములునగు ప్రయోజనములను హెచ్చుగ వినియోగించునెడల,
శాశ్వతత్వమును అహింసను చాటు సందేశముతో తన యసమాన
దివ్యరచనను, తరతరములవారికి సురక్షితముగ సంక్రమింపచేసిన
వాడగును.

మానవునకు అట్టి అవకాశమును, బాధ్యతయు నుండుటంబట్టి
అతడు తన జీవితమును ఇతరులచేతిలో అధీనుడై విడిచివేయ దగదు.
ప్రతి మానవుని మీదను వాని జీవితవైఖరింగూర్చిన బాధ్యతగలదు.
అతడు తన శ్రేష్ఠతమ చిత్రరచనను, చట్టము మొదలగునవన్నియు
తగిలించి సిద్ధముగా పనివారలచేత బజారులో అమ్మకమునకు పెట్టబడు
చౌకరకపు రంగుబొమ్మలకు బదులుగా నిచ్చివేయజాలడు.

ఈనాడు, అధికోత్పత్తిచేయు పరిశ్రమల విశిష్టప్రమాణ బద్ధమైన
సరకులు మనుజులెటుల జీవించవలయునో దాదాపుగ తామేనిర్ణ
యము చేసివేయుచున్నవి. తమకు సరఫరాకావలసిన మాదిరి సరకుల
తీరును వినియోగదారులు నిర్ణయించుటలేదు. అందుకు మారుగా,
ఉత్పత్తిదారులు తాముచేసిన సరకునంతను విచక్షణాశూన్యులగు
ప్రజలమీద పడవేయుచున్నారు. కాన మనము మెలకువతో వివే
కముగలిగి వర్తింప వలసియున్నది.

ఈ తరము వారినెత్తిన బడవేయబడిన ప్రపంచ సంగ్రామములు
రెండును; ఆధునికసంస్థలయొక్కయు, వ్యవస్థలయొక్కయు వినాశ

తరమై జనమునకు ప్రబల విజృంభణము లభించినది. స్వభావముచేతనే స్వార్థ
తమును, నిర్మాణసమర్థమునై వెలయవలసిన విజ్ఞానశాస్త్రము సము
తము కడుహేయముగు నిర్మూలన యంత్రముగ, నింద్యతర ప్రయో
జనములకే వినియోగింపబడుచున్నది. శాశ్వతాహింసాశైలముపై
స్థిరులై నిలుచుటకు మారుగా, మహామేధావులగు శాస్త్రవేత్తలును
మానవాభ్యుదయము, ఉత్తమ సంస్కృతియనెడు సుక్షేత్రములమీద
వరదలై పారుచు కొట్టుకొనిపోవు మృత్యువినాశములనెడు జలప్రవా
హము లోని సుడిగుండములందు చిక్కుకొనుచున్నారు. అట్లయ్యును
వారు నిర్విచారముగా, మేముదాసీనులమై వర్తించుచున్నామని
వాకొందురు. అదివట్టి ఆత్మవంచన. ఉదాసీనతయనునది యే యొకను
నుండజాలదు. మనము నిర్మాణాభిముఖముగనైనను నడువవలయును.
లేదా నిర్మూలనాభిముఖముగనైనను నడువవలయును. నేటి
శాస్త్ర పరిశోధకులో, ఐచ్ఛికముగా నిర్మూలనపథము నవలంబించి
యున్నారు. కావుననే అంతటి బహుళవినాశము ఘటిల్లనైనది.

దాని వలన మూడిన భౌతికవినాశము చాలగొప్పదే; కాని
సంగ్రామముల వలని ఘోరానర్థములలో నది అత్యంతము అల్పాం
శమే. అన్నింటను మిక్కిలి శోచనీయాంశమేదన, భవిష్యదభ్యు
దయమున కాధార భూతులగు యువక జనప్రాణములు పునరలభ్య
ముగ నశించెగదా! పులియొకటి మహావిజ్ఞానశాస్త్రజ్ఞుని చంపెనను
కొనుడు. అప్పుడుదానికి దొరకినలాభమును, మానవాళికి వాటిలిన
నష్టమును పోల్చిచూడుడు. ఆ నరాశనికి లభించినది బహుశః నూట
యిరువది పౌనులుతూగు మాంసము,రక్తము ఎముకలునే, పుష్టిరూప
మున శాకాహారమువలన కూడ సమమగు మూల్యమును సమకూర్చి
పెట్టవచ్చును; కాని, పులిజీర్ణకోశము అందుకు అనుకూలించునదిగా
నుండదు. ఇకమానవ సమాజమునకు ఘటిల్లిన నష్టమో, ఇంత

మాంసము, ఇంతరక్తము మాత్రమే అనలేము. ఆమానవజన్మ చిరత్ర భిన్నదశలందు వికాసము పొందుచు వచ్చిన, అనేక తరతరాంతరముల సంస్కృతికి ఫలితార్థమగు నుత్తమ విజ్ఞానరాశి. ఈవిజ్ఞాన రాశి ఆ పులికి ప్రయోజనకారి కాదు; మానవకోటికో, పునరలభ్యమైన ఘననిధి. పరమోత్తమమును, అగణితమునై, శాశ్వతాభ్యుదయకరమునై విలసిల్లు నంశము ప్రాణ్నజీవియగు పులివలన భగ్నమైనది: పులికి చేకూరిన లాభమా, క్షణభంగురమైనదే. చిరతర పారంపర్యక్రమలబ్ధమైవచ్చి, భావిని వంశపారంపర్యముగ సార్వకాలము వర్ధిలగల విజ్ఞాననిధి విధ్వంసమైపోవ, ఆ నష్టమువలన కొలదిపాటి రక్తము కొలదిపాటి మాంసము పులియొక్క ఆకలిని కొలది గంటలసేపు మాత్రముపశమింప చేయగల్గినది. అంతే. ఆ శాస్త్రజ్ఞుని యుత్కృష్ట జీవనము, విజ్ఞాన ప్రదమై నిర్మాణసమర్థమై, ప్రేమమయమై వెలయుగలది, ఆఘాతుకమృగమునకును సమముగ ప్రయోజనకారి కాలేదుగదా!

అదేతీరున, ఈ యుద్ధములో బలియైన కోట్లాది మానవుల విధ్వంసనమువలని నష్టమును, మానవోద్యోగరూపమున నింత తరిగెనని లెక్క వేయజాలము. అటువంటి సర్వవినాశంకర కార్యములవలన, మానవాభ్యుదయ సంస్కృతుల (గడియారపు) నడకను ఎన్ని శతాబ్దులో వెనుకకు నెట్టివేసినట్టులయినది.

మఱియు, ఏ యుద్యాన కృషికుడైనను, వంటకట్టెలకని, తనకు మంచిమంచి పండ్లనిచ్చు అంటుమామిడిచెట్టును నఱికి వేయునా? కాని మానవుడు మూర్ఖుడై తనసంతానమును శతఘ్నుల నోట కటా! బలిపెట్టి, గర్వించుచున్నాడు కూడను! హింసను మహిమపఱచు విషమస్త్రప్రచారము ఎంత పటిష్ఠముగ నున్నదో!

ఈ సంపర్కమున ప్రస్తావన సాధ్యము, మతవిషయములను, కారుణ్య భావమును. హింసా అహింసా చర్చలను లోక ప్రక్క నుంచినను గూడ, వైరీతిని వివర్తించుచో ఆహారమునకై జంతువధలు చేయు టయు, దూష్యమని తెలును. మాంసభక్షకునకు కొంత మాంసము లభించుననుమాట వాస్తవమే. వానికి లభించు పుష్టిని ఇతరవిధముల పూర్తిగావించుకొనుట కవకాశములు గలవు స్వభావసిద్ధమగు జీవన వికాసము భగ్నపడునెడ ప్రకృతిపొందు నష్టమెంతయో చూడుడు. పక్షుల మనోహరరుతములు సమసిపోవును. జీవజంతువుల సహజ ప్రేమ భంగపడుచున్నది. నరజీవనమున అరుదుగా గోచరించునట్టి విచిత్రశక్తుల నివి యెంతగనో మించి యొప్పుచుండునుగదా. మాన వునిలోని కల్పనాచాతుర్యముయొక్క చర్యలును వానితోపాటుగ భ్రష్టమగును. ఇవన్నియు పునః అలభ్యములేగదా? కాబట్టి మాంసా శనము, క్షణభంగురమగు పరాన్నభోజనపరిపోషణజాతికి చెందినదై హింసాకర వినాశహేతువగుచున్న దనవలయును. ఇట్టి తిండిపోతు తనము ప్రకృతిలో క్షుద్రాతిక్షుద్రము! ఇసుమంతేనియు నిది మాన నీయము కాజాలదుగదా!

మానవుని కల్పనాచాతుర్యమును ప్రత్యేకముగ దృష్టిలో నిడు కొని పరిపోషణ పంచకమునకు ఈ జీవనరీతుల ననువర్తింపజేసి చూతముగాక.

పరాన్నపరిపోషణము — అనుకరణ ధామముగా పరిణమించును.

స్నేయపరిపోషణము—పరావలంబన ధామముగా పరిణమించును.

సాహసపరిపోషణము—భౌతికసృష్టి ధామముగా పరిణమించును.

సమూహపరిపోషణము—సాంఘికాచార ధామముగా పరిణమించును.

సేవాపరిపోషణము—దివ్యధామముగా పరిణమించును.

అనుకరణభావుకులు : పూవన్నెముల జేబురుమాలు, తా బింకముల
కేలాటి యుపక్రమణిని చేకూర్చుకొనక, తమ అనుకరణ శీలము మూల
మున ఇతరులు సృష్టిగావించు దానిలో తమ కలిగియుండు దాని నెల్ల
సంగ్రహింతురు. వారి జీవనలక్ష్యము ప్రధానముగా స్వార్థప్రేమ.
సులభతమ మార్గమున స్వీయసౌఖ్యమును సాధించుకొన జూతురు.
పర్యవసానమునకు వారన్యుల జీవనముపై నాధారపడి బ్రతుకుదురు.
వారిది పరచింతా శూన్యమగు ఉనికిమాత్రము; వెన్నెలకు వాడి
పోవుదురు. జీవచ్ఛవాకృతి నుందురు. ఇక వారియందు ప్రతిభయే
మేని కలదందుమా, అదిపరజన సామర్థ్యముయొక్క ప్రతిబింబ మన
దగును. వారిస్వీయ వ్యక్తిత్వమెయ్యెడను కానరాదు. వారివలన
ప్రత్యేకముగా నేర్వగలదేమియు నుండదు. వారు సంకరజాతి జీవి
యగు కంచరగాడిదను బోలువారు. అది వారిదోషము కాకపో
వచ్చును. కంచరగాడిద సంతానసృష్టికి పనికిరాదు; గొడ్డుమోతుజీవి
తన బోలువానినేని కల్పనచేయ జాలదు సంతానమనునది లేకుండ
జీవించిచచ్చును. అదేవిధముగా, అనుకరణ శీలురందు కల్పనా
చాతుర్యము గోచరింపదు. ఏ కొంచెముగనో యున్నను అది నిద్రా
ణావస్థలోనే పడియుండును. అది ప్రకాశమునకు వచ్చుటకుగాని,
పరిణతి పొందుటకుగాని అవకాశములు శూన్యము. అటువంటి వారి
పరిసరదశలను మార్పుచేసినయెడల, సమాజముయొక్క సామాన్యా
భివృద్ధికి వారొకింత సాయపడుట సంభవముకానోపునేమో. కాని
వారు నిరర్థకులయ్యే పడియుండ, అట్టిమూకవలన సంఘమునకు
తప్పక నష్టమేవాటిలు ననవలయును. ఉత్పత్తియనునది చేయకుండ
ఉన్నదానిని వారు తిని వేయుదురు. వారి జీవితములందు శిల్పశోభయే
మాత్రము గోచరింపదు. అచ్చుకూటముల నుండి, రంగులతోడి

యందచందములు లేకుండ, తెలుపు నలుపు ఛాయలతో ముద్రించి పడవేయబడు బొమ్మల తీరున వారుందురు.

ఈ శతాబ్దారంభ కాలమున, పాశ్చాత్యుల నుండి ప్రతియంశమును అనుకరింపసాగిన జపానీయులు ఈ వర్గములోనివారే. వారు తమ సమీపవాసులగు చీనావారితోడను, భారతీయులతోడను సంసర్గము కలిగి జీవించిన కాలమునాటి శాశ్వతపరిపోషణము నుండి తొలగి అనుకరణధామమున బడిపోయిరి. చీనాలోనికిని, మంచూరియాలోనికిని, వారుగావించిన దాడులను గమనించిన యెడల, వారనివార్యముగా పరాన్నపరిపోషణ విధానములోనికి జారిపోయిరనినేడు స్పష్టముగా తెలియగలము. అహింసాధర్మగాములగుట మానివేసి, హింసను విధ్వంసనమును తమ ధామమున ప్రతిష్ఠించుకొనిరి.

మనదేశములోని మనమిత్రులనేకులు, ముఖ్యముగా భారతీయ క్రైస్తవులు ఈవర్గమున చేరుదురు. (నేనీసంఘమువాడనో, ఆసంఘము గురించి లజ్జాభిమానపీడితుడ నగుచు వ్రాయుచున్నాడను.) తమ మాతృభాషను పూర్తిగా పోనాడుకొని, ఆంగ్లభాషా వ్యామోహమున చిక్కుకొనునంతగా, సర్వవిధముల వీరు పాశ్చాత్యుల ననుకరించుచున్నారు. వీరు పాశ్చాత్యులవలె వస్త్రధారణ సేతురు. చేతనగునంతవరకు తమ గృహములను మిషనరీల ఫక్కిని అమర్చెదురు. సంపదలు గలవారగుచో, పాశ్చాత్యదేశములనుండి దిగుమతియైన తినుబండారపు డబ్బాలను సయితము ఆశ్రయించి తమ ఆహార సందర్భమునను, పరావలంబనము చేయుదురు, వినోదములకొఱకై పాశ్చాత్యుల పలుకులకు ముఱిసిపోయి "గానోప గూహనముల" నంబడు నాట్యమందిరములను గుఱ్ఱపుపందెములను మిగుల మక్కువతో ఆశ్రయించుచున్నారు. ఈవర్గమువారిలో పెక్కండ్రు వివిధ విద్య

లందును లలితకళలందును పట్టభద్రులై, గర్వముబూనగలవారైనను
కూడ, బుద్ధివికాసమున వంధ్యత్వమే వారి తలవ్రాలగ నున్నది. దుర
దృష్టవశాత్తు, నికృష్టపరావలంబనదశ యనంతగు వీక్షితకే మన నగర
వాసులు వర్ధిలుచున్నారు. కాని వారిసంఖ్య అత్యల్పముగనున్నం
దున సూరటపడగలము. ఈ పతనచర్య ఇంకను వ్యాప్తము కాకుండ
సకాలమున నాపుటకై శ్రద్ధ దీకొందుమేని, ఈ దురాచారమును
సమూలముగా తొలగింప గల్గుదుము.

అవలంబనధామము:— ఈ వర్గమునకు జెందినవారి ఆదర్శవాక్యము
"ఇప్పుడే తినుదము, త్రాగుదము, తందనాలాడుదము. రేపు
చత్తుముగదా" అనునది వీరును, అనుకరణధామవర్గమును బోలి,
యితరులవలన పరిగ్రహణము చేయుచుందురు. కాని కొంత భేద
ముండును. వీరితరులు సృష్టిచేసిన వానిలో కొలది మార్పులుచేసి
అవలంబింతురు. ఈమార్పులు చేసినంతమాత్రాన, వానిని తమ
రచనలని చెప్పుకొనజాలునంత విశిష్టత కాన్పించదు.

అన్యులు స్వాయముగ కల్పనచేసి దారిచూపినవానిని అవలంబ
నముచేయ జూచువారికి మంచి నిదర్శనముగా, ఈకాలపు జపాను
వారిని చెప్పుకోదగును. వారు ముందుగా పాశ్చాత్యులనుండి
గ్రహించినవానిని, తమ దేశస్థితి కనుగుణముగా మార్పుచేసికొనిరి.
ఎట్లన పాశ్చాత్యుల అధికోత్పత్తి విధానమును వీరవలంబించిరి; కాని
అలవిగాని పాశ్చాత్యుల కేంద్రీకృత కర్మాగారములను చిన్నచిన్న
కుటీరపరిశ్రమాలయములుగవిడదీసిరి. అందందుతయారైన ఆ మూవస్తు
భాగములను ప్రోవుచేసి, యొక కేంద్ర కర్మాగారము నందు పూర్ణ
వస్తువుగ కూర్పుచేయుదురు. ఒక ఉదహారణ చూతుము: ఇంగ్లాం
డులో బి. యస్. యే. కంపెనీవారి యొక్కొక్క కర్మాగారము

నందును బైసికిళ్ళపూర్తి నిర్మాణము జరుగుచున్నది. జపానులోనే కుటీరపరిశ్రమల నేర్పాటుచేసిరి; అచ్చటి పనివారలకు పనిముట్లను మూలపదార్థములను సమకూర్చి పెట్టుదురు. వారిచే వేర్వేఱు వస్తుభాగములను సిద్ధము చేయుంతురు. కొందఱు చక్రపు ఆకుతీగలను, మఱి కొందఱు చక్రవలయములు మొదలగువానిని తయారు చేయుదురు. ఈ విడివిడి భాగములనన్నిటిని కలిపి కూర్పుచేయు కేంద్ర కర్మాగారమునకు వానిని ప్రోగుచేసి తెత్తురు. అక్కడ వానినన్నింటిని వినియోగించి, సిద్ధముగా పనికివచ్చు పూర్తి యంత్రములను తయారు చేయుంతురు.


వికృతావలంబనము

మన దేశములో కొందఱు పురుషులు, అవలంబన ధామము వారంతగా, పాశ్చాత్య ప్రభావమునకు లోనుగాక పోయినను, వస్త్రధారణము మొదలగు వానిలో పాశ్చాత్యుల ఫక్కినవలంబనముచేసి వికృతవేషముల వేయుచున్నారు. ఒక పెద్దమనిషి మెడదగ్గఱ తెఱపి గలకోటును ధరించును. కాని మన వేడిదేశమునందు, చీకాకుగొలుపు బిగుసుమెడ పట్టీని నిరుపయోగమూ నసహ్యంపుమెడ ముడిని విడిచి వేయును. లాగుపైకి వేలు 'కుడతాను' తొడుగుకొనును. అదిచల్లదనము నొసగగలదు. పాదాలకు 'ఆక్స్ఫర్డు' బూట్లుచాల కర్చుచేటు గావున, తనకుదొరక గల నాటు చెప్పులనే తొడుగుకొనును. ఇట్టివికారవేషమును గాంచి, నిర్దుష్టముగా పాశ్చాత్యవేషధారణావలంబనముచేయు మఱియొకని కండ్లుమండ వచ్చును. ఐనను పూర్ణపరావలంబుని కన్న వీనికడనే స్వయంనిర్ణయ శక్తి కొంచెము హెచ్చుగ నున్నదనవచ్చును. ఇట్టి

వారియందు కానవచ్చు రసజ్ఞతయు మిల్లుగుడ్డ తానులపైనిషంగించ బడు చౌకపారుబొమ్మకాగితములందు గోచరింపగల కళాసంపద వంటిదే. కాని వారియందు కొంతబుద్ధిసంపదయు నుండును. విచక్షణచేసి తెలుసుకొనగల శక్తియున్నది. కాని వారియందు సంపూర్ణ దర్శనము కావించి చూడగల దూరదృష్టిగాని, కళాభిజ్ఞతగాని కొఱవడి యుండును. లేదా వారు సోమరితనమునకు లోబడిపోయి అటులచేయ లేవో. కావున వారుచేయు అతుకు బొతుకుపనులు చిరకాలము సాగబోవు. తమకోర్కెలను సత్వరము ఈడేర్చుకో వలెనను ఆతుర పాటు వలన వారు హింసాచరణకును పాల్పడు చుందురు.



ఈ తృత్తిదారు కల్పనచేయు అందచందములు

భౌతికసృష్టిధామము:—సాహసపరిపోషణ ధర్మము ననుసరించి విచారించునెడల, భౌతికసృష్టి ధామమునందలి ప్రతివ్యక్తియు, తన యిచ్ఛనే ప్రధానముగ జేసికొని తనయిష్టము వచ్చినటుల జీవించు నవలయును. "ఎవనివచ్చు వానిదే; వెనుకబడినవారు శనిగాని పాలే". అను క్షుద్రధర్మానుగాములై యితరుల గోడు పట్టుకొనరు. వీరు స్వేచ్ఛానుసారము వర్తింపగోరుదురు. వారు విశిష్టములగు స్వీయ

ముఖాభావములు కలిగియుండి, వానిని తమ స్వప్రయోజనముల కుపయోగించుకొందురు. ప్రతిమనుష్యుడు తనదైనందిన జీవితచర్యలలో తన యిచ్ఛానుసారము పరిణతి పొందదగునని దాని అర్థము. దురదృష్టవశాత్తు నేటిప్రపంచము వస్త్రోత్పత్తిదారుల పాదాలక్రింద బడి నలిగిపోవుచున్నది. తము సరకులు గొనువారి జీవితము లెట్టుల గడపవలయునో నిర్ణయించు నధికారము వీరిచేతిలో పడినది. కాబట్టి కొనుగోలుదారుడు తన యిష్టము వచ్చినవానిని నిర్ణయించుకొను స్వేచ్ఛకును, వాని రచనాచాతుర్యమునకును అవకాశము లేని కారణమున నవి తుదిని శూన్యములే యగును.

ఫ్రాన్సుదేశములో సొగసుల వరవళ్ళు పెట్టువా రుందురు. ఎప్పటికప్పుడేది అలంకారశోభగా గణనగాంచునో వారు నిర్ణయింతురు. వీపులమీద సీతాకోకపురుగు బొమ్మలను పొడిపించుకొని పలువురుచూచి మెచ్చుకొనురీతిని వీటుగ దిరుగాడుట నాగరికసంప్రదాయమని చాటుదురు. ఇంకేమి? కాదనజాలని వెడగువనితలు తండోపతండములుగా వారి శృంగారరచనాశాలల కేగి బాధల కోర్చి వీపులమీద రకరకాల సీతాకోకచిలుక పుర్వుల పొడిపించుకొందురు. జంకుగొంకులేక 'రెవీరా' సముద్రతీరములకు ముఱియుచు పర్వులు పెట్టుదురు. విలాసగాండ్రు వలపు చూపులతో తమ వంకచూచుచుండ, ఈ యువతులు ధన్యత గన్నటుల దలతురు.

మఱియు, పాశ్చాత్య వస్త్రధారణము, పారిసునగర సారసాకుల సొగసులు ప్రపంచమునకు మార్గదర్శకములైనవి. వీని ననుకరణము చేయు లండను, ఆసొగసులను తమ వ్యాపారలాభములకై వినియోగించుచున్నది. న్యూయార్కు తన ప్రయోజనములకొఱకై వీని నవలంబనముచేసి సౌందర్యప్రమాణరీతుల సంస్థాపించుచుండును.

ఈ ప్రమాణ నిర్ణయము పాశ్చాత్యదేశములందు, విపణిమార్గ జా
రుల జీవన సౌఖ్యములనుండి స్వతంత్రరచనాపేక్షను తుడిచిపెట్టినది.
లోకసామాన్యమైపోయిన జీవితాచారాలకు భిన్నముగ వర్తించు
వట్ల, తమనుజూచి యెవరేమనుకొందురోయని ప్రజలు భయపడు
దురు. బాహ్యప్రపంచమున కోర్టులలోను రాజసభలలోను వ్యాపార
మందిరాలలోను అవసరాలైన డాంబిక వేషాలు గృహములలోనిసాం
సారిక జీవితాలలోనికిని దాడవెడలివచ్చి జోరబడినవి.

పళ్ళెరములో సొగసగు పాయసపుగిన్నె పెట్టుకొని, అందాకృతిగల
పెద్దగరిటెతో పానీయములు త్రాగుట కొంతకాలము మర్యాదగా
గోచరించును. ఆ ఆచారము మరికొన్నేండ్లకు మారిపోవును. అంతట
అంచులేని పాయసపు గిన్నె నుపయోగించుచు గుండ్రని గరిటెతో
నారగించుట సదాచారమగును. తరచుగా నిట్టి మార్పులు గలుగుట
వెకిలితనమునకు మూలమగును. ప్రజల వెకిలితనము వర్తకవు పెంపున
కుపయోగకరము. పేదవాండ్రు గడియగడియకు పానపాత్రలను
గృహోపకరణములను తీసిపారవేయుచు, క్రొత్తక్రొత్త వన్నెచిన్నె
లను ఆచారమర్యాదలను అనుసరించలేరు. వారు సభ్యవర్గమునుండి
వెలియైపోవలసియుండును. వ్యాపారదృష్టితో చూచునెడల పితార్జి
తముగా ఒకే సామగ్రిని తరతరములవా రుపయోగించుట తగదు.
అందువలన, వ్యాపారము సన్నగిలిపోవును. అటులగాక జీవితాచార
మర్యాదలు మారుచుండునెడల వ్యాపారమున కెంతేని అభివృద్ధి
చేకురగలదు.

అటువంటి వ్యర్థములును, అర్థహీనములునగు ఆడంబరమర్యాదల
వెంటబడిపోవు ప్రజలు అమాయికముగా బలియైపోవుదురు. సభ్య
త్వము గతించుకొనుచుంటిమను భ్రమలలో చిక్కుకొందురు. సాహ
సవంతులగు వర్తకులు తెలివితేటలతో చమత్కారములగు ప్రకట

వలు చేసి, డాంబికమగు వ్యాపారపు టవసరముల దెచ్చిపెట్టి సహజముగా అమ్ముడుపోజాలని సరకుల కెక్కడలేని గిరాకీని సృష్టిచేయుదురు. ఆరీతి ప్రచారములకు అందచందములకు భ్రమసి, నలిగిపోవు ప్రజలలో, పోనుపోను తామొక హీనజాతివారమను భావమును తమలో స్వయముగ పెంపొందించుకొందురు. ఆత్మవిశ్వాసమును కోల్పోవుదురు. వారిలోని స్వతంత్రయోచనా సామర్థ్యమునకు అవకాశములులేని కారణమున ఎదుగుబొదుగులులేని బడుగు జాతిగా మారిపోవుదురు.

బొంబాయినగరమునకు పోయి, అచ్చటి డాబాయిండ్లను కొన్నింటిని చూచినంతనే, తక్కిన యిండ్లన్నియు నెటులుండునో మీకు తెలిసిపోగలదు. ఎవరింట చూచినను, నవీనమగు ఆచారమునకు నిదర్శనముగా ఒకేమాదిరి మడతకుర్చీలు, ఒకేతీరు మడతబల్లలు, మడత మంచాలు, గుండ్రని మేజాలు, వానిపై నమర్చిన గాజుకూజాలు, పింగాణీ సరంజాలు కండ్లబడును. వైచిత్ర్య మిసుమంతయు నుండదు. ఎల్లెడల ఒకేతీరు! నూతనభావాలుగాని, నవ్యతర రచనలుగాని సున్న. మృతప్రాయమగు ఏకత్వము. ప్రాచీన స్మశానవాటికకు పోయినను, రకరకములగు సమాధికట్టడములును, వానియందు కళానైపుణ్యమును కొంత గోచరింపగలదు; ఈసరిక్రొత్త బొంబాయి నగరపు డాబాలలో అట్టిదేమియు కనులబడదు. ఇట్టిచోటులలో బ్రతుకు జనులను “జీవించుచున్నా”రందుము. కాని ఈడాబాలను సమాధులకన్నను జీవరహితములగు స్థలములనవలెను. వినియోగదారులకై విక్రయదారుడే యిచ్చట సర్వమును సంసిద్ధము చేసిపెట్టును. సుఖజీవనమును, హాయిని, చేకూర్చిపెట్టుచున్నానని అతడు బీరములు పలుకును. ఆరీతి సుఖభోగములు మానవుని యుత్తమ శక్తులను మ్రాన్ప

డచేసి, యుపకరించును. ఇక ప్రగోభివృద్ధిరస్తుతః! వికాసమా ఆగాగ పుష్పమే!

జీవితమున సృజనలక్షణములు అమరియుండవలయుననుచో, నిర్జీవప్రపమగు ఏకీకృత ప్రమాణము, అంకము, చందము, మర్యాద-యుండదగదు.

ప్రతివారు తమ అభిరుచిని కెలువరించుటకు పూర్తి అవకాశము లుండవలయును. తనయింటి యాకారమును తానే నిర్ణయించుకొనుట, తన గృహోపకరణములను తాను నిరూపించుకొనుట, అనునవి వ్యక్తిత్వము వికాసము పొందుట కవసరమగును. మానవసమస్యలను సరళపఱచు నెపముతో, అధికోత్పత్తిచేయు పరిశ్రమాధిపతులు, ప్రజాజీవితము నందలి వ్యక్తిత్వమును వ్యక్తిప్రతిభను వ్యర్థము గావించి, దూరముగ నెట్టివేయు చున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రములందు, ఒకరాత్రిలో ఇండ్లను కూర్పుచేసి పెట్టగలరు. తన కొక గృహము కావలయునను వాడు ఇండ్లుకట్టు వ్యాపారిని ఎలె క్ట్రిక్కు-గంట ప్రయోగించి పలుకరించి, తానుకోరు ఇంటి నమూనా (ఏ) రకమో, (బి) రకమో, (సి) రకమో సూచింపుచు, దాని నెచ్చట నిర్మించుటో తెలిపిన చాలును. ఆ నమూనా యింటి కవసర ములగు ద్వారములు, కిటికీలు, తలుపులు అన్నియు వ్యాపారికడ నెన్నడో తయారై సంసిద్ధముగా నుండును. వానినొక కట్టగట్టి లారీలో నెక్కించుటే కావలసినపని! ఆ మాత్రము వ్యవధిని అంగీకరించిన జాలును. తెల్లవారు నప్పటికే యిల్లు మొలుచుకొని వచ్చును.

జిహ్వాకొకరుచి యనుట ఎల్లరెఱిగిన నుడియే కదా? ఆయా ప్రజలయొక్క భిన్నభిన్నములగు రుచుల కవసరములగు తినుబండా రముల విషయమునను, ఉత్పత్తిదారులు వేర్వేఱు రకముల వానిని

సిద్ధముచేసియుంచి నోరూరజేయు వర్ణనలతోడను భ్రమలు గొలుపు ధరలతోడను ప్రకటనలు చేయుదురు. వ్యక్తులను సమ్మోహింప జేయుదురు. మన దేశమున కూడ అంగళ్ళలోను ఇండ్లలోను సయితము ఎక్కడనో సిద్ధముచేయగా తెప్పించి, అమర్చిన ఆహారములు నేడు వెలసినవి. గృహిణుల పాకశాస్త్ర నైపుణ్యమున కాస్కారమే లేకుండ బోవుచున్నది. ప్రతిగృహసతియు వంట పనులందు తన నేర్పును గురించి గర్వపడుచు చెప్పుకొను దినములు గడిచిపోయినవి. లెక్కకు మీరిన రకరకముల యూరుగాయ డబ్బాలు, పండ్లమురబ్బాలు, పచ్చళ్ళు, పసివారికి రోగులకు పలయుతిండ్లు ఫ్యాక్టరీలలో సిద్ధముచేయబడి వేలకొలదిమైళ్ళ దూరమునుండి దిగుమతియై, పేరు చెప్పినతోడ్తోడనే కనులయెదుట ప్రత్యక్షమగు చున్నవి.

నరుడు జీవనసమస్యలగూర్చి యోచనచేయు నగత్యము తరిగిన కొలది, సమాజముగ వ్యర్థజీవుడై పోవుచుండును. కాబట్టి బుద్ధిచతురుడును వివేకవంతుడును నగు ఈకాలపు వస్తూత్పత్తిదారుడు, కొనుగోలుదారుని పక్షమున ఆలోచనభాగము నంతను తానె గుత్తగొనుటచేత నరుని గణ్యతను కుంటువడజేయుచున్నాడు. దయాహృదయ యగు తల్లి సయితము తనబిడ్డను స్వాయముగ నడచు యత్నము చేయనిచ్చుచు, కొన్నియెడలపడి గాయములు తగిలించుకొనుటకును సమ్మతింపక తీరదు. ఆమె తన శిశువెక్కడ పడిపోవునో యని మితిమీరిన జాగ్రత్తతో సదా తన చేతులలోనే పెట్టుకొని పెంచు నెడల బిడ్డడు నడకలో తూకువ నిలువుకొను నేర్పును నెన్నడు నెరుంగలేక ఆజన్మాంతము కుంటిబతుకు బ్రతుకవలసి వచ్చును. ఈనాటి ఉత్పత్తిదారులు సమాజమునకుచేయు సేవలు ఆతీరున ఫలించుచున్నవి.

మన దేశములో, వేర్వేరు శీతోష్ణస్థితులుగల, వేర్వేఱు రాష్ట్రములందు దైనందినజీవనవిధులలో లెక్కకుమీరినన్ని వైచిత్ర్యము

ఏర్పడియున్నవి. కేంద్రాష్ట్రమునందు సంతతము వివిధగ్రామములయందు వేర్వేరు విశిష్టముద్రాకలు కలవు. కాబట్టి మానవము వ్యాపార కూటములవారి చక్రములలో చిక్కుకొనని యెడల స్వశక్తి ప్రభావమును వ్యక్తీకరించుకొనుటకును ప్రకటించుకొనుటకును అవకాశములు మెండుగా లభింపగలవు. నగరములయు, పట్టణములయు ప్రసక్తి విడిచినచో, పల్లెలందలి జీవనగతులు విస్పష్టముగ నుండగలవు. కాని దురదృష్టవశాత్తు నాగరిక దయ్యము మహామారి ప్రదేశములందున్న పల్లెలలోనికి సంతతము పెద్దపెద్ద అంగలు వేసికొనుచు వచ్చి పడుచున్నది. ఇనను బాత్రిగ నిరాశావాదమునంతటి దురవస్థ ఇంతను నేర్పవలేము. కాని యీ మహామారిని అరికట్టుటకై సర్వప్రయత్నములను చేయవలసియున్నది.

సృష్టిధామము బలవర్ధకమై యొప్పవలసినది. కాని, వస్తూత్పత్తిదారుడు సమాజమున కేంద్రస్థాన మాక్రమించుకొని కూర్చుండి, సమస్తమును తలక్రిందుచేయుట మూలమున, ప్రజాజీవనమనెడు గొలుసునందు సృష్టిధామమును దుర్బలతమమగు కడియముగ జేసివేసినాడు. వినియోగదారుడో, యథార్థమునకు సమాజమున కొలికిపూసయై యొప్పగావలసినవాడు. నేడు వాని రచనాచాతుర్యము ఫ్యాక్టరీల పెంటకుప్పల క్రింద బడి పూడిపోవుచున్నది. ఇట్టి జీవన విధానము కళాభ్యుదయరచన లుద్భవమగుటకు తోడ్పడజాలదు. ఏ బడిపిల్లవాడైనను తన పుస్తకములో నతికించుకొని మూడునాళ్ళ ముచ్చటగా చూచుకొనుటకు యోగ్యమగుపాటి పిచ్చిబొమ్మల రచనలకు మాత్రము దారితీయగలదు.

తన కేలాటి సరకు కావలయునో నియమించు నధికారము వినియోగదారునుండి జారిపోయినది. వ్యాపారపు నీతిలో వినియోగదారుని అధికారమునకు “ సరఫతానిర్ణయము ” అని ఆర్థికపండితులు

ఘనము గ తెలుపుచున్నాడు. తాని సరఫరానుగూర్చి అతను చేయ గల నిర్ణయమే కానరాకుండపోయినది. అతడు నోరెత్తకుండ తన ఎదుట బెట్టిన సరకునే దీసికోవలసినవాడైనాడు. వ్యాపారసరళి నేడు తల్లక్రిందై నడచుచున్నది. ఇంగ్లాండులో 'నార్తాంప్టను' నగరము నందు గూర్చుండి చెప్పులుకుట్టువాడు భారతదేశములోనో, లేక భూలోకమున నేమూలనో వసించు వినియోగదారునికొఱకై చెప్పులను తయారుచేసి పంపుచున్నాడు. వినియోగదారుడు తన పాదములకు సరిపోవు చెప్పులను తానుగ తయారుచేయించుకొనుటకు వీలులేదు. అతడేదో యొకషాపులోనికిపోయి, అక్కడ సిద్ధముగా తయారుచేసి పెట్టబడియున్న ఏదో యొక షాపులోనికిపోయి అక్కడ సిద్ధముగా తయారుచేసి పెట్టబడియున్న ఏచెప్పులజతతో సుమారుగా తన పాదములను సరిపెట్టుకోవలసినవాడగుచున్నాడు. పాదరక్షల నిర్మాతల అమ్ములో నడచుషాపులలోని పాదరక్షలకు సరిపడు పాదములుం చాలినన్ని దొఱకని యెడల, పాదరక్షలు తొడుగుకొను అలవాటే లేని 'నాటుజనులు' (Natives) గల అబిసీనియావంటి దేశమును వశముచేసికొని, పాశ్చాత్యుల ఫక్కీనిబూటులను తొడుగుకొను ఆచారమును ఆదేశీయులకు నేర్పి, వారిని నాగరికులను చేయవలసి యుండును. కోరువారి ప్రసక్తి లేకుండ, విరివిగా సరకుల సరఫరా చేసిపెట్టుటలో పర్వేలువెట్టు ఉత్పత్తి పద్ధతి, ఆధునిక యుద్ధములకును పోరులకును కాలుదువ్వు ధూర్తత్వమునకు ఎంతేని మూల కారణమగుచున్నది. అస్వాభావికమగు గిరాకీని బలాత్కారముగా సృష్టిచేయు పద్ధతివలన,హింసాచర్య ప్రబలమై, సర్వానర్థముల దెచ్చి పెట్టు ఒడుదుడుకులు కల్పన యగుచున్నవి. వానిని సరిదిద్దు ప్రయత్నమునగలుగు ప్రతీఘాతములవలనను మఱల నూతన హింసాచర్య రేకెత్తుచున్నది.

సమాజమున శాశ్వతత్వము, అహింసా ప్రవృత్తి వెలయవలయునన్నను, ఇప్పటి జీవనవిధానము మారి వినియోగదారుడు ప్రధానస్థానమాక్రమింపవలయును. వాని పలుకుబడి బలతరము కావలసి యుండును. వినియోగపడు సరకులు స్థానికముగా తయారు కావలయును. అందునను, వీలగునంత వఱకు గ్రామకుటీరములందు, వినియోగదారుని కండ్లయెదుట ఆపనిజరుగ వలయును. తయారగు సరకు ఎప్పటి యవసరముల నప్పుడు తీర్చునదిగా నుండ వలయును. అటువంటిపరిస్థితు లేర్పడినప్పుడు మాత్రమే, వినియోగదారుని ప్రయోజనప్రమాణములకు పాటింపు లభించును. వాని వ్యక్తిత్వము ప్రవర్ధనముగాంచును. వరుస వికాసము నందగలడు. ఈకాలపు ఉత్పత్తిపద్ధతులు, విక్రయవిధానములు 'జీవనము'ను స్తంభింపజేసి, కేవలము 'ఉనికి'గామార్చివేయు చున్నది. ఈ వాతావరణమున ఊపిరాడక యుబ్బుగుడుపనగుచున్నది. సృష్టిధామమునకు చెందనగు వ్యర్తక గల ప్రజ తమ వ్యక్తిత్వమును ధృవపఱచుకొని, కార్యపరులై యొప్పినగాని, యీదుర్దశ తొలగదు. గుణనిర్ణయాధికారమును గుత్తగొనినధనము ఇప్పుడీధామమును పూర్తిగా నాక్రమించివేసినది. ముందుదానిని వెడలనెట్టవలసి యున్నది. సంస్కృతియేగుణనిర్ణయముచేయు నాచారముపునఃస్ప్రతిష్ఠితము గావలయును. సామాన్య ప్రజాజీవన పరిస్థితులను సరిదిద్దు అధికారము దానికి సంక్రమింపగావలెను.

సాంఘికాచార ధామము :—ఈ ధామము సమూహపరిరక్షణకు సంబంధించినది, కాబట్టి ప్రతి దశాంతరమునందును గుణనిర్ణయము చేయునది "సామాన్యముగా, సంఘమున కేది క్షేమకరము? అను సమస్యయేగాని, ఏ ప్రత్యేక వ్యక్తికో లేక ఏ ప్రత్యేక వర్గమునకో లాభదాయకమా యనెడు విచారణకాదు. ధనప్రమాణముల కింద

ప్రమేయమే లేని శాంతి శాశ్వతముగ నుండదు. దూరదృష్టిప్రయోజనములు సంకుచితదృష్టి ప్రయోజనములను అణచివైచి మాన్యతరములై యుండును.

ఇటీవల సాంఘికదృష్ట్యా ఆర్థికప్రయోగములు చాల సాగినవి. "సోవియటు" సాంఘికనీతి నవలంబించిన రష్యాదేశము దీనికి ఉపక్రమణము గావించియున్నది. ఫాసిస్టులు, నాజీలు వారి ననుసరింప సాగించిరి. శాశ్వతత్వమును అహింసను సాధించుటలో వారువిఫలులైరి. అందుకు మారుగా మానవజాతినే వారు రక్తప్రవాహములలో ముంచి తేల్చిరి. వారు అస్త్రతోవలబట్టి పోజూచిరి. ప్రతివారు తమ వర్గమునకో లేక జాతికో మాత్రమే దేవులాడిరి. సమష్టిని అఖిలమానవకుటుంబముయొక్క సమస్యలమెడ నుపేక్ష వహించిరి. నోరు లేని అమాయికపు ప్రజాసంఘమునకు "మంచియో, చెడ్డయో; నా దేశము నాకు" అనెడు నినాదముల నేర్పిరి. కావున హింసా వినాశములనెడు సుడిగుండములలో వారు దిగబడిపోయిరి.

నానాజాతిసమితి ప్రపంచమునంతటిని తనలో నిముడ్చుకొనినటుల కొంత డంబముగా దొడ్డపేరు పెట్టుకొని యూగులాడినను. ఆ సమితి కార్యక్రమమును నడిపిన కొలదిమంది స్వార్థపరులు తమ పచ్చనే చూచుకొనుచు, తాత్కాలికపు హ్రస్వదృష్టిని బూని సంకుచితమగా ఆర్థికవిధానము నవలంబించినారు. అందుమూలమున ఆ సమితియే వ్యర్థమైపోయినది; విశాల మానవజాతికొఱకై అహింసను శాశ్వతత్వమును సాధింపజాలదయ్యెను.

ఏదేని జీవనప్రణాళిక నొకదానిని మనము కూర్చుకొనక తీరదు. ఇందు విజయము సాధింపనుంటిమా, మనము కూర్చుకొను ప్రణాళిక యొక్క గమ్యము సార్వజనీనమైనదై, శాశ్వత జీవనసూత్రములకు పూర్తిగా అనుగుణమైనదై యుండవలయును. అది కేంద్రీకృతకర్మా

గారములందు విరివిగా తయారుచేయు సరకులను విక్రయించి పెట్టు నుద్దేశ్యముతో, (క్రిందటి అధ్యాయములో మనము తెలిసికొనియున్న విధాన) పారిశ్రామిక జీవనప్రమాణ పద్ధతులను అన్యుల నెత్తిపై బడవేసి రుద్దుటకు హేతుభూతమగునదిగా నుండరాదు. మరియు వ్యక్తిమహాత్వమును ప్రకటించుకొను నవకాశముల హతము చేయునదిగా నుండరాదు.

మనదేశములో, సాంఘికాచారధామమునకు చెందినవారు కార్యపరులై వర్తింపగల్గు క్షేత్రము, కడు విశాలమైనది. గ్రామీణుల జీవనము సుఖప్రదము కాగల్గుటకున, వారి కార్యకలాపములను చక్కనికట్టుదిట్టములలో బెట్టగలవారిసేవ యెంతయైనను మనకు అవసరముగా నున్నది. అడవిజంతువులకును ప్రవృత్తి ప్రేరకమును, ఆరోగ్యవర్ధకమును నగు ఆహారము సులభముగనే దొఱకుచున్నది. ఈనాడు మన గ్రామవాసుల గతి అంతకన్నను నికృష్టముగ నున్నది. సాంఘికముగను, ఆర్థికముగను గూడ వారి పరిస్థితులు వారి యుద్యమారంభముల నెల్ల హతము చేసివేయునవిగ నున్నవి. స్వయంప్రకాశమునకు సకలావకాశముల నొసగు మానవజీవనము నిరాఘాటముగ సాగవలసియుండును. అట్టిస్థితి సంభవమగురీతి జీవితప్రణాళికలను సమకూర్చుకొనుటకై ఈ ధాతువాసులు ప్రధానముగ పూనుకోవలయును.

ప్రణాళికరచనయనగా, దేనిని సాధించుకొనుటకై మనము పాటుపడవలసియుండునో, ఆ ఆదర్శజీవనమును ప్రకటించుటయే. ఆ ఆదర్శము సముచితరీతిని భావన చేయబడునెడల, సమాజమునందలి ప్రతివ్యక్తియొక్క కల్పనా సామర్థ్యమునకును పరిపూర్ణావకాశములు లభింపగలవు. ఏ ఆదర్శమేని సముచితమైనదా? కాదా? యని నిర్ణయించుపట్ల దానియందు మార్పులు చేయుచో ఘటిల్లు ఫలితార్థ

ముల ననుసరించి గ్రహింపగల్గుదుము. ప్రకృతి కనుగుణముగా నేర్ప
డిన ఆదర్శములైనను స్వల్పమగు నొకని జీవితకాలానుభవము నాధా
రము చేసికొని హెచ్చుచేయుటకుగాని తగ్గు చేయుటకుగాని వీలుప
డదు. అట్టి పెడతిరుగుడులు వ్యాధులకు మూలములగును. యుగ
యుగాంతరములనుండి ప్రకృతి యీమానవజీవనధర్మమును పరిణా
మమునకు దెచ్చియున్నది. మన ఆహారకోశమును బోలు పరిశోధనా
గారమును అంత సరళముగను మఱియు నంత నిపుణమైనదిగను, ఏ
శాస్త్రవేత్తయు నమర్చి పెట్టుకోజాలడు. మన హృత్పిండమునుబోలు
స్వయముగ వ్యవహరింప సమర్థము గలట్టియు, స్వయం నియంతృ
త్వముబూన గలట్టియు విచిత్రజలయంత్రమును ఏశిల్పియు రచన
చేసికో సమర్థుడుకాడు. మననాడీ జాలమునుబోలు నిర్దుష్టమైనవార్తా
ప్రచారకకూటమును, తంతి సహితముగగాని తంతిలేకగాని సృష్టింప
జాలు 'మార్కొని' యెందేనిగలడా? ఈ భౌతిక దేహముయొక్క
గాని మనస్సుయొక్కగాని సామాన్యకార్య కలాపమును కూర్పుచే
యుట మితప్రజ్ఞుడగు నరున కెన్నడును సాధ్యపడదు. కాబట్టి నిస్స
హాయుడౌ నరుడు తన యిచ్ఛవచ్చిన తీరున జీవనగతులను మార్పు
జేయగడంగుట మూర్ఖతయే యగును. మానవుడు చేయదగినదెల్ల,
ప్రకృతితో సహకరించుచు, ప్రకృతిధర్మగతి నెంతమాత్రము చెదర
గొట్టజూడక కడునేర్పుతో, జాగ్రత్తగా పరిసరములను పరిపోషించుటే
సుడీ! ఈస్థితి, అనగా ఈగమ్యము ప్రకృతిచేతనే సుప్రతిష్ఠితమై యు
న్నది; దానిని పరిశోధించి ప్రకృతి నియమములను సరిగ గ్రహించి,
నేర్పుమెయిదాని ననుగమించుటయే మనుజునికి కర్తవ్యము. ప్రకృతి
ధర్మనిర్ణయములకు భిన్నమగు ప్రవర్తన మిసుమంతయైనను సంఘ
నిర్మాణమును విచ్ఛిన్నము చేయుననుట నిశ్చయము.

శరీరముయొక్క ప్రకృతిసిద్ధమైన ఉష్ణమితిని మార్చుటకై చేయబడిన ప్రయత్నము లన్నియు వ్యర్థమగుట డాక్టర్లందఱకును తెలిసిన విషయమే. ఉష్ణము మామూలునకు మించెనా, జ్వరమంకురించును; మామూలునకు తగ్గెనా నిస్సత్తువ, శోషకలుగును. అయినను ఇట్లైనను తుదకు మరణము సంభవించును. నరుడు తన యిచ్ఛానుసారము తీవ్రప్రవృత్తితో పనిచేయుచు, గుండెయొక్క గతికి దానితోలయగూర్చ జాలుట మన చేతగానిపనియే. కొలదిపాటి అనుసరణవృత్తి సంభవమగుటయు నిస్సంశయమే. కాని మితిమీఱి అటుల చేయలేము. రక్తనాళములకు హెచ్చు ఒత్తిడి కల్పించితిమా అధికమౌ రక్తపుపోటు వాటిలి అపాయము కల్గును. ప్రాణహానిరాకుండ, మనము జీవింపగల ప్రమాణమేదియు నూతనముగ కల్పనచేయ జాలము. ఇదేతీరున మన ప్రతిఅవసరమునకును పరిమితికలదు. దానిని తీర్చుకొను నప్పుడే, మనుజశరీరము శ్రేష్ఠముగ స్వధర్మనిర్వాహణము గావించును. మనమే ప్రణాళికను కూర్చినను, దాని ప్రమాణమును నిర్ణయించుకొని, అది ప్రతిమానవునకును అందుబాటులోనుండు రీతిని సునిశ్చితచర్య దీసికొను నిమిత్తమే ఆ ప్రణాళిక వినియోగపడ వలసియుండును. దురదృష్టవశమున మనము స్వర్ణశునకమునకు పట్టముగట్టి, సింహాసనము నెక్కించితిమి. (మన వ్యాపారమున బంగారు స్టర్లింగులపసకూడ బయటపడిరే పోయినది). మనవ్యాపారవు టాలోచనలనన్నింటిని,మానవ వ్యక్తిని మనసున బెట్టుకొని సాగించుటకు మారుగా, డబ్బుననుసరించి సాగించుచుంటిమి.

ఎన్నెన్నియో ప్రణాళికలు రచనచేయుచున్నాము. అన్నింటికిని లక్ష్యమొక్కటియే—అధికవస్తూత్పత్తి! ఏ ప్రణాళికకును మానవ ప్రకృతిని ఆధారముగ గ్రహించుటలేదు! ఆప్రణాళికలన్నియు,

చెట్లనుండి పృథివికి తెచ్చిన పూలను సొగసుగా నమర్చి మేజాబల్లల పైని బెట్టు గాజుకూజాలవలెనుండుచున్నవి. అవి శృంగారముగ గోచరించుననుట నిర్వివాదమే. మఱియు కొంతసేపు వాని నైసర్గికమగు సువాసనను మనోహరముగ వెదజల్లుటయు యథార్థమే. కాని అవి తల్లిమొక్క నుండి వేఱుచేయబడిన వగుటచేత మృత్యువు వానిలో ప్రవేశించియే యుండును. కావున వాని వైభవము క్షణభంగురము.

ప్రణాళికల రచించునతడు, అటులగాక, ఆరామపోషకునివలె వర్తింపవలయును. అతడు మున్ముందుగా నేలను సిద్ధముచేయును. విత్తనములనాటి నీరుపోయును. ఇట్లు తనవంతు పనిని పూర్తిచేసి, ప్రక్కకు వైదొలగి చూచుచుండును. మొక్కలే తమ నైజము ననుసరించి, సిద్ధముచేయబడిన నేలనుండి ఆహారమును దీసికొని, ప్రవర్ధనమై, పూచుకాయును. ముచ్చటగా నమర్చబడిన కూజాయెంత సొగసుగా పూలతో నమర్పబడినదైనను, దానిశోభ క్షణభంగురమైనదే. దానిలో మరణచిహ్నములు నెలకొనియుండును. మొక్కయో సుస్థిరతరమైనది. వేళ్ళతో ప్రకృతినుండి సారమును పీల్చుకొనగలదు. అది సచేతనమైనది. ఆ మొక్కయొక్క పువ్వులును కొన్ని వాడి రాలిపోవునుగాక; ఐనను మఱల పూలుపూచి, రాలిపోయిన వాని స్థానము పూరించగలవు.

అదేతీరున ఏ ప్రణాళికయైనను మానవజీవుల ప్రవర్ధనమునకు అనువగు పరిస్థితులను చేకూర్చునదిగా నుండవలెను. కేవలము ప్రకటనలే పరమార్థములుకావు. 'ఫలితార్థమును ముందుగా నిశ్చయించి పెట్టుకొని, పని ప్రారంభించుటయు, ఆ ఫలితార్థము సాధించుకొంటకైయే పాటుపడుటయు' అనెడు పద్ధతి ప్రకృతివిధానము కాదు. అట్టి పద్ధతులవలన త్వరితగతిని కొలదిలాభమును ప్రాపింపవచ్చును;

కాని, అవి సహజాభ్యుదయము కాకపోవుటచేత. అవి [illegible]ంచి పోగ
లదు. ఒక్కొక్కప్పుడు తీరని అనర్థములకు మూలము కానగును;
అటువంటి కృత్రిమగతి, ముచ్చిలంగాటపు మేకులతో బోలి తళతళ
లాడు క్రొవ్వువత్తులచే నలంకృతమైన 'క్రిస్మసు' చెట్టుపోలిక నుం
డును. దానిక్రింద మృదంగములు, సన్నాయిలు, గుమ్మటములు,
ఇతరములౌ బొమ్మలు, కానుకలుగా నొసగబడిన వస్త్రజా
లములం దమర్చబడియుండును. అవి నిజమునకు బహుమానము
లును గావు; అలంకారములును గావు. ఏ విధముగ చూచినను ఆ
వృక్షమునకా యలంకారము లుపయోగకరములని చెప్పి సంతసిం
చుటకు పనికివచ్చునవి కావు. 'క్రిస్మసు' తరువనునది సజీవమగు
నొకానొక వృక్షమునుండి నఱికి తెచ్చిన కొమ్మయేమైనను, పుడమి
తల్లినుండి వేళ్ళద్వారమున జీవరసముల బీల్చుకొనజాలదుగదా!
దాని ఆకులు, చిగుళ్ళు, కొలదిసేపు తాజాగా గోచరించినను, వసిలి
తలలు వ్రేలవేయును. తుదకా కొమ్మ యంతయు యెండి, వంటచెఱకు
తో చేర్చివేయబడును. కృత్రిమమగు పుష్పలతయొక్క నిగనిగల
ప్రదర్శించు ప్రణాళికలగతి యిట్లే యగుచుండును.

సుదృఢపఱచ బడవలసిన మానవ సమర్థతల యొక్క పూర్ణవికా
సమునకు అనువగు పరిస్థితులును అవకాశములును ప్రణాళికారచనమున
ప్రధానాంశములై యుండును. ప్రతివ్యక్తికిని ఆరోగ్యప్రదమును పుష్టి
కరమునగు ఆహారము, వాతావరణపు మార్పులనుండి శరీరమును రక్షిం
చుట కవసరమగు దుస్తులు, తగుపాటి వసతిగల యిల్లు, ఉచితజీవన
మున కనుకూలించునట్టి శారీరక, మానసిక శిక్షణము, ఆరోగ్యమును
గాపాడగల వినిర్మల పరిసరములు, మానవ సంసర్గమునకు వలయు
ప్రాప్తి యవకాశములు, ఆర్థికోత్పత్తి, వినిమయపు వసతులు తప్పక
లభింపవలయును. ప్రణాళికా రచయితల లక్ష్యములందిట్టి వన్నియు

వుండవలయును. పరిశీలించిన విషయములను స్వీయయత్నముచేసి కూర్చుకొనునటుల ప్రజలకే ఆ బాధ్యత విడిచి వేయదగును. అప్పుడు మాత్రమే ప్రజలకు తమ స్వతంత్రేచ్ఛను వినియోగించుకొనుటకు దగిన అవకాశము లభించును; అప్పుడు వారి జీవితములు, కేవలము ఉనికిమాత్ర మైపోకుండ వారి యిచ్ఛానుసారము కొంత ప్రయోజకరమైనవిగ కూర్చుకొనుటకు వీలుండును. అందుమూలాన సుస్థిరమగు ఫలితార్థముగా ఒకసంస్కృతి యేర్పడును; మానవజాతి అభ్యుదయమునకు విస్పష్టమగు ప్రోత్సాహము లభింపగలదు.

మానవజీవి యేర్పుకొనిన విధానము తనతోడి జీవుల స్వామ్యములను భంగపఱచనంతవరకు, తన యిష్టమువచ్చిన జీవనవిధానము నేర్పుకొనుచో వాని స్వామ్యముల నెవరును అడ్డపెట్ట తగదు.

ఒక మానవుడు ఏర్పుకొను విధానము వానితోడి జీవుల స్వామ్యములకు హానికరమైనది కానంతవఱకును, తన యిష్టమువచ్చిన జీవన విధానమును ఏర్పుకొనువాని స్వామ్యమునకు, ఏ జీవిత ప్రణాళికయు అడ్డుతగులరాదు. ఆజీవనప్రణాళిక ప్రతివ్యక్తికిని కనీసము మానవుడుగా తన కవసరమగు దానినెల్ల పొందుటకు నిరాఘాటముగ తోడ్పడునదై యుండవలయును. అవసరములకు మించిన విషయముల సందర్భమున ప్రతివ్యక్తికిని తన విశిష్టప్రతిభను ప్రకటింపగల్గు జీవన ప్రయోజనముల గుఱించి తన స్వీయభావముల ననుసరించుటకుదగిన అవకాశము లభింపవలయును. అట్టి అవకాశము నంగీకరించనంత కఠినముగా నుండునట్టియు, జీవనప్రయోజనములగూర్చిన వ్యక్తిభావములను ప్రకటించుటకుగాని, వాని ననుసరించి వర్తించుటకుగాని, స్వేచ్ఛనంగీకరించనట్టియు ఏజీవనప్రణాళికయైనను, చట్టులారిపోయిన పటాలపు శిక్షణవలె దోషపూరితమైనదే యనందగును. పటాలశిక్ష

ణామువంటి కఠినవిధానము మానవజీవిని, వ్యక్తిత్వహీనునిగా చేసి చేసి, యేమాత్రపుమార్పు చేసికొనుటకును వసతిలేని యంత్రమందలి పండ్లచక్రముయొక్క స్థితివంటి పారతంత్ర్యదశకు పడవేయును. పుట్టి నదిమొదలు చచ్చువఱకును సంకుచితదృష్టితోడి కఠినశిక్షణము నంది రికించి పట్టుకొను శిక్షణవిధానమునందు ఇతరయోగ్యతలెన్ని యున్నను, లేక అదెంతటిపటిష్ఠమైనదైనను, మానవాభ్యుదయమున కవసరమగు ప్రాథమిక నియమమునకే, అనగా స్వీయవ్యక్తి ప్రభావమును ప్రకటించు స్వాతంత్ర్యమునకే చేటుతెచ్చునుగాన వ్యర్థగా హాస్యమై నదగును.

మన గమ్యము వ్యక్తిత్వ వికాసమై పరుగుటమాత్రముగా ఏపటాలములోనో, ఫ్యాక్టరీలోనో వాంఛితమై యుండురీతిని సమష్టి కార్యనిర్వహణముపట్ల పటాలశిక్షణమునకు ఉచితస్థానమును ప్రయోజనమును నుండును. అటువంటివాని సందర్భమున వ్యక్తియొక్క అభ్యుదయమునకు మించి, అతడు తన తలతోడను చేతితోడను చేయగల పనికి అధికప్రాధాన్యత యుండును. అటువంటి సందర్భములయందు వ్యక్తితన స్వీయప్రయోజనములను సమష్టిప్రయోజనములందు అంతర్భూతము చేయవలసియుండును. సమష్టిగమ్యమును మించిన మహాత్ప్రయోజనమేదియు అందు విచారణయోగ్యముకాదు. ‘సమష్టి’ ప్రయోజనము సాధించుటలో ‘వ్యక్తి’ ఉపకరణమాత్ర మగును. మనకో, వ్యక్తి ప్రభావవిలసనమే పరమలక్ష్యమై, ‘వ్యవస్థ’ అను నది ఆ లక్ష్యసాధనకొరక అవకాశక్షేత్రమై పరుగుగాన, మన జీవన ప్రణాళికయందు పటాలశిక్షణమునకు తావుండజాలదు.

ఉదాహరణకుచూడుడు:—చక్కగ సాకనబడు క్షీరశాలయందు, పశువులను జాగ్రత్తగా మేపుదురు. శ్రద్ధగా సిద్ధముచేసిన దాణా పెట్టుదురు; సకాలమున కొల్లప్రకారము నీరు ఉప్పు వేయుదురు; ఆ

రోగ్యప్రదమగు శాలలో కట్టివేయబడును; కొంతసేపు మైదానములో వ్యాయామమునకొఱకు త్రిప్పబడును. పశువులు కుడుచు ప్రతి దినము సక్రమముగ తోముదురు. కాలనిర్ణయము ననుసరించి పాలు పితుకుదురు. కేవలము, పశువులవలె 'ఉనికి' కొరకు బ్రతుకుటకంటె 'జీవింప' కాంక్షించు మానవులకు, ఇటువంటి పోషణము అవసరము లేదు. సవ్యముగా పాలింపబడు చెఱసాలయందు 'ఉనికి'కి యోగ్యమగు వసతులన్నియు సమకూరియుండును. ఖైదీలయొక్క ఆరోగ్యమునకు భంగకరమగు కారణముచేత, సకాలమున ఖైదీలు నిద్ర, ఆహారము, విశ్రాంతి, తీసికొనవలెనను చెఱసాలనియమముల ననుసరించి నేరముగకూడ నెంచబడుచున్నది. ఖైదీల శరీరమునుగూర్చి ఎంతటి శ్రద్ధతీసికొనబడుచున్నదో చూడుడు! ఐనను ఇచ్ఛానువర్తనమునకును ఐచ్ఛికప్రవృత్తికిని అవకాశములు తొలగింపబడు కారణమున అది 'జీవనమే' కాజాలదు; కేవలము 'ఉనికి' మాత్రమే! ఇటులనే అన్నివైపులను దాటరాని నిబంధనల నేర్పఱచి జీవితమును ఖైదు బ్రతుకుగ మార్చివేయు ప్రణాళిక యేదియైనను, నిషిద్ధమే. అది మొక్కకు అలవ వంటిదిగ మాత్రము ఉపకరింపవలయును. అక్రమముగ జొరబడివచ్చి మేసిపోవు పశువులనుండి మొక్కను సంరక్షించుటకేర్పడిన అలవ వలె నుపకరించవలయునే గాని, ఆ ప్రణాళికయే ఆటంకముల గల్పించి, గాలి, వెలుతురు ధారాళముగ రానీయక, అడ్డు నిలువదగదు. ఈ ధామవాసులు తమతమ నవ్యరచనా సమర్థతలను తోడిజీవులకు సేవలుచేయుకొరకే అంకితముచేసి, మానవ స్వేచ్ఛాజీవన ప్రణాళికలను నిర్మించు నిమిత్తమై వినియోగము చేయవలసి యుందురు.

ఈ ప్రణాళికయొక్క విధానము, ఆచరణక్షేత్రము నెట్లుండునో మాత్రము యిచ్చట విచారించియున్నాము. పై అధ్యాయములలో,

సంతృప్తికరమై ఈ ప్రణాళికా వ్యవహారముగ నుండవలసిన వివిధ ప్రమా
ణముల విచారణకు పూనుకొందుముగాక.

ఉపసంహారము :—నిర్వహణము నేటి సాంకేతికశాస్త్రమునకు చెందినది.
ఇందు పశువులకు ప్రధానస్థానము లేదు, వ్యక్తిస్వాతంత్ర్యములు వేరు
కట్టు త్రెంచుకొందురు. విధులే జీవనముపైని శాసనాధికారము జరుపు
చుండును. స్వాతంత్ర్యేచ్ఛ యనునది నశించిన పర్యాయమును వాని శారీరక
స్వార్థచింతలను నియమితముగా కొలదిని సముచితమార్గములలో బెట్టి
నడపును. వాని ప్రయోజన ప్రమాణములు, వానిస్వాంతభోగములను
గాక, ఇతరులక్షేమమునే హెచ్చుగ పాటించురీతిని తగిన విధానము
కూర్చబడి యుండును. ఇట తాత్కాలికపు వ్యక్తిలాభము వాంఛి
తార్థముకాదు. కావున, లక్ష్యము సారమును, సువిశాలమునై
గోచరించును.

కాబట్టి యీ శాసమలోని వ్యక్తికల్పనా చతురుడై యుండ
గోరుగాన, ఏదేని సంస్కారణముగాని ప్రణాళికముగాని సూచించుటకు
పూర్వము తన యందలి లోపములను సంఘముయొక్క అవసరము
లను, విస్పష్టముగా గ్రహించుట ముఖ్యము. కేవలము బుద్ధిచాకచక్య
ముతో నాక్షేపించుటగాని, అభినందించుటగాని కార్య కుశలత
కాజాలదు. అందుకు పరిమిత క్షేత్రమున ప్రయోగములు చేయు
కొనుటకు అర్హమగు పరిశోధనాగార ముండవలయును. అందు సుని
శ్చితమగు ఆచరణోపాయమని తేల్చిన దానిని మాత్రమే వేర్వేఱు
రకములగు ఆహారపదార్థములతో గినీపందులనుగాని, తెల్లయెలుక
లనుగాని, పావురములు కోతులు మున్నగు వానిని గాని పెంచి,
ఆయాజంతువులపైని జరిపిన ప్రయోగముల ఫలితములను గ్రంథ
స్థముచేయును. ఆపిమ్మట నరజీవులకు సరిపడు ఆహారమునందుండ
దగిన ఆయాయంశముల నిశదు నిర్ణయించి తెలుపగల సమర్థుడు

కాగల్గును. అదేరీతిన సమస్తమయిన సాంఘిక పరిపోషణ సంస్కరణములందును, క్రొత్తక్రొత్త యూహాలను ప్రజలకు గలిపి, పరిశోధనలు గావించు టెంతయు అవసరమగును. కాబట్టి యీ ధామము నందలి వారు పద్ధతికముగా గినీపందులవలెను శాస్త్రపరిశోధకుల వలెను గూడ నుపకరింప వలసియుందురు.

వెనుకటి ధామమువారు ప్రజాసామాన్యము కొఱకై ప్రణాళికా రచనల గావింతురు. కాని ప్రణాళికా రచనయను కార్యము బాగుగ పరిశోధించిన సూత్రములపై ఆధారపడి సాగవలయును. ఆవిధముగా దివ్యధామమునకు అనుకూలమగు క్షేత్రమమర గలదు. "అవసరమనునది నూతనకల్పనలకు తల్లి" అనెడు సామెతగలదు. ఇతరుల యవసరములను మనయందారోపణ చేసికొని చూడగల్గునెడలను, మఱియు మనయందు కల్పనాసమర్థత నెలకొనియుండునేని, ఆ యవసరముల సమస్యను పరిష్కారము చేయుట కనుకూలించు విధానములను, సాధనలను సమకూర్ప జాలుదుము. ఈధామమునకు చెందినవ్యక్తి ఇతరుల జీవితములతో ఐక్యానుభూతిబడసి జీవించుటయు, బాధపడుటయు ఘటిల్లును. అట్టివాడు తన భావములను తన పరిస్థితులను కంటె ఇతరుల భావములను పరిస్థితులను హెచ్చుగ పాటించి ప్రవర్తించుచుండును. అతడు విలపించువారితో చేరి విలపించును, ఆనందించు వారితో చేరి ఆనందించును. అట్టివాని ప్రయోజన ప్రమాణము విశ్వము నావరించి యుండును. అతనికి స్వంతమగు హక్కులనునవియే స్ఫురింపవు మానవ కోటినంతటిని తన కుటుంబముగ పాటించి, నిస్సహాయులను దిక్కులేని వారిని రక్షించుచు, పోషించుచు తనజనకత్వమునకు ధన్యత చేకూర్చుకొనును.

శాస్త్రపరిశోధనా చరిత్రయందు, తమ పరిశోధనా ఫలితములను స్వయముగ తమయందు చేసికొనిన ప్రయోగములబట్టి నిర్ణ

యుంతురు. అట్టి ప్రయత్నములు సాగించిన నిదర్శనము లనేకములు కలవు. అనేకులు తమ ప్రాణముల సహాయశక్తితో నెట్టుకొనుచున్నారు; అనేకులట్టి కార్యక్రమమున ప్రాణముల పోగొట్టుకొనిరి కూడను. వీరలే ఆత్మార్పణ గావించిన ధీరులు; వారి పవిత్ర రక్తధారల తోడనే మానవాభ్యుదయము పరిపోషణ గాంచుచున్నది. మన దేశములోని కోట్లకొలది జనములకు గాలినుండి, వాననుండి తల దాచుకొనుటకై నీడదొరకుటయుండ, తమ దిగంబరత్వమును కప్పి పెట్టుకొనుటకైన తగిన శుభ్రమగు గుడ్డపీలికలైనను దొరకుట లేదు. ఆదశంగూర్చి సానుతాపమునంది, వారితోడ నైక్యానుభూతినిపొంది, తదనుగుణముగ జీవింప గాంక్షించుటవలననే, గాంధీజీ కొల్లాయిగుడ్డను మాత్రమే తన పూర్ణ వస్త్రధారణగా నిర్ణయించుకొనుటకు ప్రధాన హేతువయ్యెను.

సాంఘికములును, ఆర్థికములు నగు క్లిష్టసమస్యలతో నిండి యున్న మనదేశమువంటి దేశమునందు, సామాన్య ప్రజల దారిద్ర్యమును, బాధలను, ప్రతిబంధకములను తమమీదికి తీసికొని, తమ చుట్టునున్నవారి దుఃఖములను తాము స్వయముగ ననుభవించుచు, వానికి దగిన పరిహారములను గనిపట్ట పూనుకొనునట్టి పురుషవరులెందఱో కావలసియున్నారు. ఆ యుద్దేశ్యముతోడనే రవీంద్ర ఠాకూరుగారి శాంతినికేతనము, గాంధీగారి చర్ఖాసంఘము, గ్రామోద్యోగసంఘము వను సంస్థలబోలు నరజీవన పరిశోధనాగారములు, ఆశ్రమములు మొదలగునవి, నెలకొలుపబడియున్నవి. నిగ్గుతేరినట్టియు బాగుగ పరిశోధించినట్టియు విత్తనములను సిద్ధముచేసి వానిని దేశమునందలి తోటలవారికి సరఫరాచేయుకొఱకు ఆరామకృషికుడు పెంచు నారుమడులవలె ఉపకరించుటకే ఈ ప్రతిష్ఠాపన లేర్పడినవి.

ఈ పరిశోధనక్షేత్రమునందు నిర్దేశింపబడిన పరిహారములు విశాలవు ప్రపంచోపయోగకరమనిమాత్రమై ప్రకటింపబడుచున్నవి.

వ్యష్టి విద్యావిధానము ద్వారముననే, మానవజాతిని బాధించుచున్న హింసాద్వేషముల పీడలనుండి విముక్తిని సాధింపగల్గుదుము. జన సామాన్య జీవనమును నియమబద్ధము చేసి, కట్టుబాటులో నడుపుటకు, వ్యక్తిస్వాతంత్ర్యమనెడు సూత్రముపై నాధారపడు వ్యష్టి ప్రయోజనదృష్టి చాలదు. కాని అటుల చేయుటకు స్వార్థరహిత మును నిస్సంగమును మరియు సుదీర్ఘమునగు దృష్టియే సమర్థ మగును. అట్టివిధాన మేర్పడినపుడు సంఘమందలి ప్రతి వ్యక్తియు, అతడెంతటి అల్పదశలోనివాడైనను కూడ, సమష్టిని ఎల్లరి క్షేమము కొఱకును తనవంతు సహకారముచేయు నవకాశము లుండును. వాని జీవితము వివిధరీతులనుండు పరిస్థితుల సరకుగొనని కేవలానుకరణము కాజాలదు. కొలదిపాటి స్థానికావసరముల కనుగుణముగా మార్పు చేయబడు క్షుద్రావలంబనము కాదు; ఆయావస్తువుల ఉత్పత్తి చేయువారలకు లాభముల చేకూర్చిపెట్టుటకై యెప్పటికప్పుడు వ్యాప్తిగాంచుచుండు విక్రయక్షేత్రములందలి వ్యాపారమును కాదు; మరియు విశాలతరబాధ్యతలను విస్మరించి, ప్రత్యేకవర్గముల వారి యవసరముల దీర్చునట్టి వ్యవహారమును కాదు. పైరీతిని నిర్మాణము చేయబడిన జీవనప్రణాళిక వ్యక్తులయు, వర్గములయు నవసరముల దీర్చలేగాక, తోడివారల క్షేమమునకు భంగకరముకాని తెరగున, ఎల్లరి సుఖసౌఖ్యముల చేకూర్చునదిగను, మఱియు వ్యక్తి వికాసము నకును, వ్యక్తిప్రభావమునకును గూడ చక్కని యవకాశ మొసగు నదిగను వెలయగలదు.

# అధ్యాయము 11

## జీవనప్రమాణములు

వెనుకటి అధ్యాయమున వివరించిన కారణములబట్టి, పైనందిన ప్రజాజీవనము, వారివారి వ్యక్తిత్వమును ప్రకటించుకొనుటకవకాశ మొసగజాలునదిగను, నియమబద్ధము చేయునదిగను నుండుటెంతయు అవసరము. మనమేమి తిందుమో, మనమేమి ధరింతుమో, మన మేతీరున జీవితముల గడుపుదుమో, మున్నగు విషయము లన్నియు కేవలము మన జీవనసరళికి సంబంధించియుండునవే కావు. అవి మానవకోటియొక్క భావిభాగ్యోదయముపైన గూడ తమ ప్రభావమును జూపునవై యున్నవి. ఏలయన ప్రతి వ్యక్తియు తానవలంబించు ప్రయోజనదృష్టి ద్వారమున తాను జీవనవికాసమును బడయుటే గాక, తానవలంబించు జీవనరీతుల ననుసరించి తన వ్యక్తిత్వమును సహితము ప్రకాశింపజేయుచుండును. అట్లు ప్రకటించుటకు, ప్రజలందఱికిని వారివారి లక్ష్యార్థము లుండవలయును; వానిని వారంటిపట్టుకొని యుండవలయును. ఈ లక్ష్యార్థములు కేవలము భౌతిక దృష్టితో నేర్పరచుకొనినవిగనే యుండవలయును; ప్రతి వ్యక్తియు తనసమర్థతలను వృద్ధిపరచుకొనుటకును, తద్వారా తనవ్యక్తిత్వమును వికసింపజేసికొనుటకును సంపూర్ణమగు అవకాశము లుండవలయును. ఈ లక్ష్యార్థములుగాని లేక జీవనప్రమాణములుగాని కేవల శారీరక భౌతికావసరములకు సంబంధించినవిగా మాత్ర మున్నను, చాలదు. వాని యందనేకాంశములు ఇమిడియుండును. ఆయంశములన్నియు జీవితము కేవలము 'ఉనికి' మాత్రముగ చేసివేయక, ఉన్నతస్థాయికి దీసికొనిపోయి, మహానీయమైన దానిగ చేయ నుపకరించునవిగ నుండవలయును. మానవప్రకృతి నొక స్థాయిలో నిలు

పుట కవసరమగు ఆహారసమస్య సహజముగ వచ్చును; ఉచితమగు వైద్యసాహాయ్యముండవలయును; కేవలము నగ్నశరీరమును కప్పి యుంచుటకే గాక, అందచందముల దృష్టిని తృప్తిపఱచునదగు వస్త్ర ధారణ మవసరమే. జీవితమును విశాలపఱచి తేజోవంతము చేయ జాలు విద్య కావలయును; ఆవిద్యావిధానము నైజశక్తులను బలపఱచి వ్యాయామ పనిపాటుల కనుకూలించి, నదు నందలి కల్పనాకౌశలము నకు ప్రోత్సాహోన్నతుల చేకూర్చునదిగా నుండవలయును. ఇంతేల? వ్యక్తియొక్కయు, సమష్టియొక్కయు అభ్యుదయమును చేకూర్చు వసతులన్నింటితో నొప్పినదై యుండును.

ఇటువంటి యవసరముల నన్నింటిని తీర్పజాలు జీవనప్రమాణము స్వతస్సిద్ధముగా వ్యక్తికిని సంఘమునకును గూడ అంగీకార యోగ్యముగ నుండగలదు. ఏదేనియొక సంకుచిత దృక్పథమునుండి దానిని నిర్ణయించుకొనుటకు వలనుపడదు. ఏలాటి నియమ నిరోధ ములును లేకుండ, తన యిచ్ఛానుసారము వ్యక్తిని నడువనిచ్చి, అతడు అనుకరణధామములోనో, పరావలంబనధామములోనో చేరిపోవుట నంగీకరించితిమేని, అతడు సమాజాభ్యుదయమున కెంతమాత్రమును తోడ్పడబోడు; మఱియు అపకారము చేయగలడు. అతడు భౌతిక సృష్టిధామములో చేరిపోయెనా వాని కల్పనలు ఇతరుల క్షేమమున కడ్డుదగులనగును; సమష్టి అభ్యుదయమునకు అవరోధ మేర్పడ దగును. ఒక ఉత్పత్తిదారుని వాని కుతంత్రముల ననుసరించి పోనిచ్చు నెడల, విభ్రాంతి గొలుపు ప్రకటనలతో తనసరకుల నమ్ముకొను యుక్తులపన్నుచు, తన వ్యాపారవృద్ధి కనుకూలించు అందచందాలను, సొగసులను వ్యాపకము చేయును. ఇదిసరిగాదని సమష్టిసమాజమునకే సర్వాధికారమొసగు నెడల, వ్యక్తి పతితుడై నలిగిపోవును; నోరుమెదప

వీలులేని వస్తువై పోవలసియుండును. నేడు నానాస్వజనుని గతి, కాపిట లిజము, యింపీరియలిజము, ఫాసిజము, నాజీజము, స్టేటుసోషలిజము అనెడు విధానముల క్రింద ఘోరమైపోయినది. నేడు ప్రపంచమంతయు ఉత్పత్తిదారుని కాలిక్రిందపడి నలిగిపోవుచున్నది. ప్రజలు అతడాడు మన్నపట్టుల నాడవలసినదే; అతడు పాడుమనినపట్టుల పాడవలసినదే! ఇదంతయు ఎనలేని గందరగోళమును తెచ్చిపెట్టినది. ఈ స్వార్థపరు లగు ఉత్పత్తిదారులకు సంయుతము సమష్టిని అంగీకృతమగునేయొక్క ప్రణాళికయు లేదు. వారు దర్శించు జీవనలక్ష్యమునకు త్రోవ, తెన్ను లేదు. ప్రతిఉత్పత్తిదారుడును తన యాశాతంత్రము ననుసరించి వస్తువులు నెట్టుచున్నాడు. తత్ఫలితముగ జీవనవిధానమునందు ఏమొన నను కలవరమే; కల్లోలమే!

ప్రజలు 'జీవనప్రమాణములని' పేర్కొనునప్పుడు, వారి భావ మేమో గ్రహించుట కష్టముగ నున్నది తమ మాట సుస్పష్టము కాకుండుటే వారికి సంతోషము కూడను. కాబట్టి ఒక నిశ్చితార్థము నకు కట్టుబడకుండ నిర్భయముగా ఈ పదప్రయోగమును గావించుట వారికి చాలవీలుగా నుండును. 'జీవనప్రమాణము'న నేమిటో, అందలి యంశము లేమిటో యిప్పుడు ప్రతివాడును తన యిచ్ఛానుసారము భావనచేసికో వచ్చును. ఒకనిదృష్టిలో రేడియోసెట్టు, మోటారు కారు కేవలము అవసర వస్తువులగును. మఱొకనికి రెండు పూటల అన్నము దొఱికిన చాలును; అదివానికి భోగమే! కాబట్టి మన దేశ స్థితి ననుసరించి, ఒక నిర్దిష్టప్రమాణమును మనము నిర్ధారణచేసి కొనుట మనకవసరము. ఈ ప్రమాణమునకు ఆర్థికస్థితి ఆధారమా? లేకసంస్కృతి ప్రధానమా? లేక సాంఘికావసరములా? "నివాసో న్నత" ప్రమాణములన అర్థమేమి? లౌకికభోగముల విరివిగ

ననుభవించి తృప్తినొందుట 'ఉన్నత' ప్రమాణమును, వస్తుసామాగ్రిని చాలమితముగ గలిగియుండుట 'నిమ్న' ప్రమాణములని చెప్పు కొందమా ?

జీవితప్రమాణమును నిర్ణయించుటకు గల వివిధదృక్పథములను, భిన్నభిన్న ప్రయోజన ప్రమాణములను వెనుకటి అధ్యాయములలో విచారించితిమి. సద్యస్కాలమున ఘనముగ నెంచు డబ్బును మాత్ర మాధారము చేసికొని, జీవితముయొక్క మూల్యమును నిర్ణయింప దగదని శాశ్వతత్వమునకును, అహింసా వర్తనమునకును దారితీయు ఆర్థికసామ్యావస్థ కావలయుననుచో, సుశీలాధారములు గల వివిధజీవితాంశముల సమగ్రవిచారణ సలుపవలసి యుండుననియు గ్రహించితిమి. అటువంటి ఆర్థికవ్యవస్థయందు, డబ్బునకు ప్రాధాన్యత చాలతక్కువ. "మానవ జీవితమున కవసరమగునది తిండి యొక్కటియె కాదు" శరీర మానసాత్మలతోగూడిన పూర్ణనరుని స్వేచ్ఛావిలసనమున కవకాశము నొసగు సర్వమును వాని కవసరమే. ఆ సర్వము చేకూరినప్పుడే వానికి పూర్ణతసిద్ధించిన దందుము.

ఇంగ్లాండునందలి జీవనప్రమాణము చాల ఉన్నతమైన దని సామాన్యముగ చెప్పుకొందురు. అచ్చటి ఆరామాధికారి మిద్దెపైన మూడునాలుగు పడకగదులును, అక్కడనే పాకీదొడ్డి, స్నానాల గదియు అమరియుండు, రెండంతస్తుల 'కుటీరము' లో నివసించుచుండవచ్చును. మేడక్రింద కాపురముండు గదియొకటి, భోజనాల గది యొకటి, మఱియు సంభారములగది, బట్టలుతుకుకొను గదియు నుండును. కిటికీ లన్నింటికిని అద్దాలమడతతలుపులు, వానిపై తెరలు, మూతలు నుండును. తలుపులమీద పెద్ద తెరలు వ్రేలాడుచుండి గాలి దుమారములను చొరనీయకుండును. నేలమీద తివాచీలు

పఱతురు. గోడలకు సొగసగు కాగితము అంటింతురు. ప్రతి గది లోను సకలమును, చౌకగా ...జనవియు నైనను అనువగు సామగ్రి చాలినంత అమర్చబడి యుండును. ఉదాహరణకు భోజ నాగారములో ఒక భోజనపుబల్ల, దానిచుట్టు చేతులు లేని కుర్చీలు, మూపుటద్దము పెట్టిన ప్రక్కబల్ల యొకటి సొగసగు ఆచ్ఛాదనము. కత్తులు, గరిటెలు, అమర్చురు. ఆ యాడంబరము లేకున్నను, భోజనపు బల్లపైన సమపాయములన్నియు చేకురునట్లు గిన్నెలు, పళ్ళెరములు, ముళ్ళగరిటెలు, సాదాగరిటెలు రకరకముల సూపములు, చేపలు మాంసము, మిఠాయి, పండ్లు మున్నగువానిని నారగించుట కవసర మగు నుపకరణముల నెల్ల నమర్చిపెట్టి యుంతురు. ఒకరీతి తినుబండా రమును భుజించుట కుపయోగపడు ఉపకరణములతో, వేఱొకరీతి తినుబండారమును భుజించుట అక్కడ సదాచారముగాదు. చేపల కుపయోగించు ముళ్ళగరిటె, కత్తి, యొకరకముగాను, మాంసము తీసికొనుట కుపయోగించు ముళ్ళగరిటె, కత్తి వేఱొక రకముగాను, ఇంకొకతీరు భోజ్యమున కుపయోగించునవి యింకను భిన్నమయినవి గాను నుండు టాచారము. ఒక పురుషుడు భోజనమునకు కూర్చుండి లేచిన పిమ్మట ఏబది యుపకరణములను కడుగవలసి వచ్చును. అక్కడ ఆచారముగా నంగీకారముబడసిన " ఉన్నత " జీవనమర్యాద సాధారణముగా నిట్లుండును.

భారతదేశములో, యథార్థమగు సభ్యపురుషు డొకడు, కోట్లాది ప్రజల బాగోగులకు బాధ్యుడగు నొక సంస్థానపు దివానో లేక ప్రధానామాత్యుడో యగుగాక, వాని గృహము పెద్ద రాజప్రాసాదముం బోలునదైనను, అందలి సామగ్రి కొలదిపాటిగా నుండును. వాని అతిథిశాల చలువరాళ్ళతో పఱచబడియుండవచ్చును. లేదా చిత్రవర్ణ సంశోభితమైన శిలాఫలకములతోడనో లేక ఇటికల

తోడనో పంచబడి, తడిసి శుభ్రము చేయుటకు అనుకూలముగా నుండును. సామాన్యముగా దుమ్ము దుసూరము పేరుకొనుటకు తివాచీలుండవు. ఆ దివాను పాదరక్షలులేని కాళ్ళతో స్వగృహమున దిరుగాడును; దక్షిణ దేశమున నెందరెందరో ఘనపురుషు లిటులనే చరింతురు.



రెండుతీరుల భోజనపు టాచారములు

మన దివాను నేలపైపఱచిన ఆసనముమీద కూర్చుండి, యే యరటి యాకులోనో భోజన పదార్థముల వడ్డించగా చేతితో దీసికొని తినును. ముళ్ళగరిటెలు సాదాగరిటెలు చేతబట్టు కళ నతడు నేర్చి యుండకపోవచ్చును. ఆ నేర్పును అసాధారణమా కళయే యందురు కొందరు. ఆ ఆచారసూత్రములు సామాన్య జనులకొఱ కేర్పడినవి కావు. మన దేశపు సభ్యపురుషుడు తనకు ప్రకృతి యొసగిన వ్రేళ్ళను ఉప యోగించుకొనును; భోజనానంతరము విస్తరను కడుగవలసిన పని యుండదు; దాని నావల పాఱవేయుదురు. ఏ మేకయో దానిని దినివేసి, యజమానికి శుభ్రమగు పాలనిచ్చును. ఆయన తన హస్త మును మాత్రము కడిగికొనవలసి యుండును. పాశ్చాత్యాచారమున కిది భిన్నమైనదని తెలుపుకొఱకై దీనిని "నిమ్న" జీవనప్రమాణ మనదగునేమో.

ఇటుల "నిమ్న" "ఉన్నత" అను శబ్దముల ప్రయోగించుట సమంజసమగునా? కృత్రిమముగా కల్పనచేసిన అవసరములను,

అత్యధికముగా పెంచిన సామాన్య ప్రమాణముగ నెంచునెడల, ఈ శబ్దముల ప్రయోగమునకు అర్థముండదుగదా. కాని మనము భిన్నమగు భావమును వహించి మాటకొంటికి మేని, నగరం దంతవ్యాప్తమైయున్న మహోన్నతశక్తులను ప్రకాశమునకు తెచ్చుట వాంఛితార్థ మునకొందుమేని, మన దివాను జీవనము 'ఉన్నత' ప్రమాణము ననుసరించునదనియు, బ్రిటిషు ఆరామాధిపతి జీవనము "నిమ్న" ప్రమాణము గలదనియు చెప్పవలసియుందుము. కాని, సార్థకముల గు విషయముల గమనించు ప్రమాణముల ననుసరించు నెడల, 'ఉన్నతము' 'నిమ్నము' అను పదములకన్న 'సంకీర్ణము' 'సరళము' నను పదముల ప్రయోగించు టెంతయు సమంజసముగ నుండును. అప్పుడు దివాను జీవనప్రమాణము 'సరళ' మయ్యు 'ఉన్నత' మైనదనియు, బ్రిటిషు ఆరామాధిపతి జీవనప్రమాణము 'సంకీర్ణ' మయ్యును 'నిమ్న' మనియు చెప్పవలసి యుండును. వస్తూత్పత్తిదారుల విక్రియక్షేత్రములకు ఆధారమగు 'సంకీర్ణ' ప్రమాణము నెడగల అభిమానము ననుసరించి ఇప్పుడు వాడుకలో నున్న (నిమ్నోన్నత) శబ్దములు ప్రత్యేకముగా కల్పింపబడెనని తోచుచున్నది. 'సంకీర్ణ' మని తమ ప్రమాణమునకు పేరిడుమనిన ఎవరు సమ్మతింపగలరు ?

'సంకీర్ణ' ప్రమాణము తన నాశ్రయించు నతనిని కష్టజీవిని చేసి వేయును. బ్రిటిషు ఆరామాధిపుని భార్య, పరిశుభ్రజీవనము గనుప నెంచునెడల, ప్రొద్దున మొదలు రాత్రివఱకు *'వ్యాక్యూమ్ క్లీనరు' తో తివాచీలను దులుపుచునో, కిటికీ అద్దములకు మెఱుగులిడుచునో, తెర గుడ్డలను, పక్కలమీదను, మేజాలమీదను, పఱచు గుడ్డలను ఉతుకు

* ఒకరీతి దుమ్ము దులుపు యంత్రము.

చునో, గిన్నెలను ప్లేటులను కడుగుచునో, వంటపాత్రలను తోము చునో, అంగడిబేరములు వంటపనులు సవరించుకొనుచునో, బండ చాకిరిలో సదా మునిగియుండవలసినదే. ఒక్క ముళ్ళగరిటెనైనను సరిగా తోముటకు వలయునంతకాలమును, శ్రమయు ఎవరిచేతులను వారు కడుగుకొనుటకు అవసరములు కావు. ఇటువంటి 'సంకీర్ణ' జీవనప్రమాణములు వెలయు దేశములందు, స్త్రీలు బిడ్డలపీడ తప్పించుకో నాతురపడుట యబ్బురమా? ఆలాటి దేశములలో "శిశువులకు శ్వానములకు నిందు తావులేదు" అనెడు ప్రకటనలు గల బల్లలు ఎల్లెడల కండ్లబడుచుండును. దినమెల్ల తీరికలేని కార్యక్రమము మాతృధర్మము నింకను భారముచేసివేయగలదు. వారి 'సంకీర్ణ' ప్రమాణావలంబనము, వారు వారుపాటించు ప్రయోజనప్రమాణము లను బయటపెట్టుచుండును. ప్రచారములు, ప్రకటనలు, అందాల కల్పనలు మొదలగు వివిధోపాయములను, తమ కందుబాటులో నున్నంతవఱకు, వారు ప్రయోగింతురు. గృహిణు లిటువంటి జీవనగతుల నవలంబించి, తమ నభిమానించు కొనుగోలుదారు లౌనటుల, వస్తూత్పత్తిదారులు ఎన్నని ప్రబల ప్రేరేపణలను కల్పింపగల్గుచున్నారు. సుంతయు లాభములేని అవసరములకు దాసు లగావించి వడవేయుచున్నారు. ఈలాటి వలలలో పడకుండ మనము జాగ్రత్త పడవలసి యుండును. అట్టి వానివలన చేకూరు సత్ఫల మేమియు నుండదు. అవివృథాగా అల్పస్వల్ప కార్యకలాపములో మన సమయమునంతను నింపి వమ్ముచేయును. అవి మన జీవన చర్యను బండచాకిరిగ మార్చివేయ గలవు

శ్రమనివారణోపాయము లనుచు ప్రవేశపెట్టి, వానివలన గృహిణులకు చాలతీరిక, సుఖము లభించునను భ్రమలుపెట్టి, స్వార్థపరు లేమేమో ప్రచారములు చేయుదురు. మానవ శ్రమను తొలగింతు

మనము మిషనుతో నొకయంత్రమును నమ్మకముగ ప్రవేశపెట్టుదుము. తోడ్పాటునకే, శ్రమాకాలపన్నుగడ వచ్చినెపదును. ఆ మొదటి పనిమా ముపలన ఆదాచేసికొ గలిగిన కొలదిపాటి ధనమును, కాలమును రెండవపన్నుగడ పరిహరించి వేయును. అప్పటి గృహిణీజీవనము పూర్వదశయందు కంటె రెండవదానంతరమున హెచ్చు అనర్థకరమై పోవును.

నిదర్శనమునకై మనమిత్రుడు బ్రిటీషు ఆగామాధిపుని భార్యస్థితినే విచారింతము. పూర్వపు జంపుకానాలు మనుష్యులే కత్తిరించి, ఉతికి, బాగుచేసి కొనుటకు తగియుండేవి. "వ్యాక్యూముక్లీనరు" యంత్రములు వెలసిన పిమ్మట ప్రత్యేకముగా మానవశ్రమ అవసరము లేకుండ పోయినది. ఒక సంచార విక్రయదారుడు ఆగామాధిపతి భార్యాదర్శనమునకు వచ్చును. తాను విక్రయింపనున్న 'వ్యాక్యూముక్లీనరు'యొక్క అత్యద్భుత ప్రయోజనముల గూర్చి భట్రాజువలె పొగడ్తల సాగించును. తివాచీలు శుభ్రపఱచుట వంటిభారపు పని చేయుటకు సేవకులపెట్టుకొను అవసరము గడచిపోయిన దనును. ఆమె సంవత్సరమున కెంతసొమ్ము నాదాచేయ వచ్చునో, పొదుపు నాశించు నాగృహిణికి గణితమువేసి చూపును. మఱియు ఆమె జీవితకాలములో నెంతపొదుపు చేసికోవచ్చునో వివరించును. ఇంకను వడ్డీక్రింద యీలాభమున కెంత చేర్పవచ్చునో నచ్చచెప్పును. విక్రయదారుడు ప్రయోగించు నీప్రలోభముల కంతకు ఫలముగా ఆగృహిణి ఒక 'వ్యాక్యూముక్లీనరు'ను కొనును. అందుమూలమున సంవత్సరమునకు కొన్ని షిల్లింగులాదాయ మామెకు చేకూరగలదు. 'శ్రమనివారకయంత్రము'ని పేరేగాని, 'వ్యాక్యూముక్లీనరు'తోడి పనంతయు ఆమెయేచేయవలసి వచ్చును. కొలదికాలము పిమ్మట ఆ సంచార విక్రయదారుడు మఱల దర్శన మిచ్చును. ఆమెయొద్ద కొన్నిపౌనుల

ఆదాయము చేకూరుచుండును. ఈసారి తాను క్రొత్తగా కనిపెట్టిన
యింకొక యంత్రము చెప్పును. గిన్నెలను కడుగు ఆ చిత్రసాధన
మును అమ్మజూపును. ఆ యంత్రపటమును అతిశయోక్తులతో వర్ణిం
చును. ఆగృహిణి కూడబెట్టి కొనినడబ్బు వానికీయదలచిన సొమ్మునకు
తక్కువై యుండును. అప్పుడాత డెంతయో ఔదార్యమును, సాను
భూతిని ప్రకటించుచు, వాయిదాలవారీగా సొమ్ము చెల్లించే విధాన
మును దెలుపును. ఈఅరువుకొనుగోలుపద్ధతి, ఆమెకునచ్చును. అంతట
నామె వెంటనే చెల్లించగల సొమ్మునంతటిని చెల్లించును. అతడా
యంత్రమును వాడుకొనుచుండు మనియిచ్చి వేసిపోవును. ఐదేళ్లో,
ఆరేళ్లో, సంవత్సరపు వాయిదాల పద్ధతిని, ఆయంత్రపు అద్దె
క్రింద ఆమె సొమ్ము చెల్లించుచుండ వలయును. పిమ్మట
ఆయంత్రము ఆమె స్వంతమై పోగలదు. ఇట్లా యిల్లాలు వర్తకుని
ప్రలోభముల వలలో పడిపోవును. తాను ముందెన్నడో నిలువ చేసి
కొనగల డబ్బును గిన్నెలకడుగు యంత్రముకొఱకై తాకట్టు పెట్టివేసి
నది. ఏ ముసలమ్మయో వచ్చి, బహుశః, దినమున కొక యరగంట,
సాహాయ్యముచేసి పోవు అవసరము ఆమెకు తీరిపోయినది. యీ
తీరుగా వారానికి రెండు షిల్లింగుల ఆదాయము లభింపనగును.
కాని, ఆయంత్రముతో స్వయముగా పనిచేయు నవసరము ఆమెపై
బడినదే! మఱియు 'వ్యాక్యూముక్లీనరు' కు గాని, గిన్నెల కడుగు
యంత్రమునకుగాని, కొంచెము మరమ్మతు కావలసినయెడల దానిని
సరిచేయు నిమిత్తమామె సంచారశిల్పికి కబురు చేయవలసి యుం
డును. అతడు వచ్చి తాను వినియోగించు కాలమునకై కొంత
డబ్బుతీసికొని, ఆయంత్రమును కొంత సవరించి పోవును. ఈ విధ
ముగా మానవశ్రమను తొలగించు యంత్రముల వాడుకచే ఆదా
చేసిన కాలము, సొమ్ము రెండును ఉత్పత్తిదారుని మూలముననే

వ్యయమైపోవుచుండును. పాపమూ ఆరామాధిపతి భార్య కేవల
సాయముపడుచు వచ్చిన తోడిమానవుల శ్రమను తొలగించుకొని,
తానే గాడిదవలె శ్రమపడవలసి వచ్చినది. యంత్రరూపసేవకులను
సంబాళించుటకిప్పుడు హెచ్చుశ్రమ అవసరమైనది, తనకు దొరికి
పోయినదని యువ్విళ్లూరిన విశ్రాంతి మాయమైపోయినది. అంతయు
భ్రమయని తెలినది. ఆమె యేమి అదాచేసికొనినను, మఱొకటే
దేని "శ్రమనివారకయంత్రము" వచ్చి హరించివేయును. ఆమెకు
వాస్తవముగ లభించిన లాభము సున్న. ఆమెకేదేని వచ్చి యొటి
గెనా? అది గురుతరమగు కార్యభారమే. తనయంత్రములను స్వాయ
ముగ వాడుకచేయు బాధ్యత పైబడినది. ఇక్కడనుండి తరిమివేయ
బడిన మానవశ్రమ నిర్వ్యాపారమున ఉత్పత్తిదారుల కర్మాగారపు
ద్వారమునొద్దజేరి, తుదిని "అన్నమో, రామచంద్రా"! "ఉద్యో
గమో, రామచంద్రా!" అను నినాదములు చేయుట పరిణామము
దాల్చును. ఈ కథాలాపమును ముందుముందింక విచారింతముగాక!

మన ఆరామాధిపతి భార్యయొక్క జీవనప్రమాణము మారి,
ఆమెయొక్క శ్రేష్ఠతరశక్తిరాశి స్వేచ్ఛగా వినియోగపడుట కవకా
శము లామెకు లభించెననగలమా? ఈసంకీర్ణ జీవనప్రమాణమామె
యొక్కయూహాపోహాలకు హెచ్చువసతుల కల్పించెననియందుమా?
లేదు. అందుకుమారుగా, ప్రతిపనియు స్వయముగ, అన్యుల సాహా
య్యము లేకుండ, ఆమెయే చేసికోవలసి వచ్చిన కారణమున, ఏదేని
పత్రికనైనను జదువుకొనుటకు తీఱుబాటు లేకుండ బోయినది. రేయిం
బవళ్ళామె బండచాకిరి చేసికోవలసి వచ్చినది. ఇదంతయు దేని
కొఱకు? వాస్తవికజీవితానుభవమును సంపాదించు కర్మ ఇసుమం
తేని లేకుండనే, ఆమె సమయమంతయు సరిపోవుచున్నదే! ఈ బ్రతు

కునకు 'యథార్థజీవన' మని యర్థము చెప్పగలము! కేవలపు 'ఉనికి' కంటెను నికృష్టమైనదేయిది!

సరళజీవనమో దీనికి భిన్నమైనదైనను "ఉన్నత" మైనదన వచ్చును. మానవ జీవనమునందలి యుత్తమ లక్షణములన్నియు అందు నెలకొనియుండును. బహుశః అన్యులచే నిర్ణయింపబడినబాటలలో నడువజేసి, వ్యక్తిత్వము మారణముచేయు 'సంకీర్ణ' జీవనము కన్న శ్రేష్టతరమనియే చెప్పవచ్చును.

భోజనసందర్భమే విచారింతము. ఏ ఆహారమైనను పాశ్చాత్య పద్ధతిని తీసికొనినను భారతీయపద్ధతిని తీసికొనినను పుష్టి నొసగుటలో భేదముండదు. భారతీయపద్ధతి చౌక. మరియు పరిశుభ్రమైనది. వడ్డన చేయుటలో కధావిన్యాసమున కవకాశము గలదు. తాజా పచ్చని విస్తరిలో వడ్డనచేయుటను మించిన రమ్యమగు దృశ్యమేది యుండగలదు? ధవళమౌ వెన్నముబోలు అన్నము లేక రొట్టె, పసుపువన్నె పప్పు, తెల్లని పెరుగు, ఎఱ్ఱని పచ్చడి, ఉదారంగు ఊరుగాయ, మఱియు రంగురంగులకాయగూరలు, ఎఱ్ఱని రామ ములగలు, ఇట్లెన్నియో చూడ ముచ్చట గొలుపును. భోజనము ముగిసిన పిమ్మట విస్తళ్ళు ఎత్తివేయుదురు. నేలను చక్కగ కడుగుదురు. విందారగించువారో వ్రేళ్ళతో భుజించి, అనంతరము పండ్లు తోముకుందురు. నోట పుక్కిలించి కడుగుకొందురు. ఇదెంతయో హృద్యమును, ఆరోగ్యప్రదమునగు నాచారము. కాని ఇట్టి చక్కని ఆచారమును విసర్జించి కొందరు ముళ్ళగరిటెలను, చంచాలను వాడసాగినారు. ఈ యాచారావలంబులం గాంచుడు, తమ వ్రేళ్ళకొనలను సొగసుగా నీటిపళ్ళెరములో ముంచి, పెదవులను మాత్రము తడిచేసి, తుండు గుడ్డతో తుడిచికొందురు. అదే చాలవిశేషము. ఈ 'సంకీర్ణా' చారమును అవలంబించువారి ఘనతగాని, యోగ్యతగాని యెందు

న్నదో తెలియును. సంకీర్ణ జీవనమర్యాదలు హెచ్చు వ్యయకారణ ములేగాని, అందుకు దగిన ఆరోగ్యలాభముగాని, కళావిశేషము గాని లభింపవు. కాబట్టి లోగడ తెలిపినబులపాశ్చాత్య మర్యాదను, 'సంకీర్ణ' మనియు, మన మర్యాదను 'సరళ' మనియు వర్ణించుట, కాసిని 'ఉన్నతము' 'నిమ్నము' అని వర్ణించుటకంటె మిగుల సమంజసముగా నుండును.

గుణభేదమును గుర్తించుచో, ఒకే పరిమాణమునందే 'ఉన్న తము' 'నిమ్నము' అని చెప్పకోదగిన జీవనపరిమాణములు గోచ రించగలవు. ముతక బట్టలను కట్టుకొని తృప్తినొందువానికంటె, సన్నని ధోవతిని ధరించు పురుషుడు 'ఉన్నత' పరిమాణము నవలంబించు వాడనదగును. మఱియు పాశ్చాత్యుల అందాలు ననుసరించి కత్తిరిం పులుచేసి, కుట్టుకోట్లను, మెడపట్టిని, మెడముడిని, బహుశః టోపీని సహితము ధరించు నరుడు, ఆ కారణముచేత, ఒకధోవతి కుడ్తాను వేసికొనువానికంటె 'ఉన్నత' పరిమాణముగలవాడనిపించుకొన జాలడు. టోపీని ధరించు పురుషుడు సంకీర్ణపరిమాణము ననుకరించు వాడు కాగా, ధోవతి ధరించు మనుజునందు హెచ్చు కళాచాతు ర్యముగల దెంచవచ్చును.

వాని ధోవతి అందమునందు పాంతీయుల భావము ననుసరించి సొంపుగ నేయబడినదై, అచ్చటి శీతోష్ణస్థితికి, అనుకూలముగా నుండును. ఇదేతీరున తుష్టిని పుష్టిని నొసగు ఆహారమును దినువాని కన్న, ఊరుగాయతోనో, ఎఱ్ఱగారపు పచ్చడితోనో అన్నము దిను వాడు 'నిమ్న' దశనున్నవాడని తోచవచ్చును.

పరాన్నపరిపోషణమునకో, లేక స్త్రీయపరిపోషణమునకో చెందిన యొకని జీవనము, ఉపకారపరిపోషణమునకు చెందినవాని జీవనము కన్న తప్పక "నిమ్న" మైన దనవలయును. దేశోపకార పరాయణు

దైన యొక కళ్ళిమవాసియొక్క జీవనప్రమాణముతోడ పోల్చి చూచినయెడల, ఎంత వ్యయముతో కూడినదైనను లక్షాధికారి జీవనప్రమాణము నిమ్నమైనదే సుడీ!

ఎంత గొప్పగా చెప్పుకొన్నను సాహసపరిపోషణ విధానమునకు చెందిన బ్రిటీషు ఆరామాధికారికంటె, సమూహపరిపోషణకు చెందిన వాడు, వాని భౌతిక జీవనవిధాన మెటువంటిదైన నగుగాక, హెచ్చు ప్రమాణమే కలవాడే యననగు. భారతీయ దివానుయొక్క జీవనమును గూర్చి, వెనుకటి ఉదాహరణలో వివరముగ చెప్పుకొని యుంటిమి.

పోటీపడుచు, సంకీర్ణతను వృద్ధిచేయుచు, అటుల చేయుటలో మానవప్రమాణమును అధోగతికి ద్రోయుటయే, నవనాగరిక జీవనమున పరిపాటియై సాగుచున్నది.

అమెరికాలో, కృత్రిమపు జీవితాదర్శములను ప్రచారము గావించుట మూలమున, గృహస్థజీవనము వేవేగము శిథిలమైపోవుచున్నది. ఒకటిరెండు గదులుగల డాబాయింటిలో, "శ్రమనివారకోపకరణము"ల బెట్టుకొని భార్యాభర్తలిద్దరు కాపురముందు రనుకొనుడు. భర్త ఉదయముననే లేచి పనిపాటులకై పోవును. భార్యయు అటులనే పోవును. త్రోవలో వారు వేర్వేరు కాఫీవిక్రయశాలలలో నెక్కడనో తొందరతొందరగా ప్రాతఃకాలభోజనము నారగింతురు. ఏదేని ఫ్యాక్టరీకడనుండు పూటకూళ్ళ ఇంటిలో, మధ్యాహ్నపు తిండి తిందురు. సాయంతనమున వారిరువురు మరలకలిసి, యొక భోజనశాలలో భుజింతురు. మరియు వారిరువురి సంపాదన అనుకూలపడు నెడల, నొక కారునెక్కి విలాసముగా విహారమునకు పోయివత్తురు. సినిమా చూడబోదురు. రాత్రికి తమగదికి మరలివచ్చి 'రేడియో' విందురు. వారికి యిల్లు చక్కబెట్టుకొను పని లేదు; వంటపనియుండదు;

గృహస్థలక్షణము లెన్నియు గానరావు. పిల్లలజాగ్రత్తపనులూ వారు పట్టుకొనరు; ఇంతేల వారి 'ఉన్నత' జీవన ప్రమాణమున అటువంటి దాని కవకాశముండదు. తమ ఫ్యాక్టరీపనులకై శిక్షణపొందిన ప్రజల కొఱకు, ఉత్పత్తిదారులు తమ వ్యయమున అనుకూలముగా, కల్పించిన, "ఉన్నత" జీవన ప్రమాణము ననుభవించుచు, బండచాకిరిచేయు వారు వీరే! అప్పుడప్పుడు స్త్రీలు కర్మాగారాధికారి భార్యలు సహా కారులుగ వచ్చుచుండెడి వారును, అతిథిమందిరాల దాసీలును మఱి యిట్టి ఇతర గృహపరిచారకులును, ఇట్లు ఫ్యాక్టరీద్వారములకవలకు ఆకర్షింపబడి వేయుదురు. ఆతీరున వారి జీవనప్రమాణము 'ఉద్ధరింప' బడుచున్నది.

అటువంటి 'ఉన్నతప్రమాణముల సృష్టించిపెట్టుట లోకోపకార బుద్ధితో ప్రజల అభ్యున్నతికొఱకు గావింపబడు సంస్కారణమా ? స్వీయలాభముకొఱకు స్వార్థపరతతో పన్నిన దుస్తంత్రమే యిది. గృహసేవకాగణమును ఫ్యాక్టరీపనివాండ్రుగా మార్చివేయుటేగాక ఉత్పత్తిదారులు కల్పించు 'ఉన్నతప్రమాణము'ల మూలమున, తమ నాశ్రయించిన పనిపాటుల వారిచర్యలను, క్రియాస్వాతంత్ర్యమును స్తంభింపజేసి వేయుదురు. ఇట్టి భౌతికప్రమాణములు పెంచబడినకొలదిని పనిపాటులవారి బేరములాడగల సమర్థత క్షీణింపజేయబడుచుండును.

తనపనివాండ్రు, ఎన్నడును ఇతర వ్యాపకములను కోరుకొనకుండునటుల, తన యుత్పత్తి ఎగుడుదిగుడు లేక స్థిరతరముగ సాగునటుల, శ్రామికులు సక్రమముగ పనిలోనికివచ్చు నిమిత్తమై, తన పనివాండ్రకు 'సంకీర్ణ' జీవన ప్రమాణమును అలవాటు చేయుదురు. 'ఉన్నత' జీవనప్రమాణమని ఘనమగుపేరిడి, శ్రామికుల వశము చేసికొను తంత్రజాలమును మిల్లుయజమాని నిరంతరము పన్ను

చుండును. ఈ తంత్రము ఫలించుటకొఱకు అతడు పనివాండ్రకు హెచ్చుజీతము నిచ్చును. ఉదారములుగ చూపట్టు నుపకార ప్రణాళికలకు ప్రోద్బల మిచ్చును. ఫ్యాక్టరీజీవనపు రమణీయతకు చిహ్నములట్లు క్లబ్బులు, టీసంవిరాలు, వినోదాలు, సినిమాలు సుఖ తరములగు జసలు మొదలగు వానికి పనివాండ్ర వలవాటు పడ జేయును. దీనికంతకు పర్యవసాన మేమిటో చూడుడు. పైన వివరించిన రీతిని, అమెరికాదంపతుల 'సంకీర్ణ' ప్రమాణముతో నెలయు జీవనమునకు పనివాండ్ర భ్యాసపడుదురు. ఫ్యాక్టరీ యజమాని ఎన్నినియమములను భగ్నపఱచినను కూడ, తమ స్థానమును మార్చుకొనుటకు సమ్మతింపజాలని స్థితిలో పడిపోవుదురు. వారి జీవనప్రమాణము చాలవ్యయ కారణమగునది కాబట్టి, పనిపోయిన యెడల, తమ కాధారముగ నుండదగిన నిలువసొమ్ము శ్రామికులయొద్ద నుండదు. భౌతికావసరముల కని, డబ్బు వెచ్చించుటకు వారలవాటు పడి యున్నారు. కాబట్టి ఆ అవసరములు తీరనియెడల తాము బ్రతుకనే లేమనెడు భయము వారిని పట్టుకొని యుండును. ఈతీరుగా పనివాండ్ర స్వేచ్ఛావర్తనమును బేరమాడగల శక్తియు కుంటువడి పోయి, వారుపనిచేయు 'బల్ల' (ఫాక్టరీలో పనిచేయుచోటు)ను విడిచిపోలేక దాని కంటుకొనియే పడియుండ వలసివచ్చు చున్నది. వారి జీవనప్రమాణ మిప్పుడు, ఎద్దుకు పొడిచిన ముక్కుత్రాడువలె బాధించును. అది శ్రామికుల స్వతంత్రేచ్ఛను గంగపాలుచేసి, వాండ్రను యజమాని చిత్తమునకు బానిసలచేసి వేయుచున్నది.

విదేశపరిపాలనక్రింద, ప్రభుత్వోద్యోగుల కీయబడిన హెచ్చు జీతములును ఇట్టి స్వభావము కలవియే సుడీ! ఎంతమంది దేశభక్తులో, అటువంటి యెఱకులలోనై, ధర్మమార్గము నుండి తొలగిరి. వారి అంతరాత్మను చంపుకొని, ఉద్యోగపువలలో చిక్కుకొని పోయిరి. తోడి

ప్రజలకు వ్యతిరేకముగా ఘోరకార్యములు చేయ పాల్పడిరి. ధన
కాంక్ష నిర్బంధము లేక, స్వేచ్ఛమే యున్నయెడల, అటువంటి
నీచకార్యములకు పాల్పడఁబడెడి వారు కారు. దరిద్రమును, సుఖ
ప్రదమునకై గోచరించు బ్రతుకు వారిని భ్రష్టులగాభావించి, వారిలో
ప్రయోజన ప్రమాణముల కూర్చిన జ్ఞానమును ధ్వంసముచేసి, వారి
సత్కార్యోత్సాహమును అధఃపతితము గావించినది.

పెట్టుబడిదారులయు పనిపాటులవారియు భేదమాడగల సమర్థ
తను దృష్టిలో పెట్టుకొని చూడుము. యజమానికిని పనివారలకును
మధ్య తగాదా సంభవించునెడల, యజమానిచేతిలో నిలుపడబ్బు
హెచ్చుగానుండు కారణమున, పనివారల బింకముతగ్గి, లోబడివచ్చు
వఱకును అతడాగగలడు. ఎప్పటికప్పుడు, తమకూలిడబ్బులమీద
ఆధారపడు పనివాండ్రలో హెచ్చుకాలము నిలువబడి నిగ్రహించ
లేరు. స్వల్పకాలముననే లేమికిని, ఆకలిబాధకును లొంగిపోవలసిన
వారగుదురు. సరళమై, తత్కారణముచేతడబ్బు ఖర్చంతగా సక్కర
లేని జీవనవిధానము నవలంబించు పనివాండ్రు సంకీర్ణమై అందు
వలన ధనవ్యయ కారణమును అగు జీవనవిధానము, నవలంబించు
పనివాండ్రకంటె హెచ్చుకాలము బాధల నెదుర్కొన గల్గుదురు.
కాబట్టి, తన పనివాండ్రు హెచ్చుకాలము తనతో భేదములాడగల
స్థితిలో నుండకుండులాగున, వారలకు సంకీర్ణ జీవనప్రమాణము వల
వాటు చేయుటయందు యజమాని మిగుల నభిలాష జూపుచుం
డును. పనివాండ్ర సందర్భమున ఈ కారణములటుండగా, సంకీర్ణ
జీవనవిధానము ఉత్పత్తిదారునికి మంచి అంగళ్ళను సృష్టించిపెట్టు
టకో, అనగా వాని సరకుల నమ్ముకొను వసతులను కల్పించు
టకో, నెట్లు తోడ్పడగలదో బ్రిటిషు ఆరామాధిపుని కుటుంబ
సందర్భమున గ్రహించియుంటిమి. కాబట్టి అటు చూచిన ఉత్పత్తి

పక్షమునను, ఇప్పు చూచిన విశ్రియపక్షమునకుకూడ, సంకీర్ణజీవన విధానము ఉత్పత్తిదారునికే లాభదాయక మగుచున్నది.

అమెరికనులవంటి పారిశ్రామికజాతులు, పైని వివరించిన, 'విజ్ఞానమయ స్వార్థ' మనందగు విధానము నవలంబించుచున్నవి. కాని ఆ విధానము నరుని క్రియాస్వాతంత్ర్యమునకును, వ్యక్తిత్వ వికాసమునకును విరుద్ధమైనది. సంకీర్ణజీవనప్రమాణమును ప్రవేశపెట్టుటలోగాని, అనుసరించుటలోగాని ఇతరములగు నుద్దేశ్యములును గలవు. అవి సామాన్యప్రజల కంతగా జోక్యములేని వగుటచేత, మనము చూచాయగా మాత్రము వానిని విచారించిన చాలును.

ఆడంబరప్రియులకు సంకీర్ణప్రమాణ మవసర మగును. ఒక పురుషుడు ఇతరులదృష్టి నాకర్షింపగోరిగాని, ప్రఖ్యాతి నపేక్షించిగాని తన భటులకు విశిష్టవేషధారణను నియమించవచ్చును. విశిష్టవేషము సేవకుని వ్యక్తిత్వమును మఱుగుపఱచి, వాని దాసత్వమునకు ప్రాధాన్యత నొసగును. అతడిక రాముడో, రహిమానో కాడు. డ్రైవరో, ప్యూనో, డఫేదారో, చప్రాసియో యై పోవును. అటువంటి సేవకులు, పాపము! అమాయికపు దరిద్రులు; తమ స్వీయసామాన్య జీవితములో, తమ సేవాచిహ్నముగా ధరించుపాటి సొగసగు వస్త్రధారణను చేసికోజాలని కారణముచేత, ఆ దాస్యచిహ్నపు దుస్తులను వేసికొని యెంతయో గర్వముతో మురిసిపోదురు. ఆడంబరాలకై చేయబడు వ్యయమును "దంభపు దుబారా" అనుట సమంజసమే. మన దేశము వంటి దరిద్రరాజ్యములో అట్టి అభ్యాసములు "గొప్ప నేరముగా పాటింపదగిన దుబారా" యనదగుట తథ్యము.

సంకీర్ణజీవన ప్రమాణమువలన విశిష్టతకై, వేఱై నిలుచు అలవాటు బలపడుచున్నది. మొదటితరగతి రైలుపెట్టెలో ప్రయాణ

ములు చేయుట, ధనాఢ్యులు వసించు ప్రాంతములందు బసలు చేయుట యిలాంటి అలవాటు లిట్టివే.

మన దేశము యొక్క సందర్భములో ఏ యొక్క ప్రమాణమును గాని కచ్చితముగ నిర్ణయింపజాలము. ప్రమాణము నిర్ణయించుట మనినను ఆయా ప్రాంతముల కవసరములగు ఆహారపుష్టి, అందలి శీతోష్ణభేదములు, మానవాభ్యుదయమునకుగల వసతులు, వ్యక్తిత్వమును ప్రకటించుకొనుట కనువగు అవకాశములు, ఇత్యాదివిషయముల నెన్నిటినో విచారణలోనికి దీసికోవలసి యుండును.

దక్షిణభారతమున వరియన్నము పుష్టికరమగు ముఖ్యాహారము కావచ్చును, కాని బియ్యము మెఱుగు పెట్టనివిగా నుండవలయును. దేహమునకు కావలయు అన్ని అవసర పదార్థములు లభించుకొఱకై పాలు, పప్పు, కాయగూరలు, చమురు మున్నగు నితరవస్తువులను గూడ చేర్చవలయును. ఇచ్చటి శీతోష్ణస్థితిని బట్టి విస్తారమగు వస్త్రధారణగాని, ఏలాటి పాదరక్షలుగాని అవసరము లేకపోవచ్చును. చాపవేసికొనిన అదేమంచిసెజ్జ కానోపును. ఉత్తర ప్రాంతమున, ఇతరాహార పదార్థములతో గూర్చి సమతకు దెచ్చిన గోధుమ రొట్టె పుష్టికరము కాదగును. అచ్చటి శీతకాలపు చలిమూలాన హెచ్చుగ వస్త్రములు, పాదరక్షలు, జంబుకాణాలు, మంచాలు అవసరములగును. ఇట్లు ఒకప్రాంతమున అవసర వస్తువులగునవి, మఱొకప్రాంతమున వ్యర్థపు భోగవస్తువులు కావచ్చును. కాబట్టి స్థానికములగు పరిస్థితులను బట్టియు, పరిసరములను బట్టియు జీవనవిధాన మెటువంటిదిగా నుండవలయునా యనునంశము విచారించి నిర్ణయింపవలసి యుండును.

ఒకరేర్చుకొనిన జీవనప్రమాణము శాశ్వతమును, అహింసా పదమునై యొప్పవలయుననుచో, అయ్యది ప్రాంతీయ ప్రజల ఆర్థికదశ

కనుకూలముగా నుండవలయును. ప్రకృతి గిరులు గిరులుగా (అంతరములుగలిగి) వర్తించుననుటను వెనుకటి ఒక అధ్యాయములో కని పెట్టియుంటిమి. ఒకవర్గము వారి జీవనము మఱొక వర్గము వారి జీవనమును పూర్ణముచేయు అంతరముగా ప్రకృతియెట్లు పొందు పఱచునో గ్రహించితిమి. ఈగిరులు భంగపడునెడల హింసాచర్యలు చెలరేగి, యెట్లువినాశమును చేకూర్చునో తెలిసికొని యున్నాము. వ్యక్తులశక్తి సామర్థ్యములు పరిణతి పొందుట కవకాశములు కల్పించుటయు, వ్యక్తి ప్రతిభను ప్రకటించుటకుదగిన విధానముల కాధారములు కూర్చుటయు ఏనిర్ణీతజీవన ప్రమాణమునకు గమ్యములుకావు. ఆ నిర్ణీతమైన జీవనప్రమాణము సమాజము నందలి ఆయావర్గప్రజల మధ్య సంబంధ బాంధవ్యముల కూర్చునదిగా నుండవలయును. అప్పుడు హెచ్చు సౌకర్యములు గలవారు తక్కువ సౌకర్యముగల వారితో సహకారము సలుపగల్గుదురు.

బ్రిటిషు ఆరామాధికారి శయ్యలందు స్ప్రింగుపరుపు లమర్చబడి యుండనగును. ఇవి ఫ్యాక్టరీలలో ఎవరిపరిశ్రమ ద్వారమున సిద్ధము చేయబడుచున్నవో చూడుడు. ఆ ఆరామాధికారి యింటికి తఱచు వచ్చుచు, తివాచీలను దులుపుటలోనో, పాత్రలను శుభ్రము చేయుటలోనో, మునుపుసహకారము సలుపుచు వచ్చినజనుల శ్రమవలననే ఆరామాధికారియింట వారి సహకార స్థానమిప్పుడు శ్రమనివారకోపకరణము లాక్రమించుకొనినవి. ఆ జనులలో సంకీర్ణజీవనప్రమాణపు భ్రమలకు లోనై, ఫాక్టరీయజమాని వలలో పడిపోయినారు. ఈ పరుపులు ఉక్కుతీగలతో నమర్చిన స్ప్రింగులు పొదిగినవి. ఈ ఉక్కుతీగలు ఫాక్టరీలలో తయారు చేయబడినవి. ఈ పరుపులలో ఏభాగమైనను చెడెనేని, ఏ ఫాక్టరీపనివారి కూటమో, మరమ్మతు చేయవలసి యుండును. కాని ప్రజల జీవితమునకును, ఆ పరుపుల

ఉత్పత్తికిని నమూన నిర్మాణాత్మకమగు సహజాగా విశ్వాస సంస్థా
నము నున్నదే

'ఉన్నత' మునై 'సరళము' నగు జీవనమును గడపు మన
పితామహుని చూడుము. ఆయన ఒక చాపపైని పరుండును. ఆ చాప
జంపాటురకపు చాప కాకపోవచ్చును. ఏ ముప్పదియో అంతకన్నను
హెచ్చో యగు సన్నని చీలికలుగా చేయబడిన తుంగగడ్డితో, పట్టు
దారాల మగ్గముమీద, నొక 'పట్టుశాలి' నేసినది కావచ్చును. ఆ
చాపలు స్ప్రింగు పరుపులకంటె చల్లగానుండును; మఱియు ఆ చాప
స్థానికముగా నిర్మింపబడిన వస్తువు. దీనిని తయారుచేయుటవలన ఆ
నేతగాడు కళావిజ్ఞానము నభివృద్ధిపఱచుకొనుటకును, చాకచక్యము
పెంపుచేసికొనుటకును సావకాశము కల్గుచున్నది. వాని నిర్మాణ
కౌశలమునకు ప్రోద్బలము కలుగుచున్నది. ఈవిధముగా అతను తన
వ్యక్తిప్రభావమును పరిణతికి దెచ్చుకొనుటకును, దానిని లోకమున
ప్రదర్శించుటకును వసతులేర్పడుచున్నవి. ఈ చాపలమీద చిత్ర
విచిత్రరూపములు అల్లబడియుండును; మెత్తగా నుండును. పట్టుగుడ్డ
వలె మడతలు పెట్టవచ్చును. వానిని ఉతుకుటకును వీలగుటచేత పరి
శుభ్రముగ నుండును. వీనిలో హెచ్చునాణ్యముగలవి హెచ్చువెల
గలవనుట నిజమే. ఆ చాపలల్లుటలో వాడిన పదార్థములనుబట్టియు,
వానిపైనిగల చిత్రరచలనుబట్టియు వాని విలువ, జత ఎనిమిదణాలు
మొదలు ఒక్కొక్కటి రెండువందలరూపాయీలవఱకు నుండును.
వీనికై దివానుగాను ఖర్చుచేసిన డబ్బు నేరుగా ఆశిల్పులను వానికుటుం
బమును పోషించుటకు వినియోగపడును. ఆ చాపలల్లుటలో విని
యోగపడిన పదార్థమగు రెల్లు స్థానికముగా దొరకునదే యగుట
చేత ఒక పూర్తియగు వృత్తిచక్రి మేర్పడుచున్నది. అటువంటి
ఆర్థికవిధానము, ముడిపదార్థముల సేకరించుటకుగాని, కొనుగోలు

చేయు అంగళ్ళు నిర్మించుటకుగాని, సముద్రమార్గాల రక్షణకుగాని పదాతిసేవను కోరదు; నౌకాసైన్యము దానికవసరముండదు. ఆకాశ విమానదళముల కగత్యము లేదు. కాబట్టి హింసాచర్యతో ఎందును అవసరమే యుండదు. ఆ దివాను ఇంగ్లాండులో తయారుచేయబడిన స్ప్రింగు పడకలను అభిమానించి, తన 'ఉన్నత' జీవనప్రమాణమున వానికి తావిచ్చునెడల హింసాకాంక్షకు ప్రోద్బలమిచ్చినవాడగును.

అదేమాదిరిగా దివానుగారి ధోవతులు, ఇతర దుస్తులును ఖద్దరులై, ప్రత్యేకముగా నియమింపబడిన తీరున సిద్ధము చేయబడునవగు నెడల, స్థానికముగా జీవించు వడుకువారికిని, నేయువారికిని జీవనోపాధిని, ప్రోత్సాహోన్నతులను గల్పించును. వారి అభివృద్ధికి దోహదము లభించును.

ఆతీరుగా మన అవసర వస్తువులలోని ప్రతిదానికిని, మన ప్రాంతపు పారిశ్రామికోత్పత్తి వ్యాపారముతోడను, మనచుట్టును గల ప్రజల జీవితముతోడను అనుబంధము కూర్చుట మన విధి. అప్పుడు మాత్రమే శాశ్వతత్వము ఫలించును; తద్వారా హింసారూప వినాశము తొలగి, ఆరోగ్యప్రదమగు జీవనవికాసము సమకూరగలదు.

మన చుట్టును నివసించు ప్రజల ప్రమేయమేమియు లేకుండ, డబ్బువిలువను, పదార్థరాశిని దృష్టిలో నిడుకొని మన జీవనప్రమాణములను నిర్ణయించుకొనుట ఆచారమైపోయినది. అటువంటి ప్రమాణములు కృత్రిమములు; కావున అసహజములును అస్థిరములు నగును. అవి ప్రజల జీవితములో వేరూని పెరుగునవి కావు. కాబట్టి శాశ్వతములు కాజాలవు. బలాత్కారముగా పైన బడవేయబడినవై లోతుగ నాటుకోజాలకుండును. బ్రిటిషు ఆరామాధికారి జీవనప్రమాణము, ఆచందాన తయారుచేయబడినదే. అలాటి పరిస్థితులు సైనిక

శిక్షణను, నిర్జీవమగు ప్రమాణరచనలకును హేతువులగుట లేశముగ చూచుచున్నాము.



ప్రజాజీవన వైఖరిని పూర్తి వివరములతో నిరూపణము చేసి ఈ తీరుగా విమర్శలు సాగించు అవసరము లేదు. ప్రజాహిత జీవితమున అనివార్యముగానుండి తీరవలసిన జీవితావసరముల యొక్క అత్యల్పప్రమాణమేదో శ్రద్ధతో కనిపెట్టి ప్రజలయొక్క వస్త్రోత్పత్తికర్మను గూర్చి పూర్ణము సూచించుచు, వారి వసనములకును, వారికి సులభముగ దొరకు ముడిపదార్థసేకరణకును అనుకూలపడు విధానముల తెలుపుటే మనము చేయవలసినదంతయు. ఆపిమ్మట వ్యవహారమున జోక్యము గల్పించుకొనకుండ ప్రజలనిర్మాణ సామర్థ్యమునకును, కల్పనాచాతుర్యమునకును స్వేచ్ఛ నంగీకరింపవలయును. చెరువులోని నీళ్ళు పైకి రావలయుననిన యెడల మనము చేయుదగినదెల్ల, ఆ చెరువులోని నీరును హెచ్చుచేయుటే గదా! ఆపిమ్మట మన సాహాయ్యముగాని మన జోక్యముగాని లేకుండనే, నీటిమట్టము, ప్రకృతి ధర్మము ననుసరించియే, తనంతట నదియే పైకి లేచును.

మన దేశమునందలి ప్రజలు తిండిలేక మాడుచున్నను, చాలినంత గుడ్డలేక దేవులాడుచున్నను, అందాలపోటీలతో వారు పాల్గొనగోరి తనువుల సన్నవిగ జేసికొనుచుండిరని గాని, దిగంబర సిద్ధాం

తానుగాను లగుచుండిరనిగాని వ్యాఖ్యానము చెప్పదగదు. వారికి తామేమి తినవలయునో, యెట్టుల తినవలయునో తెలియును. వారేమి ధరింపవలయునో వారెరుగుదురు. వారికి కావలసినవి ఘనమగు అంచనాలు, జాబితాలు కావు. వారికి ఆహారపదార్థములు కావలయును. వారికి వస్త్రములు కావలయును. వానిని చాలినన్ని ఉత్పత్తి చేసికొనుటకు తగిన వసతులనుమాత్రము మనము కల్పించిన చాలును.

ప్రజలలో నిర్మాణావకాశములను హెచ్చించి, స్థానికముగా విక్రయ సదుపాయముల గావించి, వినియోగపద్ధతులను సవరణ గావించినం జాలును; జీవనప్రమాణము దానంతట నదియే హెచ్చగలదు. అట్టుల నొక్క ప్రమాణము సహజముగ నిర్మాణమయ్యెనా ప్రజలయొక్క సంస్కృతియు, మేధాశక్తియు, వానంతట నవియే ప్రకాశమునకు వచ్చును. మఱియు ప్రజాజీవితమున వేరూని నిలువబడదగిన దగుటచేత, ఆ జీవనప్రమాణము సుస్థిరమై వర్ధిల్లగలదు.

బ్రిటిషు ఆరామాధికారి జీవనప్రమాణము, అతని చుట్టునున్న ప్రజల జీవితముతో అనుసంధానముగలదికాని కారణమున, కేవలము వ్యక్తిగతమైనదని చెప్పవలసియున్నది. దాని వ్యాప్తి వాని యింటి నాలుగుగోడలమధ్యను మాత్రమే. 'ఇంగ్లీషువాని గృహము వానికి కోట" అనునుడి కలదు. నిజమే! లోపలనున్నవారి కది యెంతెంతగా స్థూలములౌ శారీరకసౌఖ్యముల సమకూర్చునదైనను, అది ప్రపంచమును దూరముగా నెట్టివేయునదగుట నిస్సంశయమే. చుట్టును పఱగుజీవనఝురినుండి ఆతీరున విడివడి, ముడుచుకొనియుండుస్థితి మన దేశములోకూడ, పాశ్చాత్యజీవన పద్ధతుల ననుసరించువారు తెచ్చిపెట్టుకొనుచున్నారు.

మనము కోరుకొనుచున్న ప్రమాణము ఒక్క కుటుంబము కొఱకు కాదు; ఒక్కతరగతివారి కొఱకునుగాదు: మఱియు ఒక్క కూటమువారికొఱకును గాదు. అది స్థానిక ప్రజ యంతటికిని సమష్టిని వినియోగపడునదై యుండవలయును. అనగా ఆ ప్రమాణము ప్రజా సమూహములోని యెల్లరి జీవితములను ఒండొంటితో పెనవేసి కలిపి వేయగలదిగ నుండవలయును. మన ప్రాచీనగ్రామ నిర్మాణ మొక తీరున ఈపూర్వాన కొంత ప్రయత్నము చేసియున్నది. అందు కాపుర ముండువారిలో మంగలి, చాకలి, ముచ్చి, మాదిగ మున్నగు వృత్తు లవలంబించువారిలో ప్రతివానికిని, వడ్లు, కాయధాన్యములు మొదలగువాని రూపమున ఆగ్రామపు పంటరాశిలోనుండి వార్షిక భాగమును నిర్ణయించి, ఇచ్చు కట్టడి కలదు. ఈ వ్యవస్థ యందలి వారందఱు, సమష్టిని ఒకేపాటుముగా పాటింపబడిరి. కాని మనము కోరునది శరీరముయొక్క యునికిని కేవలము నిలువబెట్టుటకు తగిన యేర్పాటులు కావు. మానవునందలి శ్రేష్టతర కల్పనాసామర్థ్యమును పెంపొందించుట కనుకూలించు సదుపాయములు కూడ అవసరములే.

మఱల మన దివాను ప్రస్తావన చూతము. ఆయన తన కాగిత ములు పెట్టుకొనుటకు ఒక తోలుపెట్టెను కోరుననుకొందము. ఆయన ముచ్చిని పిలిపించును. ఏరకపు పెట్టెను ఏరకపు తోలుతో చేసిపెట్టవలెనో తెలుపును. ఆ పెట్టె ఆకారమును, పరిమాణ మును, అందలి అఱలను నిర్ణయించును. ఆముచ్చి చర్మకారుని పిలిచి ఎట్టి నాణ్యముగల చర్మమును ఏరీతిని ఊనియీావలెనో యేర్పాటు చేసికొనును. ఈ వ్యవహారములో పరిష్కారము కావలసిన సమ స్యలు చాల నుండును. ఇందు చాకచక్యమునకు ఊహాకల్పనకు ఎంతేని అవకాశము కలదు. ఈ విధమున దివానువారికోరిక వలన, వాని చుట్టునున్న వారియొక్క నిర్మాణ కౌశలము క్రియారూపము

డాల్చుటకు వసతియేర్పడు చున్నది. ఇందుకు మారుగా, ఆ దివాను సరాసరి యొక్క బ్రిటిషు విక్రయశాలలోనికి పోయి, అచ్చట సంసిద్ధముగా చేసిపెట్టి యుంచిన తోలుపెట్టెను కొను ననుకొందుము. ఆపెట్టెసరిగా తాను కోరుకొనునట్టి రకముదై యుండదు. అక్కడ సిద్ధముగా చేర్చిపెట్టియుంచిన సరకునుండి, అతడేదో యొక దానిని ఏర్చుకోవలసిన వాడగును. ఇంతియేకాదు. తన కేలాటి పెట్టెకావలయునో అను విషయమునకు ప్రాధాన్యతనిచ్చి విచారణ చేయుటయే మానుకొనవలసిన వాడగును. ఆ విషయనిర్ణయము వానికంటె ముందుగా ఉత్పత్తిదారుని వలన చేయబడి యుండెను. ఆనిర్ణయము ప్రత్యేకముగ వాని కనుకూలించునది కాకపోవచ్చును. ఏదో సామాన్య సమస్యగా, ఆయుత్పత్తిదారుడు సాగించిన ఆలోచనా ఫలితమైయుండును. ఆ దివాను తన పెట్టెను స్థానికముగా చేయించుకొనునెడల, దాని వివరములంగూర్చి తానేస్వయముగా యోచన సాగించుకొన గలడు. తనకు వలయువస్తు స్వరూపమును ఆయన నిర్ణయించుకొనును. తనదాపున నున్నవారిలో ఏపని కెవరుపయోగపడుదురో వారిచేత ఆయాపనులు చేయించును. ఈవిధాన వినియోగదారుని జీవనము, వాని భావనయు ఉత్పత్తిదారుల జీవనముతోడను వారి కల్పనాసామర్థ్యములతోడను చక్కగ పెనవేసికొని యుండును. ఒకడు ఇంకొకడు నిరూపించు సమస్యలను పరిష్కరించుటలో పాల్గొనగలుగు చుండును. మన జీవితములు వేఱువేఱు స్వతంత్రములైన విషయములు కాక, ఒండొంటితో పెనవేసికొని యుండును. సవ్యమైయొప్పు ఒక జీవనప్రమాణము అనేక పట్టుదారమిటుల, సమాజప్రజలందలి వ్యక్తిజీవులనెడు ముత్యముల నొక హారముగా కూర్చును. దివాను జీవనప్రమాణ మటువంటిదై, వాని జీవితమును వడుకువారి యొక్కయు, నేతనేయువారి యొక్కయు,

చాపలల్లువారి యొక్కయు, చర్మకారుల యొక్కయు, కుమ్మరుల యొక్కయు జీవితములతో అనుబంధము కల్పించుటయేకాక, జనుల భోజనానంతరము పారవేసిన విస్తరిని తినుమేక మొదలగు నోరులేని తోడిజీవుల జీవితములతోడ సన్నిహితము సంబంధము కల్పించుచున్నది. తనకుతానై జీవించునటుల లేదు. కాని ఫ్యాక్టరీలలో తయారు చేయబడిన వస్తువుల వాడుకసంపర్కమున, పరిసర ప్రజలతో అలాటి సన్నిహిత సంబంధము శూన్యమై పోవుచున్నది. అక్కడి జీవనప్రమాణము నిర్జీవములగు యంత్రములతో యోగింపబడినదగుచున్నది. ఈ యంత్రములు వృద్ధికాగల నిర్మాణ కౌశలములేని నిర్మాతలన దగియున్నవి.

కాబట్టి మనజీవన ప్రమాణమేదైనను, సంఘమునందు వివిధ వర్గముల మధ్యమున శుభంకరమగు సహకారమును కల్పనచేయుచు, సంఘమునొక సజీవసంస్థగా సంఘటితపఱచ గల్గునదిగా నుండవలయును. అట్టి ప్రమాణము వేఱుపడి జీవించుచు నితరులతో ప్రమేయము పెట్టునని వ్యక్తుల ప్రయోజనము కొఱకు మాత్రమే ఏర్పడినదిగా నుండవలయును. అయ్యది సంఘమునంతను నొక్కటిగా కూర్చి సంఘటితపఱచు స్నేహబంధముగా నుపకరింపవలయును. అప్పుడు పరస్పర విశ్వాసము, ఐకమత్యము, ఆనందము, ప్రవర్ధనము గాంచును. ఈ గుణములు సంఘబలమునకు పునాదులై వెలయును. వైషమ్యముల పొడమనీయవు.

సన్నని దూదిపోచలు వేర్వేరుగా నున్నప్పుడు అల్పములును, దుర్బలములునై యుండును. కాని కొన్నివేల పోచలు కలియ పేన

బడునప్పుడు. బలిష్ఠముగా మోకుగ నేర్పడి, పెద్ద సముద్రపుటోడ నైనను లాగివట్టగల్గును. సంతృప్తిదాయకమగు జీవనప్రమాణము యొక్క ప్రభావ మటువంటిదిగా నుండును. అది సంఘము సంతతిని ఒక్కటిగా సంఘటితపఱచి, ఉత్పత్తిదారుని , వినియోగదారుని సన్నిహిత బంధువులనుగ జేసి కూర్చగలదిగా నుండును. అటువంటి జీవనప్రమాణము మాత్రమే శాశ్వతత్వమున కాధారమై వెలయంగా గలదు.

---

# అధ్యాయము 12

## శ్రమ

"శ్రమ" అను మాట చాల తఱచుగా వాడబడునదైనను, ప్రజలు అర్థముచేసికొన శ్రద్ధవహింపని మాటలలో ఇదొకటియని చెప్పవచ్చును. 'శ్రమ' అనగా నేమిటి? ప్రకృతిసిద్ధమైన పరిపోషణమునందు దానికిగల ప్రమేయ మెటువంటిది? కోట్లాది జనమునకు "శ్రమ" నేర్పాటుచేయు టెట్లాయను సమస్య నేడన్నిజాతులను ఎదుర్కొను ప్రధానసమస్యలలో నొకటిగ నున్నది. కాబట్టి 'శ్రమ' యను పదమునకు పూర్ణభావమును తెలియుట అత్యావసరము. పరంపరాగతిని, శాశ్వతత్వమును సంరక్షించుచు, విశ్వముయొక్క నిరంతర జీవనము సాగివచ్చుట కాధారములగు ప్రాకృతజీవగణముల చర్య లెటుల సమకూర్చబడుచున్నవో పూర్వాధ్యాయములలో విచారించియుంటిమి. పురుగులు భూసారము నెటుల పోషించునో, పక్షులు విత్తనముల దీసికొనిపోయి అందందుజల్లుట కెటుల తోడ్పడునో, తేనెటీగలు పూలకెట్లు చూలుకల్పనచేయునో తెలిసికొంటిమి. ప్రకృతిలోని ఆయాజీవుల శ్రమవిధాన మటులనున్నది: వాని జీవనధర్మ మారీతి నున్నది.

నరుని విషయమునను అట్లే. "జీవనమనగానేమిటి? కేవలపుటునికిని మించి దాని యందలి ప్రధానాంశములేవి?" అను విచారణ చేసి యుంటిమి. నిమ్నజాతి జీవులవలెగాక, నరుడు తన స్వాతంత్రేచ్ఛను ప్రయోగింపజాలును; ప్రకృతియందలి వివిధమూల వర్గములను సమీకరణచేసి, వానివాని ధర్మములను శ్రేష్ఠతర మార్గమున నిర్వహింపచేయ గలడు. అటులచేయుటలో, నరుడు తన కౌశలమును వృద్ధిచేసికో గలడు; మఱియు తనయెదుట నిడుకొనిన సమస్యలను

పరిష్కరించుటకో తానవలంబించు ప్రమాణములద్వారమున తన వ్యక్తి ప్రభావమును ప్రకటింపజాలును కూడను. ఈ చర్యయే నరుని వంతు 'శ్రమ' అనవచ్చును. అదియే ఆ 'శ్రమ' యొక్క ధర్మము నన వచ్చును.

'శ్రమ' అనగా నేమియో సరిగ గ్రహించుటకు, నరుని ప్రాథమిక చరిత్రను గైకొని, దాని నీనాటుపూర్తిగా కప్పిపెట్టిన యనేకములును, సంకీర్ణములునునగు అనుబంధ విశేషాంశములను వేఱుపఱచి, దాని ఆద్యసరళస్వరూపమును గనిపట్టుటెంతయు అవసరము. నరుడొకదశయందు తనకొఱకై రాళ్ళనుండి పనిముట్లను చేసికొనసాగినాడు. అప్పుడతడు, కేవలము నైజప్రవృత్తి ననుసరించి బ్రతుకుజంతువుల వర్గమునుండి వేఱుపడుట ప్రారంభమైనది. ఆకాలమునాటి నరుని చేష్టలను పరిశీలించినయెడల, 'శ్రమ' యనుదాని స్వచ్ఛమగు స్వరూపము మనకు గోచరించును. పక్షులు గూళ్లను కట్టుకొనును; అందందు దేవులాడి తమ యాహారమును సంపాదించి తెచ్చుకొనును. సరిగా అదే తీరున, నరుడు తన బుద్ధిసంపదను, ముందు రాగలదానిం గూర్చిన యూహను, అందుంగూర్చిన యుపాయములను సమీకరించి తన యవసరములను దీర్చుకొనకొఱకగు ప్రవృత్తియే వాని 'శ్రమ.' నరుడప్పుడు తన స్వార్థమును సాధించుకొఱకే, తనను తానానందపఱచుకొనుకొఱకే "శ్రమ" పడెడివాడు. వ్యక్తిపరముగా వాని అవసరములు తీరుట వినా వేఱగు 'కూలి' (ప్రతిఫలము) లేనేలేదు. వానిసమర్థతలను నిశితపఱచుటకును, వానిని యోచనలు చేయగల జీవిగా పరిణామము పొందజేయుటకును ఆ ప్రవృత్తి సవ్యముగ నడిచెడిది. అతడు తాను వేటాడిచంపిన జంతువులను తాను నివసించు కొండగుహకు దీసికొని వచ్చెడివాడు. అచ్చట వాని యిల్లాండ్రు ఆ జంతువుల మాంసమునువండి, ఆహారముగా సిద్ధము చేసెడివాడు.

ఆతీరుగా స్త్రీజనముయొక్క సాంసారికవ్యాపార మారంభమైనది. ఈదినమువఱకు, కనీసము మన దేశమునందైనను, స్త్రీల ‘ శ్రమ ’ స్వంతగృహములో, స్వంతమగు నవసరములను దీర్చుకొనుట యనెడు వినిర్మల స్వరూపముననే నడుచుచున్నది.

శ్రమయందలి ప్రధానాంశములు :— ‘ శ్రమ ’ యను దానిని విభజించి పరిశీలించునెడల, అందనేకాంశములు చేరియున్నటుల, తెలియ వచ్చును. తుదిగమ్యార్థమును సాధించుటలో అందలి ప్రతియంశమును సాయపడుచుండును. ప్రధానముగా ‘ శ్రమ ’ యందు సామాన్యపు పాటు, శ్రాంతి, పురోగమనము, సుఖము అనునవి యిమిడియున్నవన దగును. వీనిలో ఏయొక్క దానిని గాని రెండవదానినుండి వేఱుపఱచి, దాని నొక్కదానినే ప్రత్యేకజీవనాంశముగా చేసి నిలుపజాలము. శ్రమయందలి “ సామాన్యపు పాటు ” భాగము నొక పురుషునికిని, ‘ శ్రాంతి ’ భాగమును మరొకనికిని పంచియీయజాలము. మఱియు నందలి సుఖాంశము నంతటిని నింకొకడు గుత్తగొనుటయు పొసగదు. సంగీతములోని స్వరములలో ప్రతిదానికిని విశిష్టమగు తాళగతి యుండును. ఆతాళ మాస్వరమునకు జీవసంజ్ఞగ నుండును. ఆ తాళ మానము తప్పినా, ఆస్వరమున కర్థమే సున్న. గాయకశిరోమణిగా గోరుకొను పురుషుడు స్వరములను నేర్చుకొనుటలో నెన్నియో గంటలకాలము వ్యయముచేయును. అలాచేసి స్వరములను తాళగతితో నేర్చినప్పుడే వాని సంగీతమున రసమొప్పింప గల్గి, వా డానందింపజాలును. ఈరీతిగ స్వరముల నేర్పు చర్యను వేఱొకని వంతుగా పంచియిచ్చి, తాను రసాస్వాదనముచేయు సుఖమును మాత్రము పంచుకోజాలడు. ఒకానొకడు రేడియోగానమును వినుచు సోమరిగ గూర్చుండవచ్చును. కాని ఆచర్యవలన అతడు గాయకుడు కాజా

లదు. అదేవిధముగా, మనమేది చేయబూనినను, దానికై చిరకాలా భ్యాసమును చేయక తప్పదు.

ఇంకొక యుదాహరణము చూతము. సరియైన భోజనమునందు పుష్టికరపదార్థము, జీర్ణముకాని వ్యర్థపదార్థము, రుచి అనునది కూడి యుండును. రుచిని మాత్రమే పొందవలయునని ఎవడైని నిర్ణయించు కొని, ప్రతిముద్దను కష్టపడి నమలుట కిష్టగింప నిరాకరించునెడల. ఆధునికశాస్త్ర సాహాయ్యమున తన శరీరపోషణకు అవసరమని తాను గ్రహించిన ద్రవ్యముల నేరి దీసికొన నిశ్చయించికొనినను గూడ తన దేహము నెంతకాలమో నిలువబెట్టుకోజాలడు. ఈ సరణిని పరిశీలించునెడల, ఆహారపదార్థములోని వ్యర్థపదార్థమనునది జీర్ణ క్రియకును, శరీరవృద్ధికిని అనివార్యమగు అవసరవస్తువేనని గ్రహింప జాలుదుము. "శ్రమ" వలని యుత్తమఫలితార్థమును బడయ కాంక్షింతుమేని, దానియందిమిడియున్న ప్రధానాంశముల నన్నిం టిని పాటించి స్వీకరించి, వానివాని నైజకృత్యముల కవకాశమొసగి తీరవలయును.

స్మృతిదాటిన ప్రాచీనకాలమునుండియు. మానవుడు తన స్వేచ్ఛను బట్టి శ్రమను పృథక్కరించి దాని వేర్వేరు భాగము లను భిన్న భిన్న వ్యక్తులకు పంచు ప్రయత్నముల సాగించు చున్నాడు. సామాన్యపు పాటును తన నెదిరింప శక్తులుకానివారి వంతు చేసి, శాంతిని ఉద్ధతులవంతు చేయ జూచుచున్నాడు. పాటును దాసుల నెత్తినివేసి, యజమాని వారికష్టఫలములను సంగ్ర హించుచున్నాడు. గ్రీసు, రోముసామ్రాజ్య వైభవములు ఆ తీరున లాభసంగ్రహణము, కష్టవిసర్జనమునను చర్యలపై నిర్మాణమైనది తత్పర్యవసానముగా వారివైభవములు దగ్ధమైపోయినది. వానిభస్మ రాశి గతచరిత్రనుగానము చేయుచు, మనకు గుణపాఠమును గఱపు

చున్నది. ఈగుణపాఠమును పెడచెవినిబెట్టి ఆధునిక పారిశ్రామిక సామ్రాజ్యములు వెనుకటివాని జాడలబట్టిపోవుచు, సౌఖ్యములను లాభములను వస్తూత్పత్తిచేయు దేశములకు కట్టిపెట్టి, బండచాకిరిని ముడిపదార్థముల నుత్పత్తిచేయు దేశముల నెత్తిపైబడవేయు ప్రయత్నముల సాగించుచున్నవి. ఈకుతంత్రము ప్రకృతిశాసనమునకు విరుద్ధమైనదిగాన, భగ్నము కాకతీరదు. ప్రకృతినిర్ణయమును భంగపరచు తంత్రఫలముగా చెలరేగిన హింసాచర్యవలన ఘటిల్లు ఘోరవినాశమును మనముకనులారనిప్పుడు కాంచుచున్నాము. సామ్రాజ్య దేశములు అన్యప్రజాళిని తమయిచ్ఛకు దాసులగావించు ప్రయత్నముల దుష్ఫలములే యిటీవలి ప్రపంచసంగ్రామములు సుడీ! కొలదికాలము విజయవంతములైనట్లు జూపట్టవచ్చును; కాని ఆ విజయమునందే వినాశవిషబీజము లిమిడియుండుటచేత, హింసాప్రేరితమౌ యీవ్యవస్థలెల్ల ధ్వంసమైపోవుకాల మాసన్నమగుచున్నది.

'శ్రమనివారణోపకరణముల' నిర్మాణకులు, బలాత్కార విక్రయ సంస్థలను విజయవంతముగావించి, గృహపరిచారకులను, వ్యవసాయకులను, పాటకపుజనమును నెట్లుస్థానభ్రష్టుల గావించిరో, వారినెటుల తమభారీయంత్రాలయములందలి కూలివాండ్రనుగ జేసికొనిరో వెనుకటి అధ్యాయమున దెలిసికొంటిమి. అటువంటి పరివర్తన ఫలితముగా ఆంగ్లదేశమందలి ఆరామములు, సేద్యభూములు పాడుపడినవి, ఏలయందురా?

అచ్చటిభూములనన్ని వ్యవసాయము సాగించుటకు దగినంత మంది గ్రామసీమలందు మిగిలియుండినగదా! కాని బొగ్గు, యినుము, తగరముతిని బ్రతుకగలదేశ మెందునునుండదు. ఆహారము తప్పక కావలయును. ఆహారద్రవ్యములను మఱియు నట్టిపదార్థములను సమకూర్చి పెట్టుటకు ఇతరుల దయాదాక్షిణ్యములపై ఆశపెట్టుకొనుట

వ్యర్థము. ప్రభుత్వసాహాయ్యములేని వ్యక్తివ్యాపారస్థుల యిష్టా
నిష్టముల నమ్ముకొనుటయు నిష్ఫలమే. కాబట్టి అట్టివస్తు సంగ్రహము
కొఱకై ఇంగ్లాండుదేశము పరదేశములను తమదాస్యమున నణచి
పట్టుట అనివార్యమైనది. పరదేశములు సులభముగా తలవంచి
దాస్యమున కొడంబడుట అసహజముగదా. కాబట్టి హింసాచర్య
ఇంగ్లాండుదేశైశ్వర్యమునకు పునాదికావలసి వచ్చినది. తమ అభ్యు
దయ వ్యాప్తికొఱకును, సంరక్షణకొఱకును ప్రతి రెండుతరముల
కాలములోను ఆదేశపు యువకప్రజను, వారి శౌర్యసంపదలను
సంగ్రామభూములందు బలిపెట్టవలసి వచ్చుచున్నది. ఇయ్యది వాంఛ
నీయపరిస్థితి యగునా? ఇట్లు తడవతడవకు నిరపరాధుల వధపెట్టి
పరిపోషణము చేసికొను విధానము, సామాన్యముగా వీధినిపోవు
నే పామరజను డైననుకూడ నింద్యమని తెలుపగలడు. కాబట్టి అటు
వంటి వాస్తవ పరిస్థితి ప్రజలకు తెలియరాకుండ జేసి, తమకు చెప్పిన
దానినెల్ల నిశ్శంకముగా నొప్పుకొని ప్రజలు తలయూపునట్టుల జీవన
ప్రమాణములను చీకాకుపఱచి, సంకీర్ణ జీవనప్రమాణములను బహుళ
వ్యాపకము గావించి, అకృత్రిమ ప్రమాణములను వేనోళ్ళ పొగ
డుచు, హింసాపరజీవనమును మహిమాఢ్యమని చాటు విద్యాపద్ధతి
చేత ఆబాల గోపాలమును సమ్మోహనమున ముంచి యుంచు
చున్నారు. ఈ దుష్ప్రచారదుష్ఫలములను, తల్లులుతమ ముద్దుబిడ్డలను
బలిపెట్టి గర్వించుటలోను, యువతులు తమ ప్రియభర్తలను రణ
భూములందును ప్రాణములవిడువ ప్రేరేపించుటలోను, సులభముగ
ద్యోతకము చేసికొగల్గుదుము. ఏ తల్లియేని తనపుత్రుడు ఇతరపుత్రు
లను వందలాదిగ హత్యచేయుటకును, ఆ కడకయందు హత్యగావింప
బడుటకును అనుకూలించు విద్యాశిక్షణమును బడయుచున్నాడని
తెలిసి మురిసిపోవుట యెందేని ప్రకృతిసిద్ధమనగలమా? ఏసదయ

హృదయయగు తత్త్వమైనను తన ప్రియభర్తను పరజాతుల దోచు
కొనిరమ్మని పంపి, ఆ యత్నమున ప్రాణహాని గాంచుమకొమ్మని
ప్రోత్సహింప సమకట్టుట సహజమగునా? కాని విపరీతములగు
మూల్యప్రమాణములను ప్రజల మనస్సులోనికెక్కించిన దోషము
వలన ఈ విపరీతానర్థము లన్నియు సూచుచున్నవి. హింసావినాశ
ములు చేకూరు మార్గములలోనికే లాగునటుల ప్రజలు తమ స్వాతం
త్ర్యేచ్ఛలను వినియోగము చేయు యోగము విషమప్రమాణములవల
ననే వచ్చిపడినది. ప్రజలే సహజమును వినిర్మలమునగు యోచనలు
చేయువారగుదురేని హింసావినాశముల కెంతయో దూరముగ
నుండెడివారే!

అటువంటి యధోగతి సంభవమగుటకు ముఖ్యహేతువు దౌర్జన్య
మును మహోన్నతపదవిని నిలిపి పూజించుటయే. ఒక్కరిని హత్య
చేసిన నేరగానికి ఉరిశిక్ష విధించుచున్నారుగదా! కాని పురోభివృద్ధి
కాములును నిరపరాధులునగు యువకులను పెద్దమొత్తున హత్యగావిం
చినవారిని జాతీయవీరులనుగ నిర్ణయించి బహూకరింతురే! ఘోర
కృత్యములను హెచ్చుగ సలిపినకొలదిని బిరుదావళుల నర్పించియు,
సెంటుపాల్సు కెతీడ్రలు లేక వెస్టుమినిస్టరు కెతీడ్రలు వంటి పవిత్ర
పూజాక్షేత్రములందు ఆ క్రూరకర్మల జ్ఞాపకార్థము ఘనతరశిల్ప
నిర్మాణముల స్థాపించియు జోహారులర్పింతురే! స్వరక్షణ నిమిత్తమై
అటువంటి వక్రమార్గములను ఆశ్రయించు విధానములో నేదేని
ధర్మభంగ ముండవలయునని తోచుట లేదా? తలక్రిందుగా నడుప
బడు నాచారఫలితముగా సద్భావములెల్ల అణగారిపోగా జాతియం
తయు జ్ఞానశూన్యమై పోయినటుల కాన్పించుటలేదా? వెనుకటి
అధ్యాయములో మనము విచారించిన సంకీర్ణ జీవనప్రమాణము
నవలంబనముచేయుట కారణముగా ప్రజలు శాంతచిత్తములతో

స్థితిగతులం మార్చి ఆలోచనలు గావించు నవకాశములనే కోల్పోయినవారైరి, అధికారపదవుల నాక్రమించిన నాయకులు, ఆ ప్రమాణావలంబనము వలన తమ లక్ష్యములను అడ్డులేకుండ ననుసరింపుచు కనుగొనక ఆత్మసంతృప్తులై తమను తాము సంభావించుకొను భ్రమలో పడిపోయిరి.

జరుగు కార్యక్రమము చాల సరళము. ప్రకృతిప్రేరితుడై నరుడు తన తృప్తికొరకుమాత్రమే శ్రమపడునని క్రిందటి అధ్యాయములో గనుగొంటిమి. కాబట్టి నరుడు ప్రయత్నశీలుడగుటకు ప్రత్యక్షకారణము వాని అవసరములని గ్రహింపగలము. వాని యవసరములను హెచ్చించితివా, వాని ప్రయత్నములును హెచ్చును. నరుని అవసరములను పెంచవలయుననెడు ప్రతిపాదనకు మూలకారణ మిప్పుడు మనకు తెల్లమగుచున్నది.

కాబట్టి నరుని భౌతిక జీవనప్రమాణమును "ఉద్ధరించుట" అనగా, లేక ఆ ప్రమాణమును సంకీర్ణము చేయుటనగా ఎద్దునకు ముక్కుత్రాడువోసి లాగుకొనిపోవు టెటువంటిదో అటువంటిదని గ్రహించియుంటిమి. అందువలన నరుని స్వీయమగు యిచ్ఛ అణంచబడును; వాని యుద్యమశక్తికిని వాని కార్యోత్సాహమునకును, నిరోధము కలుగును; అతనిని వశము చేసికొనినవాడు నిర్దేశించిన తెరువులలోమాత్రమే అతడు నడువవలసినవాడగును. ఆతీరున పరుని వశమునుండి నడుచునతడు విచక్షణాశక్తిని కోల్పోవును. తనను వశము చేసికొనినవాని సన్న ననుసరించుపట్ల శంకింపడు.

ప్రపంచ మీనాడు పెద్దయెత్తున పరిశ్రమలు నడుపు ఉత్పత్తిదారుని కాలిక్రింద పడియున్నదనియు తెలిసికొనియుంటిమి. ప్రజల వాక్కు నణంచిపెట్టుట మూలమునను, తనకు లాభముల నార్జించిపెట్టు సంస్థను వ్యాపింపచేయుట మూలమునను, ఈ రెండు రీతులను

అధికవస్తూత్పత్తివ్యాపారము లాభము గోరుచున్నాము. సంగ్రామముల నడుమ శాంతిసమయములందపుడు యంత్రముల ఉత్పత్తిని హెచ్చించి వాని నమ్ముకొనును; యుద్ధమేఘములు క్రమ్మి యావరించు సమయములందు బాంబులయు ఫిరంగులయు ఉత్పత్తిని సాగించును. తన స్వార్థచింతను కప్పిపెట్టి, ప్రజాస్వామ్యము యొక్క రక్షణకొఱకే యని చాటుచు వాని యానతులను శిరసావహించి, యవివేకపు ప్రజాళి తమ ప్రియబాంధవమిత్రుల ప్రాణములను బలి యిచ్చుచున్నారు. సామాన్య శ్రమాంశమును దానియనుబంధమగు శిక్షణమును వేఱుపఱచి, దూరముగనుంచి, వడిగ నడచిన శ్రమ సాధించిపెట్టిన తృప్తిని ఆనందమును మాత్రము సంగ్రహింపవలయుననెడి పేరాశయొక్క పర్యవసానమే యిదంతయు.

సమగ్రమగు ఆహారమువలె, సవ్యమగు శ్రమ శరీరమునకు బాధలయు శక్తిని, ఆరోగ్యమును, విశ్రాంతిని, సమకూర్చును. శ్రమ శారీరకముగ వ్యాయామమును కల్పించుటేగాక, మానసికపరిణామమునకు సంతుష్టికిని గూడ అవకాశముల నొసగును. కాని శిక్షణాంశమంతయు నిస్సారమై పడియున్న ఒక్క సంఘభాగము పైననే పడవేసి, శ్రమఫలితములో ఆనందప్రదాంశము నంతను ఉద్ధతినున్న సంఘభాగమునకై కూర్చిపెట్టియుంచుటయు ఆధునిక యుగలక్షణముగ నున్నది. ఇందుకొఱకుగాను శ్రమను భట్టీపెట్టి దాని భాగములను వేఱుపఱచి సుఖాంశమును మాత్రము తీసికొనగలమని భ్రమించుచున్నాము. అందలి కష్టాంశమునకును ఆనందప్రదరూపమును కల్పన చేసి, గోల్ఫు, టెన్నిసు, క్రికెట్టు, ఫుట్బాలు మున్నగు వ్యాయామపు ఆటలనెడు పేర్లతో మాత్రలుగా చేసి, సుఖాంశమును మాత్రము మ్రింగజూచుచున్నాము. ఈమాత్రలు బహుళవ్యయ కారణములగు భోగములై పేదలకు అలవిగాకున్నవి.

ఈవిధముగా శ్రమను మొంకెముగాచేయు ప్రయత్నము, నేల మీద ఆటపాటలందును వ్యాయామములందును మాంసకండరములు పొందుటలో అలవాటుపడిన చలనములను కల్పనచేయుటకై, సముద్రప్రయాణములు చేయు పెద్ద నౌకలమీద, సామాన్యముగా నవకాశము లుండవని తెలిసియు, సాగించు ప్రయత్నమును బోలి యున్నది. అటువంటి నౌకలమీద వ్యాయామస్థలముల నమర్తురు. అందు గుఱ్ఱపుస్వారీ, పడవలను తెడ్లువేసి నడపుటవంటివానికి ప్రతిరూపముగా నుండు వ్యాయామముల నేర్పాటుచేయుదురు. గుఱ్ఱపు రౌతు తురగాకారమున నున్న యొక యంత్రముపై నెక్కి కూర్చుండును. దాని కళ్ళెపు వారులను చేతబట్టుకొనును. విద్యుచ్ఛక్తి ప్రసారము గావించు గడియను ద్రిప్పును. అంతట ఆ యంత్రము గుఱ్ఱపు దాట్లు వేయుటను దౌడుదీయుటను అనుకరించును. ఆ యంత్రము యొక్క జీనుపైనెక్కి కూర్చుండిన యతడు నేలమీద పరుగులిడు గుఱ్ఱముమీద స్వారిచేయువానికి గలుగు కుదుపు ననుభవించును; కాని వానిక్రింద సజీవమగు తురగముండదుగదా! అటులనే తెడ్లులాగి పడవనడపు కృత్రిమవ్యాయామమును తీసికొను యాత్రికుడు బల్లపై గూర్చుండి, తెడ్లను చేబూని, కాళ్ళను తన్నిపట్టి ముందు వెనుకకు వంగుచుండును. స్ప్రింగుతీగలమర్చిన తెడ్లు సరిగ పడవ తెడ్లవలె చలించును. ఇచ్చట గుఱ్ఱపుస్వారిచేయుట, పడవ నడపుట వంటి వ్యాయామములకాదుగాని, నేలమీద గాలిలోను నీటిమీదను పరిసర ప్రకృతిదృశ్యముల నడుమను పోవునప్పు డనుభవించు స్వాభావసిద్ధమగు ఆనంద మొక్కడినుండి పొందగలము. కొన్ని దినములు, సముద్రయాన కాలమునందు, ఆ కృత్రిమపు టేర్పాటుల పబ్బము గడుపవచ్చును. కాని సహజసంఘటనలవలె అవి చిరకాలము తృప్త్యానందముల నొసగజాలవు. అటులనే శ్రమయొక్క

అంతర్భాగములగు ఆటపాటలు విడదీయబడుటయు, కొందఱు ఆట భాగమును, మఱికొందఱు పాటుభాగమును పంచుకొనుటయు జరుగ వచ్చును. అటుల జరుగు శ్రమవిభాగమున సమత శూన్యము గావున పాటు అనునది బండచాకిరిగను, ఆట అనునది ముచ్చటతీరు పనిగను పరిణమించును. ఇవి రెండును మానవాభ్యుదయమునకును, క్షేమము నకును హానికరములే యగును. దాసుడు కష్టహేతువగు పాటువలన ప్రాణములు పోగొట్టుకొనువాడగుచుండగా, ప్రభుడు విలాసము లను మఱిగి యీల్గుచుండును. యుగాంతరములనుండి యనేక సారు లుగా సాగింపబడుచు వచ్చిన యీ ప్రయత్నములు మానవ జాతికి పూర్ణత్వమును చేకూర్ప సమర్థములై పోవుచు వచ్చినవి. మన జీవిత కాలములోనే, శిక్షణాంశమును విసర్జించి, సుఖముల బడయువలయు ననెడు ప్రయత్నములు యుద్ధములను క్షామములను ఈతిబాధలను చావులను సంఘముపై బడవేసి, వేళ్ళచు పులివాత ద్రోసినటుల వెలసినవి. ఇకనైనను మనము కండ్లు తెఱచి, వాస్తవస్థితిని గుర్తించి, వెనుకకు తగ్గదగదా!

# అధ్యాయము 15.

## శ్రమవిభాగము

విశిష్టతను చతురతను సమకూర్చునట్టి శ్రమవిభాగ పద్ధతి వలన లాభముగను నుండుటను ఎవరును కాదనబోరు. మన దేశములో ఈ విశిష్టత అతి ప్రాచీనకాలము నుండియు ఆచరణలోనే యున్నది. దాని ప్రాబల్యము హెచ్చై పారంపర్యముగ వచ్చు ఆచారమై, కుల ధర్మముగ ఘనీభవించినది కూడను. ఆ ఆచారకాఠిన్యము వలన నెన్నియో కష్టములు వచ్చిపడినవి. అది మననొక పెద్ద అఖాతములో దింపినది కూడను.

శ్రమవిభాగము మహాక్షేమదాయకమను మిషతో పాశ్చాత్యులలో వస్తూత్పత్తిదారులు దానిక్రమము నతి సూక్ష్మ విభాగమునకు గురిచేసివేసిరి. అందువలన 'శ్రమ' యనిన బండచాకిరి యను భావమేర్పడినది. అది మిక్కిలి అసహ్యాలక్షణములు గల శాపముగ పరిణమించినది.

'శ్రమ' లేక 'పాటు' అనునది శ్రామికునికి ఆరోగ్యలాభముల సమకూర్పకలదిగ నుండవలయునెడల, అందే చిన్న అంతర్భాగముగాని నరములను త్రెంచునంత బాధాకరము కాకుండ చూడవలయును. అందుకై అవి భాగమున తగినంత వైచిత్ర్యమును నవీనతయు అమరియుండవలయును. కేవలము అధికోత్పత్తి కౌశలమే లక్ష్యముగ నుండతగదు. కాబట్టి శ్రమవిభాగచర్య కొక హద్దుండవలయును; ఆ హద్దును మీరినచో నది క్షేమకరముగ నుండజాలదు.

ఇటుల శ్రమభాగాంతరములు చేయబడగా తేలిన ప్రతి చిన్న భాగాంతరముకూడ సాధ్యమైనంతవరకు ఒకానొక పరిశ్రమయొక్క-

పూర్ణస్వరూపముగ నుండవలయును. కాని ఆ భాగాంతరము యేదే నొక పరిశ్రమ కార్యక్రమమున ఒక అంశమాత్రము కాదగదు. చూడుడు: వడ్రంగవృత్తిని విభాగములుగ చీల్చినయెడల, చక్రముల నిర్మించుభాగమునను, గానుగలను తయారుచేయు భాగమునను వేఱు చేయునగును. అప్పుడటుల నిర్మింపబడు సరుకులు వేర్వేఱుగ విక్రియమున కర్హమైనవిగ నుండగలవు. ఇట్టి విభాగమునకు మారుగా, వానిని కూడ చిన్న చిన్న అంతర్విభాగముల గావించి, చక్రాల అడ్డల నొకచోటను, పూటీల నొకచోటను, ఆకుల నొకచోటను, కోతకోయుట నింకొకచోటను జరుపు నేర్పాటు చేయునెడల, అందందు జరుగు 'శ్రమ' 'బండ' చాకిరియైపోవును. చర్మకార వృత్తి సందర్భములో బూట్ల నిర్మాణముగాని చెప్పులు తయారు చేయు పనిగాని ఒక పూర్ణ పరిశ్రమాంగము కావచ్చును. కాని మడమలకు సరిపోవు చర్మములను కత్తిరించుట యొక్క పరిశ్రమాంగమును, తోళ్ళచీలికలను కోయుట మరొక పరిశ్రమాంగమును, వేర్వేరుగ స్వయంపూర్ణ పరిశ్రమలుగాని, లేక, పరిశ్రమాంగములు గాని కానేరవు. నేటి భారీపరిశ్రమాలయములందు శ్రమవిభాగములను స్వల్పస్వల్ప ఖండములుగ చేసివేసి, ఒక్కొక్క శ్రామికునియొక్క పనియంతయు మేకులు కొట్టుటయో, లేక మరదిమ్మలు త్రిప్పుటయో, మరి యిట్టి యేదేని పనియో, యగునటుల హద్దులు పెట్టుచున్నారు. అటువంటిపనిని దినమునకు 8 గంటలచొప్పున సంవత్సరములో మూడువందలదినాలు, ఎవడైనను చేయునెడల, వానికి లభించు జీతపుసొమ్మెంతటిదైనను అగుగాక, వాని నరాలు చితికిపోయి వానిమతి చెడగా, నతడు పిచ్చివారి చికిత్సాలయమునకు పోవలసియే వచ్చును. అమెరికా సంయుక్తరాష్ట్రములబోలు ప్రపంచ విఖ్యాతిగన్న పరిశ్రమలకు నిలయములగు నగరరాజము లందలి

జనులు, అన్ని వ్యాధులవలనకంటె నాడీజాడ్యములవలన, చాల హెచ్చుగా పీడింపబడుచుందురు. అందు వింత యేమున్నది? నరుని తనువు నిర్జీవమగు జడయంత్రము కాదు. వాని శరీరనిర్మాణము వాని శక్తిసామర్థ్యముల నన్నింటిని సమముగ ప్రకటించుట కనువగు నభ్యాసచర్యల నవశ్యము కోరుచుండును. ఆతడు పూను శ్రమవిభాగాంశము తగినంత విశాలమైనదిగ నున్నచేతప్ప, ఆ యీప్సితము నెరవేరదు. శ్రమవిభాగాంశములు కడుంగడు చిన్నవై పూర్ణకార్య క్రమమున నత్యల్పచర్యలుమాత్రమే యగునెడల, స్వల్పకాలము లోనె శ్రామికుని నిరుద్యోగిని చేసివేయును. మరియు వానిశక్తులు అచిరకాలముననే వ్యర్థపడిపోవుచుండును. విశేషముగ కష్టపడి పని చేయు శ్రామికుడు నలుబదియైదేండ్ల యీడు వచ్చునప్పటికే శరీర పాటవమును కోల్పోవుచున్నాడు. ఇటుల మానవశక్తి హెచ్చుగ నష్టమైపోవుచున్ననుగూడ పరిశ్రమాధికారి నష్టపడక లాభమునే పొందులాగున కూలిపద్ధతి సృష్టింపబడియున్నది. ఆతంత్రము కారణ ముగా ఆ మానవశక్తియొక్క నష్టమంతయు సంఘముమీద పడు చున్నది. పరిశ్రమల యజమాని యేర్పాటుచేసిన యిట్టి శ్రమవిధా నమువలన ఎంత నరశక్తి వినాశమైనను, దానిజోలియే వానికిపట్టదు. ఏలన ఒకశ్రామికుడు అసమర్థుడై పడిపోవుపట్ల యజమాని వెంటనే వానిని తొలగించివేసి యువకుని నొకనిని వాని స్థానమున నియ మించుకొనగలడు. తొలగిపోవు శ్రామికునికిని యజమానికిని మధ్య భగ్నమైపోవు ప్రేమబంధ మనునది యిసుమంతయు లేదు. కాల్చి వేయగా మిగిలిన సిగరెట్టుముక్కను ఎంత నిశ్చింతగా పారవేయునో అంత సులభముగా తన సేవలో భగ్నజీవుడైపోయిన శ్రామికుని యజమాని నెట్టిపారవేయగల్గుచున్నాడు. యజమానికి హెచ్చు శక్తిసంపన్నుడగు యువకుని సేవలు వెనువెంటనే లభించుచుండును.

కావున వానికి లాభమేగాని నష్ట ముండదు. తన సేవలో ప్రవేశిం చిన నరుల జీవముల నటుల హరించినందుకై యజమానిని దండించు వారు లేరు. ఇట్టి పరిస్థితులవలన ప్రజల ప్రాణములును శక్తిసామర్థ్య ములును నశ్శించిపోవుట లేదా! ఇట్టి వినాశకర జీవన విధానమువలన శాశ్వతత్వము సాధ్యము కాగల్గునా? శ్రామికు లేమేని హెచ్చు కూలిని గడించుకొనుసటుల కాన్పించుచున్నను అయ్యది తమ నలు బదియైదేండ్ల పిమ్మట బ్రతుకునకై పొందదగిన మూల్యమును ఇప్పుడే వారు పుచ్చుకొనుచున్నారన్న మాట.

కూలి, ఉత్పత్తి, సంకీర్ణజీవనప్రమాణ పోషణము అనువానికి మితిమీరిన ప్రాధాన్యతనొసగి, నరుని యుత్తమశక్తుల నుపేక్షించు చున్నారు. వాని స్వాతంత్రేచ్ఛను భంగపరచు చున్నారు. వాని జీవన మూల్యమును తబ్బిబ్బుచేసి వేయుచున్నారు.

అటువంటి పరిస్థితులందు శ్రామికునిస్థితి గానుగనుద్రిప్పు ఎద్దుదశ వంటిదై పోవుచున్నది. ఆ యెద్దుకండ్లకు గంతలు కట్టుదురు. అందు చేత అది యెక్కడికిపోవు చుండెనో, యేదారిని పోవుచుండెనో దానికి తెలియదు. దాని ముక్కుత్రాడెట్లు లాగిన నదట్లు నడచును. దానిని నడుపుటకు మనుష్యుడుకూడ నవసరము లేదు. దానిముక్కు త్రాడు ఆ గానుగ దూలమునకు కట్టివేయబడి యుండును. ఆ త్రాడు తానుపోవలసిన గమ్యమును తెలుపుచున్నదని తలచి, ఆ యెద్దు గిరగిర గానుగచుట్టును నియమిత వలయములో దినమంతయు తిరుగుచుండును. అదట్లు దినమంతయు నడచుచునేయున్నను అది ప్రయాణించిన దూరమే లేదు. గానుగయజమాని ఆ యెద్దునకు తెలికపిండిని దినిపించుననుట నిజమే. అతడెంతయో ఆదరము పెంపున దానిపైని ప్రేమనొలికించు నటుల నటించును. ఆపిండియు ఆ యెద్దు దినమంతయు శ్రమపడి సిద్ధముచేసినరాశిలో నొకస్వల్పాం

శము మాత్రమేకదా! మనఫాక్టరీ శ్రామికులగతి యింతకన్న మిన్న
యైనదికాదు. జీవితానందమును గాని స్వేచ్ఛావాతావరణ సౌఖ్య
మునుగాని అనుభవించుటకు వారునోచుకొనరైరి! పరిణతిగాంచుట
కును వృద్ధిపొందుటకును వారి కవకాశములు శూన్యము. ప్రకృతి
సిద్ధమైన శ్రమవిధాన మిట్లుండదు. కాబట్టి శ్రామికుల యుత్తమ
శక్తిసామర్థ్యములు క్షయించి వినాశమై పోవుచుండును. ఈ నష్టము
నకు డబ్బురూపమున లభించుకూలి పరిహారము కాజాలదు.

ఈతీరుగ పరిశ్రమల యజమానులు 'శ్రమ' యొక్క కష్టాంశ
మును తప్పించుకొని, ఆ 'శ్రమ' యొక్క వినోదానందాంశమును
మాత్రము సంగ్రహించు యత్నముల సాగించుచుండ, ఆ 'శ్రమ'
నుండి విశ్రాంతిని చూరగొన వచ్చునని మనసోషలిస్టు మిత్రులు
ప్రతిపాదించు చున్నారు. సరిగాగ్రహించునెడల 'శ్రమ' యందే
'విశ్రాంతి' యిమిడియుండ వలయును. 'విశ్రాంతి' యనగా
తీరికసమయమని యర్థము. సంగీతపుస్వరములందు తాళమెట్టుల
ప్రధానాంశమై పఱగుచున్నదో, అట్లే 'విశ్రాంతి' యు 'శ్రమ'
యందొక ప్రధానాంశమై యున్నది. వాని రెంటిని వేరుపఱచుటకు
వలనుపడదు. విశ్రాంతియనగా సర్వక్రియా రాహిత్యమని అర్థము
గాదు. సర్వక్రియా రాహిత్యమన మరణమే. విశ్రాంతియనిన వ్యర్థ
కాల యాపనమునుకాదు. సోమరితనము అనగా వ్యర్థకాలయాప
నము క్షీణతనాపాదించును. ఉచితమగు విశ్రాంతివలన, ఒకరీతి
ప్రవృత్తికి తీరుబాటు లేక విరమణము లభింపగా, ఇతర రూపము
లగు మన ప్రవృత్తులకు పనికలుగు చుండును. వ్రాతబల్లముందు
కూర్చుండి మానసికకర్మచేయు మనుజునికి, ఆ పనిలో వానికి గలి
గిన నాడులయొత్తిడికి విరామమొసగి, తోటలోని మొక్కలకడ
పాటుపడుట వాని 'శ్రమ' కు పూర్ణతనొసగి ఆనందమును చేకూర్చ

గలదు. ప్రకృతి శాసించురీతిని ప్రయోజనకారియై ఫలింపవలెనన్న ఏ 'శ్రమ' యందైనను, నరుడు జోక్యముచేసికొని దానిని విషమ గతి బట్టింపనియెడల, ఇట్టివిభాగములు పరస్పరము పూర్ణతచేకూర్చు కొనుచు, ఆ 'శ్రమ' కు ధన్యతచేకూర్చును.

ఒకనాడొక 'శ్రమ' విధానమును గురించి అనుభవజ్ఞుడని ఖ్యాతి గన్న ఒకయింజనీయరుతో చర్చింపు చుంటిని. పాటు, విశ్రాంతి రెండును ఏకకాలమందు అనుభూతమగుటెట్లో తా నూహింపజాలనని ఆయన అధిక్షేపించినాడు. సిద్ధాంతరూపముగ దీనిని విశదము చేయుట కష్టమేకావచ్చును; కాని నిదర్శనము చూపుట సులభమే. కావున నేనాయనను ఏ శిల్పి కర్మశాలకైనను పోయి, తనకుతానే సమస్యా విమర్శనుచేసికొను డంటిని. ఆయన నామాట కొడంబడి, నాతోడనే యొకబడిపంతులు ఇంటికివచ్చినాడు. ఆతడు టోపీలను జేసి జీవనము గడుపుకొనువాడు. టోపీలుచేయుకర్మ క్రమములో అతనికి విశ్రాంతి యెక్కడనో, తీరుబాటు అనెడు వేఱు కర్మకలాప మెద్దియో విశదము చేయుడని ఇంజనీయరు నన్నడిగెను.

ఆ బడిపంతులు టోపీలు చేయుటలో ఏమేమికర్మలు చేయునో అడిగితిమి. ఆతడొక తట్టను తీసికొనివచ్చినాడు. అందుండి యొక ముఖమలుగుడ్డను దీసి, దానిలో అండాకారముగ నొక ముక్కను కత్తిరించినాడు. ఎఱ్ఱఅస్తరు (లైనింగు) గుడ్డను దీసి, దానిలోను ఆలాటిముక్కనే కత్తిరించినాడు. దీని కతడు కొన్ని ప్రాతకాగితపు ముక్కలను టాకీలు వేసి అతికించినాడు. తరువాత దాని నొక కుట్టు యంత్రములో బెట్టి కొన్ని చిత్రాకృతులను దానిపైన కుట్టినాడు. అంతట దానిని ముఖమలు గుడ్డపైన బెట్టి కుట్టినాడు. దాని మీఁది చిత్రాకృతుల ననుసరించి కొన్ని రంధ్రముల జేసి, ఇత్తడి గొట్టపుముక్కల నందు బిగగొట్టినాడు. వీనిగుండ గాలి ఆడుచుం

డును. ఈ గుడ్డను టోపీపైని మూతగ కుట్టునట. ఆ యా కర్మాంశ ముల నన్నింటిని అతడు నిర్వహించుచుండ ఇంజనీయరుగారికి నేను కొన్ని వివరములను చెప్పసాగితిని. ఆ ముఖమలుగుడ్డ ఇటలీనుండియు లైనింగుగుడ్డ జపానునుండియు వచ్చున వగుటచేత, వానిని సంగ్రహించు సందర్భమున కొన్ని అంతర్జాతీయ వాణిజ్యసమస్య లతనికి తట్టును. కత్తెర దీసికొని గుడ్డలు కత్తెరవేయుతరిని వానిలోని యొక రీతి కండరముల సమర్థత పని చేసినది. కుట్టుయంత్రముతో చిత్రాకారములను కుట్టునప్పుడు మరొక సమర్థత అనగా కళానిపుణతయు గాలిబెజ్జముల నమర్చునప్పు డింకొకతీరు కౌశలమును. వేరొక నాడీజాలమును పని చేయుచుండెను. ఊరక యిత్తడి గొట్టములు బిగించు సమయమున చిత్రకళానైపుణ్యమునకును తత్సంబంధమగు యూహాపోహాలకును పని యుండదు ; ఆతని కళానిపుణతకు అపుడు విశ్రాంతిదశ.

మే మిటుల ప్రసంగించుచుండగా దొడ్డిలోనుండి పంతులుకూతురు ఏడ్పు వినవచ్చినది. తత్క్షణమే అతడు చేయుచున్న పనిని విడిచి, పర్విడిపోయి, బిడ్డ నెత్తికొనినాడు. పెద్దమనుష్యులు వచ్చి యింటిలో నుండగ బిడ్డ నేడ్పించినందులకు సతిని మందలించినాడు. పంతులటుల భార్యతో తగవులాడుపట్ల ఇంజనీయరుతో నే నిట్లంటిని ; “ అదిగో, వారి కిప్పుడు సంపూర్ణమగు తీరుబాటు వినోదములు అనుభూతములగుచున్నవి”. “ఓహో! ఇపుడు మీభావము నాకు పూర్తిగ అర్థమైనది ” అనుచు ఇంజనీయరు పకపక నవ్వినాడు.

జీవితము ప్రకృతి ననుసరించి జరుగునపుడు, ప్రయత్నపూర్వకముగా తంటాలుపడి మన మేజోక్యమును తెచ్చిపెట్టుకొనకుండగనే తన సాధనోపాయముల నది కనిపెట్టి, తన యవసరములనెల్ల నదియే తీర్చుకోగల్గును.

శ్రమయు, జీవనపథమున, శ్రమధర్మమును ఉత్తేజన మొసగును. అది వరుని శక్తిసామర్థ్యము లన్నియు వినియోగపడు వసతులను కల్పించును. వానికి తన జీవితకాలమున పరిణతిపొందుటకవకాశము కలుగును. మరియు లోకము విడిచి పోవునపుడు అతడు శ్రమపడి యుత్పత్తిచేసిన వస్తురాశిపైన వాని వ్యక్తిప్రభావము స్థిరముగ ముద్రితమై నిలిచియుండును. అయ్యదియే వాని శ్రేష్ఠతమాంశము.

చిత్రకారుడు తనయందలి సౌందర్యభావమును పటపుటముమీదికి చేర్చి ఒక ఉత్తమచిత్రమును లోకమున విడిచి పోవుచున్నాడు. భావి సంతతివారు దాని నెంతయో మక్కువతో సంరక్షించి పూజింతురు. ఆ చిత్రశిల్పి రవ్వంత రవ్వంతగా రంగులను దీసికొని, పటపుటమున రుద్దుచుండు సమయమున, దినములు దినములుగా కష్టపడిచేయు బండ చాకిరిగ అది గోచరించియుండును. కాని ఆశ్రమయే శ్రేష్ఠమగు చిత్ర రాజముగా సిద్ధముకావలసి యుండెను. బొమ్మల అచ్చొత్తివేయు వతడు ఈ కష్టమును, ఈ బండచాకిరిని తప్పించుకొనగలడు. కాని అతడుఉత్పత్తిచేయు చిత్రపటములు, వాస్తవికచిత్ర శిల్పి రచించిన ఉత్తమ చిత్రముతో పోల్చి చూచునెడల, వానిపటములు లన్నియు తుక్కుకాగితపు ముక్కలనుమించిమాననీయములు కావు.

చిత్రరచనాకార్యము ప్రారంభమగుటకు పూర్వము సయితము, రంగులను కలుపుటలోను, వర్ణద్యుతుల నిర్ణయించుటలోను గంటల కొలది కాలము చాల కష్టపడి అతడు పనిచేయవలసి యుండును. అజంతాగుహాలలో వినియోగింపబడిన రంగులు ఇన్ని శతాబ్దములు చెక్కుచెదరక నిలచియుండు లీల, పూర్ణస్థితికి వచ్చు పరిణతిని సాధించుటకెన్ని దశాబ్దులు పట్టెనో? ఆనాటి యా చిత్రకారులు అందుకు వలయు శ్రమ నర్పించుటకు వెనుదీసి యుండలేదు. వారి సంతానము వారు తమకు ప్రసాదించియున్న సాటిలేని కళాసంపదం గూర్చి

జోహారు లర్పించుచున్నారు. అట్టి ధన్యప్రతిభ నార్జించుట కవసర మైన శ్రమను అర్పణము గావింపకుండ, ఆ కళానిధులు తమ సాధనములను తమ యుపాయములను కనిపెట్టియుండరుగదా! ప్రకృతి చాల కాఠిన్యము చూపు అధికారిణి. ఉత్సాహశూన్యులై వెనుకాడుచు చేయు శ్రమకు మెచ్చి, యీ ప్రకృతి యెన్నడును శాశ్వతత్వమును ప్రసాదించునది కాదు. మనము శాశ్వతఫలమును పొంద నభిలషింతుమా నిరంతర చిరకాల శ్రమపడవలసినదే. తాత్కాలికముగా సంతోషము గొలుపు క్షణభంగురపు శ్రమవలన, మనకు వచ్చిపడున దంతగా నుండదు. ప్రకృతి యెన్నడును భ్రమపడునది కాదు, భయపడి లొంగునది కాదు.

అటులనే యెల్లోరాలో గొప్ప పెనుశిలయందు అల పెద్దదేవళమును తొలిచి ముం దెన్నితరములనాడో జననము గాంచనున్న తమ వంశీకులకు పిత్రార్జితముగ ఆ కళాస్రష్ట లొసగిన దివ్యసంపద వారి శ్రమఫలితమగు సౌందర్యనిధియే. ఆ ప్రమాణవిజ్ఞత, ఆ రూప సౌష్టవము శ్రమను తప్పించుకొను కడకయొక్కగాని, సులభోపాయముఃలయొక్కగాని ఫలితార్థము కాజాలదు. నిష్కపటముగ సాహసించి కాలోచితకార్యముల నిర్వహించినవారి శ్రమయొక్క సత్ఫలమే అది. సవ్యమార్గమున చేకొనిన శ్రమ, శ్రామికుని వాని శ్రమ కారణముగా లభించిన యుత్పత్తిని ధన్యము చేయగలదు.

శ్రద్ధాపూర్వకముగ నిర్వహింపబడిన వినిర్మలశ్రమం గూర్చిన మరొక యుదాహరణమును వివరింతము: ఢిల్లీలో కుట్బుమినారు సమీపమున నొక ఉక్కుస్తంభము కలదు. దానిపై నొక పురాతన శాసనము కూడ గలదు. ఆ స్తంభము ఎండవానలనుండియు, శీతోష్ణముల నుండియు ఏలాటి రక్షణము లేకుండ బహిరంగప్రదేశమున శతాబ్దులకాలము నిలిచియున్నది. ఐనను దానిపైన నలుసంతత్రుప్పు

కాన్పింపదు. అందలి లోహముల కూడిక, పటిమ కల్పింపబడెనో యీనాటి లోహకారు లెందరో శోధించి కనుగొనలేక విభ్రాంతు లగుచున్నారు. ఈ ధ్వజరాజమును పోతపోసిన ప్రాచీన లోహ శిల్పులు దాని నిర్మాణమునకై, శ్రమనివారక కృత్రిమోపాయముల కంటబడినవారు కారు. ఆ యా లోహములతోడి దాని నిర్మాణమున కవసరమగు శ్రమను, శిక్షణమును తప్పించుకొనెంచి యుండరు. వారు ప్రకృతి శాసించినరీతినే శ్రమను గ్రహించియుండిరి. కావున ఆ లోహ స్తంభ మీనాడు మనకా సత్యము నత్యంత గంభీరముగ ప్రకటించుచున్నది.

ఐశ్వర్యము సుఖభోగము బంగారుగనుల పరిశ్రమతో సంబంధించి పెరుగుచుండునను భావము పెక్కండ్రకు కలదు. కాని కష్టాంశమగు బండచాకిరి నొకతరగతి ప్రజలకును, సుఖాంశమగు నైశ్వర్యమును వేరొకతరగతివారికిని కట్టబెట్టు విధానము మన భారతదేశములో బంగారుగనులకు పేరెన్నికగాంచిన మండలమును దరిద్రనిలయముగ చేసివేసినది. ఆ జిల్లాలోని రయితులు తమ ఆవులను "ద్వివిధ వినియోగము" పాలు చేయవలసినంతగా డబ్బునకు మొగమువాచి లేమిని గుడుచుచున్నారు. "ద్వివిధ వినియోగ" మనగా నేమిటి? ఆవులు పాడివగునెడ నాలుగుచుక్కలు పాలిచ్చుట; యొండిపోయిన సమయమున నాగలికి గట్టబడి నేల దున్నుట— అను రెండు తెఱగుల వినియోగపడుచున్నవి.

ఆ ప్రదేశమునందు నేను సంచారముచేయుకాలమున, ఏడువేల యడుగుల లోతుగల యొక గని గోతిలోనికి నన్ను దీసికొనిపోయిరి. అచట చీకటిలో 'డేవిసు' లాంతరొసగు మిణుకు మిణుకుమను వెలుగు సాహాయ్యమున శ్రామికులు సొరంగములలో దూరి పని చేయు చున్నారు. చట్టురాయి తగిలినచోట తుపాకిమందు కూరి కాల్చి

వగులగొట్టుదురు. ప్రొద్దు పొడిచినది మొదలు క్రుంకువరకు నాలుగు
డబ్బుల కూలి కాసించి, అపాయములకు లోనైన, దుమ్మునకు ధూళి
యునకు ఆ మట్టికి సొరంగములలో శ్రామికు లెందరో పాటుపడు
చున్నారు. ఇంత చేసినను వారికి కడుపునిండ కూడు లేదు. వారి
కిచ్చు కూలి స్వల్పము. శ్రమయా చాల హెచ్చు. సాయంతనమున
వారిని విశాల శుభ్ర వాతావరణములోనికిని వెలుగులోనికిని లేవదీసి
నపుడు, వా రెంతయో అలసి, సొమ్మసిలి యుందురు. జవసత్వము
లుండవు. ఆ సంస్థానప్రభుత్వమువారి ఆదాయములో ఆ జిల్లానుండి
కల్లు సారాయిలమీద వచ్చు రాబడియే చాల హెచ్చు. మిగుల
సొక్కిపోయిన ఆ శ్రామికుల నరముల సత్తువ నిల్పుకొనుటకు కల్లు
ముంత కిరుణించి ప్రసాదించు కైపుతప్ప తరుణోపాయము లేదని
వారు భ్రమించుట అబ్బురమా! గనుల పనివారలలో వ్యభిచారము
సుఖజాడ్యములుకూడ అధికమే. ఎచ్చటెచ్చట మితిలేని శ్రమవలన
నరజాలము నలిగిపోవుట గలదో, అచట సహజముగనే సేదదీర్చు
కొను సాకుగా స్త్రీకొరకును, సారాయికొరకును పరువులు పెట్టుట
కాననగుచున్నది. మానవశరీరనిర్మాణమున కనుసరణముగు మానవ
సిక జాడ్యములలో ఇదొకటిగ నున్నది. నా దర్శనానంతరము ఆ ఖని
యజమాని సాంఘిక క్షేమముకొరకై యేదేని యుద్యమముం గూర్చి
నే నేమైన సలహా నీయగలనా యని అడిగినాడు. గనులలో పని
చేయు శ్రామికుల నుద్ధరించు నుపాయమును దెలుపుడని అర్థించి
నాడు. నేను రెం డుపాయముల దెలిపి, యే యొకదానినైన అనుస
రించు డంటిని. (i) శ్రమయొక్కయు, పాటుయొక్కయు, గౌరవమును
పునఃప్రతిష్ఠించు నిమిత్తము ఆ గనిపనిని మూసివేయు డంటిని. లేని
యెడల (ii) ఆ శ్రామికుల దుఃఖములను పూర్తిగ మరుగుపఱచజాలు
నంతటి సారాదుకాణములనైన పెట్టించు డంటిని. నా సలహా విని

ఆ యజమాని స్వాధీనమైపోయెనని వేరుగ చెప్పనక్కరలేదు. ఈ రెండు వర్గములకు నడుమ అగాధములే. కాని కంపెనీ పెద్దపెద్దలాభముల సంపాదించుటకుగలంత వృద్ధిలో నున్నది. ఆ కంపెనీవారికి మానవ వ్యక్తుల క్షేమముకంటె సంపదోత్పత్తి, డబ్బు కాబట్టి హెచ్చుప్రధానములు కదా?

ప్రకృతిసిద్ధమగు శ్రమవలన ప్రాప్తిలాభమును బడయగోరితిమేని శ్రమయొక్క ప్రాథమిక సహజస్వరూపమును సాధ్యమగునంతవరకు నిలిపిపట్టవలయునేగాని ఆ శ్రమయే నిరుపయోగమైపోవునంతగ సూక్ష్మవిభాగము చేయ సాహసింపదగదు.

కూలి:— ఉచితరీతిని జరుగు శ్రమను గూర్చి ప్రకృతి యెట్లు బహూకరించునో శ్రామికుల కది యెట్లు లాభముల చేగూర్చునో తెలిసికొంటిమి. అటుల శ్రమవలన చేకూరు లాభమే సహజమగు కూలి.

జీవనము 'సంకీర్ణమై' రాగా రాగా నరుడు శ్రమవిభాగమును మితిమీరి ప్రవేశపెట్టుచుండును. మొత్తముమీద చేకూరిన లాభములోని స్వతస్సిద్ధాంశమునకు మారుగా డబ్బురూపమగు కూలిని శ్రామికునికి తిరిపెమిడినటుల నొసగుచుండును. శ్రమయొక్క వాస్తవిక ధర్మమును సదా మన కండ్లయెదుట నుంచుకొందుమేని, తికమకలుపడి మన మారీతిగ పెడత్రోవలకు త్రొక్కు నవసర ముండదు.

దురదృష్టవశమున కూలిపద్ధతి తలచూపినప్పటినుండి ప్రాధాన్యత శ్రమయొక్క ధర్మముమీదినుండి మారి, శ్రమవలని యుత్పత్తి పైకి గంతిడినది. అచ్చోటనే నిలిచినది. ఆ కారణమువలననే యీనాడు సహజధర్మమును ప్రక్కకు నెట్టివేసి, ఉత్పత్తిసమస్య రాజ్యము చేయుచున్నది. విశాలములగు పణ్యక్షేత్రములందు, అత్యధికమగు లాభముల గడించులాగున విక్రయింపగల ఉత్పత్తుల (సరకుల) గూర్చి

మాత్రమే యజమాని సదా తలపోయుచుండును. కావున అత్యల్ప
మగు ఖర్చుతో, అత్యధికోత్పత్తిని చేయించవలయు ననెడు సమ
స్యయే వాని నావహించి యుండుచున్నది. సరకును ఉత్పత్తి చేయిం
చుటకే ఆతడు కూలి నొసగుట. నైతికధర్మ మేమైపోయినను 'శ్రమ'
పరిస్థితి యెట్టి పరివర్తన మందినను, సాధనప్రయోగ మేతీరు దైనను
పర్యవసాన మెటువంటిదైనను కనిష్టక కూలిడబ్బుల కాశపడి,
వస్తూత్పత్తిచేయు శ్రామికులు ఒండొరులతో పోటీలు పడుచు,
తండోపతండములుగ, తమంత తాము వచ్చి జొరబడుచున్నారు.
డబ్బును మించిన ప్రమాణమునకును ఈ సమస్యాపరిష్కారమున
ప్రసక్తి లేదు. ఈ విధముగ 'శ్రమ' వ్యాపారసంబంధమున చిక్కు
వడిపోయినది. శ్రామికుడు హెచ్చుకూలి నిచ్చు నాశపెట్టు యజ
మానికి బానిసయై అమ్ముడువోవుచున్నాడు. యజమానియో వీలగు
నంత చౌకకూలి నొసగి, తన శ్రామికులను ప్రోవుచేసికొన జూచు
చుండును.

ఆఫ్రికా పడమటితీరమున పట్టువడిన బానిసలను అమెరికా
సంయుక్తరాష్ట్రము లందలి తోటలలోనికి చేరవేయు ఓడలను నడు
పుటకై బానిసల వర్తకునికి నావికులు కావలసివత్తురు. చీనావారికి
బలాత్కారముగ విక్రయించు నల్లమందును తయారుచేయు నిమి
త్తము, తన చేలలో గసగసాలను ఉత్పత్తిచేయుటకై క్షేత్రపతికి
కూలీలు కావలసియుందురు, డబ్బురూపమగు కూలి తప్ప, యేలాటి
నైతిక సాంఘికప్రసక్తియు పెట్టుకొనకుండ అవసరమగునంతమంది
శ్రామికులు దొరకుటే వానికి కావలసినదెల్లను! నైతికమూల్యముల
ప్రమేయము వానికి పట్టనేపట్టదు.

తనబిడ్డకు పాలిచ్చుతల్లి తనబిడ్డకు పాలిచ్చుచుసాకు సందర్భమున
గాని తనపిల్లలకు వంటచేసిపెట్టు విషయమునగాని, 'సేవాపరిపోషణ'

నిధానములో ప్రకృతి ప్రవేశపెంచిన తీరున. తనధర్మమును ఉత్సాహం చును. తనబిడ్డలు తుష్టిగా తిని సుఖముగా ఎదుగుచుండుట చూచుకొని ఆనందించుటే తల్లికోరుకొను ప్రతిఫలము. అదియే ఆమె 'కూలి' యనవలెను.



పాలదాది పరులబిడ్డకు పాలిచ్చునప్పుడును, వంటకత్తె డబ్బుకై పరులయింట అన్నము వండునప్పుడును 'సేవాపరిపోషణము' నుండి 'సాహసపరిపోషణ' దశకు వారు పడిపోవుచున్నారు. ఈరెండు సందర్భములందును, తల్లియొక్క శ్రమ జీతపు డబ్బుకాశించి పరులబిడ్డకు పాలిచ్చుదాది వ్యాపారసరళి లోనికిదిగి పోవుచున్నది. దాదియు, వంటకత్తెయు తమకుదొరకు డబ్బునుబట్టి గిట్టుబాటును గణనచేసి కొందురు. బిడ్డలక్షేమమో ఆ తరువాతి సంగతి.

అవసరము కలిగిగాక, తనసౌందర్యమును నిలుపుకొను కాంక్షకు లోనై సహజమైన తనపాలను బిడ్డకీయక, అందులకు మారుగ డబ్బీ పాలను తనబిడ్డకు త్రాగించునెడల అట్టితల్లి ఇంకను పడిపోయి 'స్తేయపరిపోషణ' స్థితికి దిగజారిన దగుచున్నది. డబ్బీపాలనుత్పత్తి జేయు నతనికి బిడ్డగోడు పట్టదు. అతనికి కావలసినదెల్ల బజారులో తనసరకు హెచ్చువెలకు విక్రయించుకొనగల్గుటే. అందుకై అతడు లేనిపోనియోగ్యతల నన్నింటినీ తనసరుకున కారోపించి ప్రకటనల సాగించును. తల్లియొక్క సౌందర్య రక్షణనుగూడ వానివ్యాపార పరమలక్ష్యములలో చేర్చి చాటుచుండును.

డబ్బాపాలను గూర్చిన బూటకములౌ అతిశయోక్తులతో గూడిన ప్రకటనలు సాగించుచున్నచల మనమింకను 'పరాన్నపరిపోషణ'కే దిగజారిపోవుచున్నట్లగుచున్నది. అప్పుడు వర్తకుని చేతిలో బహు డబ్బే అన్నిటికి ప్రధానము. బిడ్డకేమైని హానికలిగినను చింతయే లేదు. ఈతీరుగా రాను రాను మాతృధర్మము, డబ్బులాభము కొఱకు ఆకాశించి, తల్లికి బదులుగ మాతృస్థానము నాక్రమించునటుల నటించు



తల్లి 'సౌందర్య' సంరక్షణకై బిడ్డకు డబ్బిపాలు

పెకటింద్ర పాలిట పడిపోయినది. అందుమూలమున పవిత్ర మాతృధర్మము, తత్సంబంధమగు క్షేమాభ్యుదయకర కర్మములతో సహా రూపుమాసి పోవుచున్నది. మిగులునదెల్ల వట్టివ్యాపారము; డబ్బుతో కొనుట, డబ్బునకమ్ముట.

ఒకానొక కాలమున కాశ్మీరదేశమునందు మేలిరకపు దుప్పట్లు తయారు చేసెడివారు. ట్కరీతువాళ్ళవలె రోమముతో నమరియుండి, అవెంతయో మెత్తగాను వెచ్చగానుగూడ నుండెడివి. వానిని తయారు చేయుటలో నక్కుడివారు అత్యంతమగా చాకచక్యము చూపెడివారు. వాని యుత్పత్తికి చాలకాలము పట్టును. ఆకారణముచేత నవి చాల ప్రియముగ నుండెడివి. కాలక్రమమున నవి రూపుమాసిపోయినవి. వాని స్థానమునూ మిల్లుదుప్ప ట్లాక్రమించినవి.

కొండొకకాలమున చర్ఖాసంఘ ప్రచారకులలో నొకనిదృష్టి కొల్లకె రాళ్ళను చితుకగొట్టు బీదవారిపై బడినది. అతడు సాగించిన విచారణనుబట్టి వా రొకప్పు డారకపు మేలిదుస్తులు చేసెడివారనియు, ప్రత్యేకముగ వా రాకళయందు సంచినిపుణు లనియు తెలియవచ్చినది. వారి సరకులకు గిరాకీ తగ్గిపోగానే వారి వృత్తి యడుగంటిపోయినది. వారి సుశిక్షితకళాకౌశలముగూడ ప్రపంచమున కపురూపై పోయినది.

శ్రమపైనుండు ప్రాధాన్యత ఉత్పత్తిమీదికి మారిన కారణమున, హస్తకుశలురగు శ్రామికులు కటా! రాళ్లు పగులగొట్టు కూలివారుగ మారవలసివచ్చినది. మానవనిపుణతను సద్వినియోగము గావించుటకు ఆర్థికశాస్త్రానుగుణ్యమును సహజము నగు విధాన మిదియేనా? శ్రమయొక్క వాస్తవికధర్మమును ఉపేక్షించి డబ్బురూపమౌ కూలి పద్ధతి నవలంబించుటవలన మూడిన అనర్థమే యిది! యంత్రాల మీద ఉత్పత్తిచేయబడిన సరకుల దిగుమతివలన, శ్రామికుల ధన్యజీవనము గంగపాలైపోయినది. ఇంగ్లాండులో నొకప్పుడు స్వతంత్ర జీవనము చేయుచుండిన రయితు లెటుల బ్రిటిషు ఫ్యాక్టరీలలో దీనులగు కూలివాండ్రుగ మారిపోవలసి వచ్చెనో గ్రహించియుంటిమి. అటువంటి ఫ్యాక్టరీలలో తయారైన సరకుల దిగుమతివలన, మన దేశములోని నరజీవులును తమ బ్రతుకుకొఱకు నోరులేని పశువులతో పోటీకి దిగవలసిన దుర్గతి పట్టినదిగదా! నరుడు ఎద్దులయు గుఱ్ఱాలయు స్థానము నాక్రమించి, సరకుబండ్లను రిక్షాలను లాగుట, అనేక నగరములలో మనము సాధారణముగ చూచు దృశ్యమే కదా? పారిశ్రామిక దేశములందలి 'శ్రమనివారణోపాయముల' ప్రతిబింబమే యిది. ఇంగ్లాండులో నిట్టిది శ్రమనివారణ గావింపవచ్చును. కాని.

భారతదేశములో నిదియే, శరీరమున ప్రాణముల నిలుపుపాటి తిండినైన సంపాదించు కొనజాలక నరుడారాటపడుటకు మూలమగు చున్నది. క్రొత్త కష్టముల నెన్నిటినో తోడదీసికొని వచ్చు చున్నది. సమస్యా పరిష్కారము గావింపగల యే విధానమువలనను ఒక తావున కలిమి మరొక తావున లేమి సృష్టికాదగదు. కర్మ కుశలుడగు శ్రామికుని రాళ్ళపగులగొట్టు కూలివానిగనో, రిక్షాలు లాగువానిగనో మార్చి గ్రాసమునకై ఆరాటపడు పశువులతో పోటీ పడజేయు ఏ విధానమునేని అభ్యుదయ చిహ్నమందుమా?

శ్రమకు అన్వర్థమౌ పూజ్యస్థానమును మరల దానికొసగవలసి యున్నాము. అపుడది మానవ శక్తిసామర్థ్యములకు శ్రేష్ఠతమ పరిణతిని చేకూర్పగలదు. ఉత్తమశీల నిర్మాతయై వెలయగలదు. ఇందు కృతకృత్యులము కాగల్గుదుమేని శ్రమను దాస్యశృంఖలముల నుండి విముక్తము చేసిన వారమగుదుము. దానినైజధర్మ ప్రవృత్తికి అవకాశముం గల్పించిన వారమగుదుము.

నరునిముఖము జీవప్రభతో వెలుంగుటకు శ్రమభాస్కరప్రభలు వానికవసరము. సవ్యమౌ శ్రమ కేవలము శ్రామికునకేగాక, చుట్టు నున్న వారందఱకును వెలుగును వెచ్చదనమును ప్రసాదింపగలదు. ప్రేమమయియగు తల్లి తన బిడ్డలకొఱకు శ్రమపడి పనుల జేయునపుడు తానానందము ననుభవించుటేగాక, కుటుంబము వారందఱును ఆమె ప్రేమయొక్కయు శ్రద్ధయొక్కయు అమృతఫలరసము ననుభూతి చేయగల్గుదురు. బిడ్డల శరీరములు మనస్సులు పరిపోషింపబడును. వారు వీర్యవంతులై పౌరులుగ వర్ధిల్లుదురు. ఎంత సమర్థతతో శ్రమపడినను దాదిగాని, యింటి దాసిగాని గృహలక్ష్మియై మాతృ స్థానము అలంకరింపజాలదు. అదే విధముగ శ్రమయొక్క పరమ

ధర్మమును, ఎఱగా నొసగబడు కూలిడబ్బు నిర్వహింపజాలదు. తన్నిష్ఠేమను కొనుటకును అమ్ముటకును ఎటుల నలనుపడదో కళాకుశలుని యభిమానము నటుల వర్తక సరళిలోనికి దింప వీలు పడదు. అగుచో దాని ప్రతిభయే భగ్నమైపోవును.

తనకు రాగల డబ్బుపైగల శ్రద్ధనుబట్టి రోగి నాదరించు వైద్యుని కన్న రోగియందును రోగమునందును శ్రద్ధవహించు చికిత్స విషయమును చక్కగా విశదీకరించు వైద్యుడు హెచ్చు విజ్ఞానమును అనుభవమును గడింపజాలును. మొదటివాడు ధనకాంక్షయొక్క ప్రేరణ వలన శ్రమదీసికొనును. రెండవయతడో ఆశ్రమయందు తనకు గల అభిమానమువలన పనిచేయును. ఈతడు జాగ్రత్తగా వృత్తిని నిర్వహించును. మొదటివాడు మందులనమ్ముకొను వ్యాపారి మాత్రమే. అతడు రోగులకు నిర్ణీతమైయున్న ఔషధముల వినియోగించుచు మందుల నుత్పత్తిచేయువాని పక్షమున పనిచేయు విక్రయదారుడగుచున్నాడు. ఒకడుచావ సిద్ధముగ నుండవచ్చును. సమర్థుడౌ వైద్యున కీయవలసియుండు డబ్బురుసుము నీయలేనివాడగునెడల వానిగోడు నావైద్యుడు విచారింపడు. ఇంకొక వరుడు ఆర్భాటములు చేయువాడు కానగును, అతని సంచినిండుగ రూకలున్న చాలును. కావలసినంత వైద్యసేవ, కోరిన మాత్రాన వానికి లభించును.

అదే తీరున తన యొద్దకు వచ్చిన కక్షిదారుని వ్యాజ్యమును నైతిక దృష్టితో విచారించి, తదనుగుణ్యముగ పనిచేయు నతడు వృత్తినిబట్టి న్యాయవాది యనందగును. తనకు వచ్చు రుసుమును బట్టి పనిచేయు న్యాయవాది న్యాయశాస్త్రముతో వ్యాపారము చేయువాడగును. ఆశాపాత్రుడగు తన న్యాయవాదిని తృప్తిపఱుప

జాలునంతటి డబ్బు చేత లేని హేతువువలన చెఱసాలలో క్రుగ్గుచున్న పురుషు లెందరో కలరు.

అదేమి దురదృష్టమోగాని, ప్రతిజీవన నీతియు అంగడివీథికి లోబడిపోయి డబ్బు ప్రధానమగు ఆర్థికనీతి చేతులలో చిక్కిపోవుట చేత మానవధర్మ దృష్టితో వర్తించుచు తమ తమ వృత్తి నీతిని నిర్వర్తించు పురుషులు గానవచ్చుట మిగుల అరుదై పోవుచున్నది.

మనము పరీక్షించిన సందర్భములన్నింటను ప్రాధాన్యత శ్రమ నుండి తొలగింపబడి, కూలిడబ్బుమీద నిలుపబడుచున్నది. కూలి యందు నిర్మాణాంశము శూన్యముగనుండు గావున, పురోవృద్ధియు శూన్యముగనే యుండును. మన దేశములో వైద్యశాస్త్రమున చెప్ప దగినంత పరిశోధన గావించిన పురుషుని నొక్కనినైన గాంచ లేకుంటిమిగదాయని ప్రజలు వాపోవుచుందురు. కారణమునకై దూరము వెదుకవనిలేదు. ఆవృత్తి 'స్తేయపరిపోషణ' యొక్కయో 'పరాన్న పరిపోషణ' యొక్కయో స్థితికి దిగలాగబడి, అవలంబ నము చేయబడుచున్నది. 'సాహసపరిపోషణ' దశకు చేరినవారు కొద్దిమంది. 'సమూహపరిపోషణ' దశనుగాని 'సేవాపరిపోషణ' దశనుగానిఅందుకొనినవారుచాల అరుదు. కర్మక్షేత్రము కడువిశాల మగుటచేతను, చక్కనికట్టుబాటులుగల వసతులు లేమిచేతను, వారి ప్రావీణ్యత ఫలప్రదమగుటలేదు.

న్యాయశీలురును సత్యప్రియులునగు ప్రవర్తకులు ప్రతిక్షేత్రము నందును అరుదుగనే కనబడుచున్నారు, బహుళశః ధనరూప పరి పోషణ విధానము పాలనము చేయుపట్ల, అట్టి స్థితి అనివార్యమై యొప్పును. శ్రమకు మారుగా కూలిడబ్బు, ఉత్పత్తిరాశి యనునది క్రమేణా అధికారస్థానము నాక్రమించి వేయుచుండును.

శ్రమయొక్క తత్వమును గ్రహించి దానిననువర్తించు నెడల, స్థూలశరీరమున కాహారమెట్టిదో, సూక్ష్మతరశక్తులపట్ల శ్రమ అట్టిదై యుపకరింపజాలును. శ్రమ ఉత్తమనరునికి పుష్టి నొసగును; జవసత్వములు ప్రసాదించును. వానికి సాధ్యమగునంత శ్రేష్ఠతమ కార్యముల నిర్వహింప ప్రోత్సహించును. వానియందుండు పశు లక్షణములకు పరిణతి మార్గములందు శిక్షణగఱపి, వాని స్వాతంత్ర్యేచ్ఛకు పరమోత్తమ గతులనెఱపును. నరుడు తన మూల్య ప్రమాణముల ప్రదర్శించి, తన వ్యక్తి ప్రభావమును ప్రవర్ధనము గావింప నాధారపడును.

---

# సారాంశము

శ్రమను విభజించు ప్రయత్నమునందు మన ప్రధానదృష్టిని శ్రమ యొక్క ధర్మమునుండి తొలగించివేసి యంత్రయజమాని సందర్భమున ఉత్పత్తిరాశిమీదను, శ్రామికుల సందర్భమున కూలిడబ్బు మీదను నిలుపు టెట్లు సంభవించునో తెలిసికొంటిమి. ఆ విభాగము యొక్క ఫలితార్థము మహానర్థదాయకమై ప్రధానగమ్యముగా నుండదగిన శ్రామికుని యోగక్షేమమును దృష్టినుండి జారవిడుచుట సంభవించినది.

ప్రకృతిలోని సహాకారమునకు ముఖ్యోద్దేశము శ్రామికుని ఆత్మ లాభ మనియు గ్రహించియుంటిమి. శ్రామికుని క్షేమమే అందుకు ప్రత్యక్షఫలము. తేనెటీగవిషయము చూడుడు : అది మొక్కలందు చూలు కల్పనచేయుట తన ప్రధానకర్తవ్యముగ భావించుట లేదు. పూదేనెను పుప్పొడిని పోగుచేసికొనుటయే దాని ప్రధానోద్దేశము, ప్రకృతియొక్క దృక్పథమునుండి చూచునెడల, తేనెటీగ కావించు సేవకు అదియే తృప్తికరమగు పూర్ణప్రతిఫల మగును.

శ్రమవిభాగవిధానమువలన లాభములను అనేక అంతర్భాగము లుగ విభజించుట సంభవించుచున్నది. జీతములు, కూలి, అద్దె, వడ్డీ మొదలగున వన్నియు లాభమును పృథక్కరింపగ వచ్చు అంశ ములే; శ్రామికుడు పాటుపడి సమకూర్చిన లాభములో హెచ్చు భాగము అందువలన వానికి దక్కకుండ పోవుటే పర్యవసానము, స్వలాభాపరుడగు వ్యాపారి వచ్చి దూరి, సంపాదింపబడు లాభములో హెచ్చుభాగమును తస్కరించుకొని పోవుచున్నాడు. తేనెపట్టులో ప్రవేశించి తేనెటీగలు కష్టపడి కూర్చిన పదార్థములనెల్ల తినివేయు మైనపుపురుగువంటివాడే యీ వ్యాపారి.

ఈ పరిశీలన సాగించి మనము నేర్చుకొనిన సారాంశ మేమన:— ప్రకృతిలో జీవులు పరస్పరసహకారమును పెంపొందించుకొనుటకు స్వలాభకాంక్షయే ప్రధాన ప్రేరకశక్తి. ఆ లాభమును తస్కరించు ప్రయత్నములెల్ల 'శాశ్వతపరిపోషణము'నకు విరుద్ధములైనవే. ఎప్పుడో కొంతవరకు హింసాచర్యకు మూలమగునవియే, సోషలిస్టులు న్యాయమగు పంపుదును ప్రతిపాదింతురు. కాని వారుమున్ముందుగా లాభములను పోగుచేసి ఆ పిమ్మట నెప్పుడో పంపుదులు సాగింపవచ్చునందురు. వారి యీ ప్రణాళిక ప్రకృతియొక్క ఉదారవిధానమునకు కేవలము విరుద్ధము. ప్రకృతి నేరుగ లాభములను పంచిపెట్టును. ఈ సోషలిస్టుల విధానమువలననుకూడ తుదకు హింసాచర్యయే పర్యవసించును.

పథకరచన :— పరిపోషణపథక నిర్మాణమున కిది యదను కాకపోయినను ఉత్పత్తిరాశిని కూలిని మాత్రమే దృష్టిలో పెట్టుకొని యే పథకరచనకైనను పూనుకొనుట ప్రకృతివిరుద్ధచర్య యగునని యీ సందర్భమున పేర్కొనుట అప్రస్తుతము కాదని తోచుచున్నది. మన లక్ష్యసిద్ధికి అనుకూలమై, శాశ్వతపరిపోషణమునకు సాయపడగల యే పథకరచనకైనను 'శ్రమ' యొక్క సహజధర్మమును కేంద్రస్థానమున నిలిపి సాగింపవలసి యుండును ; మరియు ఎవరికొఱకై 'శ్రమ' నిర్ణయమైనదో అటువంటి మానవజీవియొక్క సమర్థతయు స్వభావమును దానికి పునాదిగా నుండవలయును.

వ్యవసాయకుడు ధాన్యమును నూర్పిడిచేసి తెచ్చి పురులలో నిలువచేయును. ఎలుకలు వానిలోనికి బొఱియలు చేసికొని ప్రవేశించును. అపుడా వ్యవసాయదారుడా సమస్యను చేకొని, తదనుసారముగా కుటుంబపోషణకై పథకమును వేయును. ఎలుకలు రాకుండు

నుపాయముగా పిల్లి నొకదానిని పెంచును. ఎలుకలను వేటాడుట పిల్లికి నైజమగుటచేత వాని పథకము ప్రకృతికి అనుసరణముగా నున్న దగుదము. అంతట పిల్లిపాలకై ఆవును కొనును. తుదకు ఆవు పోషణకును సంసారమును దిద్దుటకును భార్యను తెచ్చుకొనును. అట్టి ప్రకృతి ధర్మానుసరణమగు పథకరచన ఫలప్రదము కాగల్గును.

• దురదృష్టవశమున ఈనాడు నిర్మాణమగు పథకము లన్నిటికిని ఉత్పత్తిరాశియే కేంద్రవిచారణాంశముగ నున్నది. కూలివిషయము గూడ కొంత వారి గణితములోనికి వచ్చును. జర్మనీలోను, రష్యాలోనువలె, అటువంటి పథకములు సత్వరఫలముల నొసగు ననుట నిస్సందేహామే. కాని అవి శాశ్వతములు కావు. మరియు శాంతిసౌఖ్యము గమ్యముగ నిడుకొని నడువని కారణముచేత, వానివలన తుదకు హింసాకాండ బయలుదేరగలదు; తప్పదు. తస్మాత్ జాగ్రత! జాగ్రత! జాగ్రత!

---

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి, కాపీలు 1000 —11/48